# ఆంధ్రప్రదేశ్



"పార్వణం శ్రవణయోః మనసోఽక్ష్ణోః

ఏప్రిల్, 1965

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 9
సంచిక : 6

ఏప్రిల్, 1965
చైత్రం - వైశాఖం 1887 శకం

ప్రధాన సంపాదకుడు
టి. రామచంద్రరావు

సంపాదకుడు :
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## విషయ సూచిక



మా పాఠకులకు ప్రధాన సంపాదకుని
ఉగాది శుభాకాంక్షలు

మొదటి అట్ట :

ఫొటో : శ్రీ యస్. ఆర్. కె. రావు

పార్వణం శ్రవణయోః మనసోఽక్ష్ణోః।
నర్తనం సహజభావసుందరం.॥

సహజమైన భావప్రకటనలచేత సుందరముగ నున్న నృత్యము చెవులకు, మనస్సునకు, కన్నుల కున్ను ఆనందమును గలిగించునదిగా నున్నది.

రెండవ అట్ట :

ఫొటో : శ్రీ టి. రామచంద్రరావు

కృత్స్నస్య జగతః సోఽయం ప్రతిబింబ ఇవస్థితః।
ఆకాశ ఇవ దుర్లంఘ్యః దక్షిణః సాగరో మహాన్॥

ఆకాశమువలె దుర్లంఘ్యమైన యీ దక్షిణ మహా సముద్రము సమస్త జగత్తుయొక్క ప్రతిబింబమా అనునట్లు ఉన్నది.

మూడవ అట్ట :

ఫొటో : శ్రీ యస్. భగవాన్ దాస్

ఇయం కుసుమ సంఘాతైః ఉపస్తీర్ణా బభౌ మహీ.

పువ్వుల సమూహములచేత వ్యాపించిన ఈ భూమి ప్రకాశించెను.

నాల్గవ అట్ట :

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః॥

(భారతదేశమునకు) ఉత్తర దిక్కునందు హిమాలయమను పర్వతచక్రవర్తి దేవతాస్వరూపుడుగా నిలిచియున్నాడు.

లోపలి ఫొటోలు :- సర్వశ్రీ టి. రామచంద్రరావు, నందగోపాల్ నాయుడు, జగదీశ్వరరావు, సయీదుద్దీన్.

ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు

# ముఖ్యమంత్రి లేఖ



ప్రియమైన చదువరులారా!

ఈ నవ ఉగాది శుభ భానూదయవేళ మీకు నా హృదయపూర్వక శుభాభినందనాలు.

దేశంలో వసంతాగమనానికి ఉగాది చిహ్నం. ప్రకృతి రంగురంగుల వస్త్రాలు ధరిస్తుంది. వింతవింత వాసనలు ప్రకృతిలో నిండుకొని ప్రాణులను ఉత్తేజపరుస్తుంటాయి. ప్రతి మనిషీ ప్రకృతి లావణ్యానికి ముగ్ధుడై పోతుంటాడు. అతనిభావాలు రెక్కలు కట్టుకుని ప్రకృతి సౌందర్యాన్ని వెతుకుతూ పర్యటిస్తుంటాయి. ఇప్పుడు నేను యీ లేఖలోకూడా పర్యటనలను, ఆ విహారాలను- ముఖ్యంగా, మన ప్రియరాష్ట్రాన్ని గురించి వ్రాస్తున్నాను.

ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశానికి ప్రయాణం చేయడానికే ఆధునిక పరిభాషలో విహార పర్యటన అంటున్నాం అని మీకు తెలుసు. మనిషి - అతడు యువకుడైనా, ముదుసలైనా - అతనిలోని ఉబలాటాలలో ఒకటి పర్యటన కాంక్ష. మనిషికీ మనిషికీ కాలానికీ కాలానికీ యీ ఉబలాటాల్లో తేడా వుంటుంది. చిన్నతనంలో పర్యటించాలన్న కోరికలో ఎక్కువగా ఉత్సుకతే ఉంటుంది. పెద్దయ్యేకొలదీ అది నిగ్గు తేలుతుంటుంది. పర్యటనలో ఉద్దేశ్యం ప్రకృతిని దర్శించడం కావచ్చు లేదా ఆనందాన్ని అనుభవించడం కావచ్చు. లేదా వ్యాపారం నిమిత్తమో, ఆధ్యాత్మిక అనుభూతికొరకో అదీకాకపోతే విజ్ఞాన సముపార్జనకో కావచ్చు.

పందొమ్మిదో శతాబ్దారంభంవరకూ పర్యటనలు కేవలం సమీప ప్రదేశాలకే పరిమితమై వుండేవి. అదీ ఏ నడకనో లేదా పాత కాలపు ప్రయాణ సాధనాలద్వారానో సాగుతుండేది. అయితే కొంతమంది గుండెనిబ్బరం గలవారు దూరప్రదేశాలకూ, అపరిచిత భూములకూ వెళ్ళుతుండేవారు. మనపూర్వీకులు కాలినడకనో, ఎద్దుబళ్ళమీదనో కాశీ మొదలయిన పవిత్ర యాత్రాస్థలాలకు వెళ్ళినట్టు అనేక కథలు మీరు వినే వుంటారు. విదేశాలలో సాహసవంతులు కొందరు పొంగిపొర్లుతూ ఉరకలు వేస్తున్న తమ ఉత్సాహోభినివేశాలతో కొత్తకొత్త పచ్చిక భూమిని వెతుక్కుంటూ సాహసంగా మామూలు పడవలమీద అనంతమైన సముద్రాన్ని దాటడానికి గూడా ప్రయత్నించారు. వాళ్ళలో చాలామంది సముద్రగర్భంలో కలిసిపోయారు. వాస్కోడిగామా, కొలంబస్‌లాంటి బహు కొద్దిమంది మాత్రం విజయులై విచిత్రాలైన కొత్త ప్రదేశాలను కనుగొని స్వస్థలానికి సురక్షితంగా తిరిగివచ్చారు.

రైలుబండి, మోటారు శకటాలను కనిపెట్టడంతోనూ, విద్యుచ్ఛక్తిని కనుగొనడంతోనూ మనిషికి తనపాత అలవాటును వీడి దూరదూర ప్రదేశాలకు కూడా నిర్భీతిగా, సుఖంగా వెళ్ళేందుకు ఒకకొత్త ప్రోత్సాహం లభించినట్టయింది. విమానాన్ని కనిపెట్టడంతో ఆకాశాన్నీ, కాలాన్నీ అతిక్రమించే అవకాశంకలిగి నిజంగా మనిషి విశ్వంలోకి ఎగరడానికి అతనికి రెక్కలు గలిగినట్టే అయింది. ఇటీవలి స్పుత్నిక్కువల్ల మనిషి పర్యటనశక్తి కొత్త పుంతలు తొక్కినట్టయింది. విశ్వంలోని చంద్రగ్రహానికి, అంగారక గ్రహానికి, యింకా యితర గ్రహాలకు ప్రయాణాలు సాగించాలనుకుంటున్నాడు మనిషి. వ్యోమగామి తన స్పుత్నిక్కునుండి బయటి వాతావరణంలోకి అడుగుపెట్టి, యిష్టం వచ్చినప్పుడు తిరిగి దానిలోకి వెళ్ళిపోగలిగేటంత ఉన్నతస్థాయికి శాస్త్రీయ సాంకేతికవిజ్ఞానాలు, అభివృద్ధిచెందాయి. ఇంకా ఎలాంటి విచిత్రాలు జరగనున్నవో మనకు తెలియదు. అయితే బాగా డబ్బు వుండి, తగినంత సమయం లభించిన బహుకొద్దిమందికి మాత్రమే ప్రపంచ పర్యటనానుభవాలూ, ఆనందాలూ లభ్యమవుతున్నాయి. సామాన్యుడికి పర్యటనలు, విహారాలు యింకాకొన్ని స్థలాలవరకే పరిమితమైవున్నాయి.

ఈనాడు పర్యటనకు అర్థం, వ్యాపారానికీ, ఆనందానికీ కొద్ది రోజులో, ఎక్కువరోజులో దూరప్రాంతాలకు వెళ్ళడం- అని చెప్పుకోవచ్చు. ఇది ఎన్నోహంగులూ, రంగులూ పులుముకుని; అలంకారాలూ, ఆభరణాలూ తగిలించుకుని రకరకాలరూపాలు పొందినప్పటికీ వీటన్నిటినీ ప్రధానంగా అంటిపెట్టుకున్న అసలు విషయం ఒకటే. అదే - క్రొత్తప్రదేశాలను చూడాలనే అభిలాషతో పర్యటనచేయడం అన్నమాట.

చుట్టూవున్న ఆనందమయజగత్తును దర్శించడంమాని దూరతీరాల

లోని సౌందర్యాన్నీ, ఆనందాన్నీ వెతుకుతూవుండడం మనిషి బల హీనతల్లో ఒకటి. సాన్నిహిత్యంవల్ల ఒక విధమైన అలుసు, అలక్ష్యం మనకళ్ళమీద మబ్బులాగ పొగమంచులాగ కమ్ముకుని మన చుట్టూ వున్న వస్తువుల అందం కనుపించక, "దూరపుకొండలు నునుపు" అన్న సామెతగా దూరప్రదేశాల్ని మెచ్చుకొంటుంటాం మనం. తెలివిగల యాత్రికుడు ఎప్పుడూ తన చుట్టూ అలుముకున్న పొగమంచును, మబ్బుల్ని చీల్చుకుంటూ దృష్టిసారించి తనచుట్టూ వున్న సుందర దృశ్యాలనూ, వింతలనూ దర్శించి ఆనందిస్తాడు. ఈ దృష్టితో చూచినప్పుడు మన భారతదేశం – ముఖ్యంగా మనరాష్ట్రం – ప్రపంచంలోని ఏదేశానికీ తీసిపోని సుందర ప్రకృతికి ఆలవాలమైనదని చెప్పవచ్చు. అందువల్ల ముందుగా మనం మన రాష్ట్రంలో ఎలాంటి రమణీయ ప్రకృతి నిండివుందో ఒకసారి చూచుకోవాలి.

విహారయాత్రికుల సౌందర్యపిపాసను తీర్చడంలో ఏమాత్రం ఆంధ్రప్రదేశ్ ఏరాష్ట్రంతోనూ వెనకపడి వుండదని చెప్పడం అతిశయోక్తి కాదు. భౌగోళికంగా యిది భారతదేశం మధ్యభాగంలో ఉంది. దీనికి 600 మైళ్ళదూరం సముద్రతీరంకూడ ఉంది. 2000 అడుగులఎత్తు పీఠభూమి క్రమంగా వంపులోకి దిగువకువెళ్లుతూ మనోహరమైన తూర్పుకనుమలదాకా ప్రాకుతుంది. కృష్ణా, గోదావరి, తుంగభద్ర, పినాకినీలవంటి అనేక మహానదులు అన్నివైపులా భూములను సస్యశ్యామలం చేస్తూఉన్న అదృష్టవంతమైన రాష్ట్రం మనది. ఇలాంటిది దేశంలో మరేదీలేదు. తూర్పుకనుమల పర్వత పంక్తులలో దట్టమైన అడవులు సుందరంగా కనపడుతూ ఉంటాయి. అనేకప్రదేశాలలో శీతోష్ణస్థితి ఆహ్లాదకరంగానూ, పీఠభూమిలో దేహారోగ్యకరంగానూ ఉంటుంది. ఇక్కడ కాశ్మీరులోవలె ఎన్నో సుందరసరస్సులు కనిపిస్తాయి.

వేల సంవత్సరాలుగా యిది అనేక నాగరికతలకు పుట్టినిల్లు. కొన్నిశతాబ్దాల వరకు యిక్కడ బౌద్ధమతం వర్ధిల్లింది. మహాయానసిద్ధాంతప్రవక్త ప్రసిద్ధ బౌద్ధభిక్షుకుడు నాగార్జునుడు సాంస్కృతిక కేంద్రాన్ని యిక్కడే నెలకొల్పాడు. కాకతీయ, శాతవాహన, విజయనగర రాజుల రాజ్యాలు యీ గడ్డమీదే వర్ధిల్లినాయి. సంస్కృతమూలంనుండి ఉద్భవించిన మన తెలుగుభాష సంస్కృత లాలిత్యాన్ని సొగసుసొంపులను సంతరించుకుని, గానానికి, లయకు అనుగతమై మంజులరవశోభితమై "ప్రాచ్యదేశపు ఇటలీభాష" అన్న సార్థకనామధేయముగలదై ఉన్నది. ఆంధ్రులసంస్కృతి, నృత్యసంగీతాలు, కళావైభవాలు భారతఔన్నత్యాన్ని యినుమడింపజేశాయి. అవి మన పురాతన వాస్తు శిల్ప నిర్మాణాల అసమాన కళావైదగ్ధ్యాన్ని చాటుతాయి. సౌందర్యానికి కాణాచి అనదగి ప్రకృతిదృశ్యాలకు ఆలవాలమైన ప్రదేశాలు మనరాష్ట్రంలో అనేకములున్నాయి. ప్రశాంతమైనది అరకులోయ. దానికదేసాటి. తాళవృక్షాలు వరుసలుగా ఉన్న డెల్టాలు మనోహరంగాఉండి దక్షిణ సముద్ర ద్వీపాలతో పోల్చదగినవిగా ఉంటాయి. కనుమలనుండి, కొండచరియలనుండి, సమతల ప్రదేశాలనుండి మెలికలు తిరుగుతూ గలగలధ్వనులతో ప్రవహించే నదులు ఎల్ల వేళలా ఆనందానుభూతిని కలిగిస్తూఉంటాయి. నదీసైకతాలను ఆనుకొని మైళ్ళకు మైళ్ళుగాఉన్న పచ్చని పచ్చిక బయళ్ళ ప్రదేశాలతో సమానమైనవి దేశంలో మరే ప్రాంతంలోనూ లేవు. తిరుపతి, శ్రీశైలం, అహోబిలం, సింహాచలంవంటి ప్రదేశాలలోని పర్వతశిఖరాలపై అతి పురాతన దేవాలయాలు వెలసి ఉన్నాయి.

వీటన్నింటికీతోడు అనేక సుందర దృశ్యాలుగూడా రాష్ట్రంలో అక్కడక్కడ నిర్మింపబడ్డాయి. విజయవాడవద్ద కృష్ణాబ్యారేజి, విశాఖపట్నంలో నౌకాశ్రయం, నూనె శుద్ధి కర్మాగారం యాత్రికులకు నేత్రపర్వంగా కనిపిస్తాయి. ఒకసంవత్సరంలో పూర్తికానున్న నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రపంచంలోని అతిఎత్తైన రాతి ఆనకట్ట గలిగి ఉంది. దీనినుండి 110 చ. మైళ్ళ విస్తీర్ణంలో నీరు ప్రవహిస్తుంది. శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయినతర్వాత చూస్తే ఇంతటి మనోహర, ఆనందమయ ప్రదేశం భారతదేశంలో మరెక్కడా కనిపించదు అనితోస్తుంది. పాకాలలోని వన్యమృగరక్షణ ప్రాంతాన్ని అభివృద్ధి పరచినప్పుడు ఇది దేశం యిలాంటి యితర ప్రాంతాలకు ఏమాత్రం తీసిపోదు,

మనరాష్ట్ర శోభ అందరిదృష్టిని ఆకర్షించడానికి వీలుగా ప్రత్యేకంగా యాత్రికుల ఉపయోగార్థం నాలుగవ ప్రణాళిక కాలంలో బృహత్తరమైన కార్యక్రమాన్ని అమలుపరుచాలని ప్రభుత్వం నిశ్చయించింది. అన్ని ప్రాజెక్టు స్థలాలవద్ద పర్వతపంక్తుల నుండి ప్రవహించే జలపాతాల వద్దను విశ్రాంతిగృహాలను నిర్మించాలని ప్రతిపాదించారు. పవిత్ర యాత్రాస్థలాల వద్దకూడా విశ్రాంతి గృహాలను నిర్మిస్తారు. మన సరస్సులను అభివృద్ధిపరచి వాటిలో వేగంగావెళ్ళే పడవలను ప్రవేశ పెడ్తారు. ప్రత్యేకంగా విదేశీయ యాత్రికుల సౌకర్యార్థం, హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలోను, పరిసర ప్రాంతాలలోను, విజయవాడ, విశాఖపట్నాలలోను ఆధునిక సౌకర్యాలను గొప్పగా ఏర్పాటు చేస్తారు. జలమార్గాలకు తోడు అధికసంఖ్యలో వచ్చె యాత్రికుల సౌకర్యార్థం స్థలమార్గాల నిర్వహణకు గూడ అనేక బస్సులను ఏర్పరుస్తారు. మన రాష్ట్రానికి ప్రత్యేక రైల్వే మండలం యేర్పడినప్పుడు రాకపోకల సౌకర్యాలు మరింత అభివృద్ధి చెందుతా యనడంలో సందేహంలేదు.

మన రాష్ట్రంలోని ఆకర్షణీయమైన యీ ప్రదేశాలను ప్రజలు పూర్తిగా వినియోగించుకుంటారనీ, మనదేశ యాత్రాపటంలో అచిరకాలంలోనే ఆంధ్రప్రదేశ్ ప్రముఖస్థానం వహిస్తుందనీ నేను ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను.

జైహింద్!

# వసంతఋతువు

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

క॥ కంతుశరసఖము, వీరు
త్కాంతావిభ్రమనియామకము, పికరుతివి
క్రాంతిస్థాయివిధాయక,
మంత వసంతము శుచిప్రియం బై పొలిచెన్.

క॥ తనరథమును బూనుపురా
తనవాహనములను మార్పుతలఁపుననో నాన్
దినకరుఁడు తురగజననా
వని గలయుత్తరముదిశకు వడిఁ జనఁ బూనెన్.

క॥ యమదిఙ్మరుదేణము బా
ణమునఁ దునిమి గాలిచాలనం బణఁచఁగ గం
దములను నిలుచుపులిందుం
దమిఁ బ్రార్థింపంగ వలయుఁ దలంగిఁప వెతన్.

క॥ దీనత యిది వృథ యగునో
పూనరు వైరము సమీరమున శబరులు, కే
శీనిరతనిజవధూజన
మీనాంకగ్లాని నది శమింపఁగఁ జేయున్.

క॥ క్రమముగ వర్ణజ్ఞానో
ద్యమనియముఁడు మధుఁడు వ్రాయునతురమాలా
క్రమ మన మహిఫలకంబున
భ్రమరీపదచిహ్నసుమపరాగం బడరెన్.

క॥ ఊగుదువేడుక బల్లవు
లూగి మఱలుగఱిత లంది రుప్పరవీదిన్
మూగినవేల్పువెలందుల
లోఁ గననౌ సోయంగబులో సగపాలున్.

క॥ యమదిగనిలరాశీకృత
సుమరేణూత్కరము సూడఁ జొప్పు సెడని దై
సమదమధుద్విరదంబున
కమరించినపాంసుశయ్య లనఁగాఁ బరఁగెన్.

క॥ తరుణీశ్రోణీవిస్తా
రరుద్ధదోలావిలాసరమ్యఫలకమం
దరుదుగ విలు వంచినసుమ
శరునకు మివులం బ్రవేశమయం బబ్బెన్.

ఉ॥ దోలల నూగు ద్రావిడవ
ధూటుల శ్రోణులవేగ మీగుచున్
లాలితసింహళీవదన
లబ్ధకనద్ఘనసారవాసనం
దేలుచుఁ జందనాచలవి
నిర్గతవాతవితానముల్ విలా
సాలసలోకజాలసము
దంచితసేవలఁ గాంచఁ గల్గెడిన్.

మహాస్రగ్ధర ॥

దను జేంద్రోద్యానలీలాతరుతలగతసీ
తాపదాంకప్రయుక్తిన్
ఘనసారద్వీపవేలాగహనతలరజ
స్కంబు లై కిన్నరస్త్రీ
జనకేళీవీటిచూర్ణస్ఖలితముఖహృత
శ్రాంతి మై మోద మందెన్
ననవిల్కానిం జయం బందఁగ మెయికొనుచున్
దక్షిణాశానిలంబుల్.



# ఆడది మల్లె

వీధి దీపాలు వెలిగాయి. అయినా ఆ ఇంటి ముంగిలి చీకటిగానే ఉంది. కృష్ణారావు ఇంటిముందున్న మొక్కల దగ్గర్నుంచి వరండాలోకి వచ్చాడు. సోఫాలో కూర్చుని నిట్టూర్పు విడిచాడు.

"వరండాలో లైటన్నా వేయలేదేం?" వంటగదిలోనుంచి బయటికి వచ్చిన కాంతమ్మ అంది.

భార్యమాట వినిపించుకోనట్లే లేచి కృష్ణారావు గేటుదగ్గర కొచ్చాడు. వీధిలో కేసి కాసేపు చూసి మళ్ళీ లోపలకు వచ్చాడు. వరండాలో లైట్ వెలిగించి సోఫాలో జారిగిలపడుతూ భర్తను చూసి కాంతమ్మ అన్నది.

"ఎందుకూ కాలు కాలిన పిల్లిలా ఇంట్లోకీ బయటకూ తిరుగుతారు? ఇప్పు డేం కొంపలు మునిగిపోయినై?"

"నీ కలాగే ఉంటుందే? అదే నీ కడుపున పుట్టిన బిడ్డయితే ఇలా ప్రవర్తిస్తావా?" అన్నాడు కృష్ణారావు విసురుగా వచ్చి సోఫాలో కూర్చుంటూ.

"బాగానే ఉంది సంబరం? నన్నంటాలేం? తమ్ముడి మీద అంత ప్రేమ కారిపోయేవాడివి వెళ్ళలేకపోయావూ?" అంటూ రుసరుస లాడుతూ కాంతమ్మ లోపలకు వెళ్ళింది.

అవును! తను వెళ్ళి ఉండాల్సింది. స్కూల్లో పేరెంట్సుడే అనీ, అందరి పిల్లల తల్లిదండ్రులూ వస్తారనీ, తననూ, వదినీ తప్పక రమ్మని చంద్రం మరీ మరీ చెప్పి వెళ్ళాడు. కృష్ణారావుకు ఆనాడు తల్లి అన్న మాటలు జ్ఞాపకం వచ్చి ఎక్కడో గుండెల్లో కలుక్కుమన్న ట్లయింది.

"ఇక తండ్రివైనా తల్లివైనా నీవే చంద్రానికి" అంటూ తల్లి పార్వతమ్మ తమ్ముణ్ణి తన చేతిలో పెడుతూ ప్రాణాలు వదిలింది.

"మామయ్యా! మా టీచర్లంతా చంద్రాన్ని ఎంత పొగిడారనుకున్నావ్! అన్నిట్లోనూ ప్రథమ బహుమతి చంద్రానికే. ముఖ్యంగా చంద్రం తను రాసిన కవిత్వం చదివితే వచ్చిన అతిథులంతా ఎంత ఆనందించారనుకున్నావ్ మావయ్యా! అందరూ ఎవరబ్బాయి అంటే ఎవరబ్బాయి అని అడిగేవాళ్లే!" చంద్రానికి లభించిన బహుమతుల్లో సగం మోసుకొని వచ్చిన పక్కింటి ప్రసాదరావు గారి అమ్మాయి హేమ గబగబా గుక్క

వాసిరెడ్డి సీతాదేవి

తిప్పుకోకుండా చెప్పసాగింది.

కృష్ణారావుకు ఆనందం, విచారం రెండూ ఒకదాన్నొకటి త్రోసుకు వచ్చాయి. తలెత్తి తమ్ముడి వైపు చూశాడు. చంద్రం తన చేతిలో ఉన్న పాకెట్లను టేబులుమీద పెడుతున్నాడు. చంద్రం వదనంలో ఎంత దాచాలన్నా దాగని విషాదచ్ఛాయలుకనిపిస్తున్నాయి.

'మావయ్యా! నువ్వూ అత్తయ్యా రాలేదని చంద్రం ఎంత బాధపడ్డాడనుకున్నావ్? అందరూ తనను పొగుడుతుంటే చంద్రం ఏమీ వినిపించనట్లే ఉండిపోయాడు. అతని కళ్ళు చివరవరకూ మీ కోసం వెతుకుతూనే ఉన్నయ్" అన్నది హేమ, ఒక్కొక్క ప్యాకెట్ విప్పి చంద్రానికి వచ్చిన బహుమతులను కృష్ణారావుకు చూపిస్తూ.

"ఆఫీసులోనే ఆలస్యం అయింది. అందుకే రాలేకపోయాము;'' కృష్ణారావు తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో అన్నాడు.

చంద్రం ఇదేమీ గమనించనట్లే తన గదిలోకి వెళ్ళిపోయాడు. అతని వెనకే హేమకూడా వెళ్ళింది.

కృష్ణారావుకు తమ్ముడు చంద్రం అంటే అమిత ప్రేమ. కాని అతని భార్య కాంతమ్మకు జడిసి తన ప్రేమని పైకి చూపించాడు. కాంతమ్మకు కారణం లేకుండానే మరిది చంద్రం అంటే వళ్ళు మంట. అసలు ఆమె తత్త్వమే అంత. ఆమెకు తన కూతురు రజని అంటే తప్ప ఇంకెవరన్నా ఎలాంటి అపేక్షలూ, మమతలూ ఉన్నట్లు కనిపించదు. కనీసం కట్టుకున్న ఆయనమీద ఎంత ప్రేమాభిమానాలున్నాయోగాని భర్తఅని అయినా గౌరవం లేదు. సాధారణంగా ఆడవారికి పుట్టింటివారంటే ఉండే అభిమానం, మమత కూడా ఆమెలో ఉన్నట్లు గోచరించదు.

కృష్ణారావుతాత వయస్సులో ఉన్నప్పుడు గుంటూరులో పొగాకుకొట్టు పెట్టి ఆకుకూడా అమ్మి అలా అలా చనిపోయే నాటికి లక్షలు ఆర్జించాడు. నాలుగు పొగాకు బ్యారెన్లుకూడా కట్టించాడు. పొగాకు వ్యాపారంతోపాటుగా వడ్డీ వ్యాపారంకూడా చేసేవాడు. అసలు ఆయన ఆర్జించిందంతా వడ్డీవ్యాపారంలోనూ, తాకట్ల వ్యాపారంలోనూ అని అంటారు ఆయన సంగతి తెలిసినవాళ్లు. ఆయనకు ఒక్కే కొడుకు భద్రయ్య. భద్రయ్యకు వ్యాపారంలోని మెళుకువలు అంతగా తెలియవు. అతని హయాములో కుదువపెట్టుకున్న నగలు చాలావరకు నకిలీ నగలని తేలింది. పొగాకు వ్యాపారంలోకూడా లాభాలు తగ్గాయి. ఆయన పోయేనాటికి తండ్రి వదిలిపోయిన ఆస్తిలో సగం ఆస్తీ, భార్యా, ఇద్దరు కొడుకులూ మిగిలారు. అప్పటికి కృష్ణారావుకు పందొమ్మిది సంవత్సరాలు. తాతగారి తెలివి పెద్దకొడుక్కు వచ్చిందని మురిసిపోయేవాడు తండ్రి భద్రయ్య. బి. ఏ. చదువుతున్న కృష్ణారావు తండ్రి మరణంతో చదువుకు స్వస్తి చెప్పి వ్యాపారంలో దిగాడు. భార్య కాపరానికి వచ్చిన మరునాడే అర్థం చేసుకున్నాడు కృష్ణారావు — తను నలుగుర్లో అల్లరి పడకుండా గౌరవంగా బతకాలంటే అవిడ ఇష్టానిష్టాలకు అనుకూలంగా ప్రవర్తించక తప్పదని."

తండ్రి చనిపోయేనాటికి చంద్రం ఐదేళ్ళవాడు.

ఆ మరుసటి సంవత్సరమే తల్లి పోయింది.

చంద్రానికి స్కూల్లో వచ్చిన బహుమతులన్నీ ఒక్కొక్కటే చూసుకున్న కృష్ణారావు ఆనందానికి అంతులేకపోయింది. కాని ఆ ఆనందాన్ని బయటకు వెలిబుచ్చలేని తన అసమర్థతమీద తనకే కోపం వచ్చింది. తన తమ్ముడు చాలా తెలివైనవాడు. ఈ సంవత్సరంతో స్కూలు ఫైనల్ అయిపోయింది. ఇప్పటి నుంచే వ్యాపారంలో పెడితే తనకు చేదోడు వాదోడుగా ఉంటాడు. వ్యాపారము ముందుముందు మూడు పువ్వులు ఆరుకాయలు కాగల అవకాశం ఉంది. ఇంకో నాలుగైదు సంవత్సరాలకు ఒక ఇంటివాణ్ణి చేస్తే తన బాధ్యత తీరిపోతుంది.

ఆలోచిస్తున్న కృష్ణారావు దృష్టి బయటకు వెళ్ళిపోతున్న హేమవైపు మళ్ళింది. హేమ చక్కని పిల్ల! చంద్రం కంటే రెండు సంవత్సరాలు చిన్న. ఏపుగా తోటకూర మొక్కలా పెరిగిందేమో చంద్రం కంటే ఓ సంవత్సరం పెద్దగానే కనిపిస్తుంది. హేమకు చంద్రం అంటే ఎంతో ఇష్టం. ఆ భగవంతుడు కనికరిస్తే తన తమ్ముడంత అదృష్టవంతుడు ఉండడు అనుకున్నాడు కృష్ణారావు.

హేమమాలిని ప్రసాదరావు ఏకైక పుత్రిక. వారి కుటుంబం మొదటినుంచీ విద్యా సంస్కృతులకు ఆలవాలమై ఉంది. తాతగారు జడ్జి, తండ్రి వకీలు. ప్రసాదరావు అన్నగారు పబ్లిక్ ప్రాసిక్యూటరు. ప్రసాదరావు మాత్రం చిన్నప్పటినుంచీ సాహిత్యం అంటే అభిరుచి చూపించేవాడు. కవిత్వం అంటే చెవికోసుకొనేవాడు. తండ్రి అతని అభిరుచినిఅర్థం చేసుకొని ప్రసాదరావును తను వంశపారంపర్యంగా వస్తున్న వకీలు వృత్తినుంచి తప్పించి తెలుగు ఎం. ఏ. చెప్పించాడు.

ప్రసాదరావు ఆర్ట్సుకాలేజీలో లెక్చరరుగా చేరాడు. ఆయనంటే అందరికీ ఎంతో గౌరవం. సంస్కృతిని నిర్వచించటము కష్టం. కాని ప్రసాదరావు మూర్తీభవించిన సంస్కృతి అనేవారు అందరు. ఆయన వదనంలో పేరును సార్థకం చేస్తూ ప్రసాదగుణం ఉట్టిపడుతుంది.

ప్రసాదరావు పాతిక సంవత్సరాలు నిండకుండానే భార్యను కోలుపోయాడు. అప్పటికి హేమ రెండేళ్ళది. మళ్ళీ పెళ్ళి

చేసుకోకుండా హేమను అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాడు. సవతితల్లి ప్రేమ మీద ఆయనకు నమ్మకం లేదు. హేమను తన ఆదర్శాలకు అనుకూలంగా మలచుకుంటూ వస్తున్నాడు శిల్పి మట్టిముద్దను మలచినట్లు.

హేమ సాహిత్యం అన్నా లలితకళ అన్నా ఎంతో అభిరుచిని చూపిస్తుంది. వినయ విధేయతలు ఆమెసొత్తు. అంతచిన్న వయస్సులోనే అలవరుచుకున్న గాంభీర్యం, ఆమె ప్రవర్తనలో నిండుతనం, స్కూల్లో మాష్టర్లందర్నీ చకితుల్ని చేసేవి.

హేమ తెల్లగా సన్నగా ఉంటుంది. మధ్యకు విరిచికట్టిన రెండు జడలూ ముందుకు పడుతుండే కొంచెం వంగి నడుస్తుంది. కళ్లు పెద్దవి కాకపోయినా వయస్సును మించిన భావాలను వ్యక్తపరచే ఏదో ప్రత్యేకత ఆ కళ్ళలో ఉంది. నిరుసోగముఖానికి కోటేరు వేసినట్లుండే ముక్కు, మొనతేలిన గడ్డం, చిన్ననోరూ, మొత్తం మీద పదిమందిలో తన ప్రత్యేకతను చాటించుకొనే రూపం ఆమెది.

హేమకు చంద్రం అంటే ఎంతో ఇష్టం. ఐదో తరగతినుంచీ కలిసి చదువుతున్నారు. హేమ మాట్లాడుతుంటే శ్రద్ధగా ఆలకించటం చంద్రానికి ఇష్టం.

తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని చంద్రానికి హేమ తండ్రి ప్రసాదరావు చూపే ఆప్యాయత, హేమ చూపే అభిమానం ఎంతో సంతృప్తినీ ఆనందాన్నీ ఇచ్చేవి.

అన్నా వదినలంటే చంద్రం హృదయంలో ఏమూలో, అయిష్టం గూడు కట్టుకోసాగింది. వారు చూపే నిరాదరణవల్ల కలిగేబాధ చంద్రం గుండెల్లో రోజురోజుకు చిక్కగా పేరుకుపోసాగింది.

చంద్రానికి అన్నకూతురు రజని అంటే ప్రాణం. బాబాయి ఉంటే ఆ పసిదానికి ఇంకెవరూ అక్కరలేదు.

చంద్రం పదునాలుగేళ్ళుదాటి పదిహేనో ఏడులో అడుగుపెట్టాడు. బక్కపలచగా ఉండే చంద్రం ఉన్నవయసు కంటే ఓ సంవత్సరం చిన్నగానే కనిపిస్తాడు. చామనచాయ, నొక్కులజుట్టు, దట్టమైన కనుబొమ్మల కింద ఎప్పుడూ ఏదో ఆలోచనలను నింపుకొని ఉండే చిన్నవైనా చురుకైన కళ్ళూ, విశాలమైన ఫాలభాగం, పొడవుగా కొంచెం వంగివుండే ముక్కు, కొంచెం లావుగా కనిపించే పెదవులు. చంద్రం మొత్తం మీద స్ఫురద్రూపి అనే చెప్పాలి.

ఏం చేస్తే వదినచేత తిట్లు తినాల్సి వస్తుందో ననే భయంతో పెరిగిన చంద్రం కొత్తవారి ముందు మాట్లాడటానికి జంకుతాడు. హేమ ప్రోత్సాహం లేకుండా ఏ పనీ ధైర్యంగా చెయ్యలేడు.

ఆనాడు స్కూల్లో పేరెంట్సు డే. అన్నా వదినా వచ్చి తను స్కూల్లో ఎలా ప్రయోజకుడనిపించుకుంటున్నాడో చూడాలని ఉబలాటపడ్డాడు. చీటికి మాటికీ చీదరించుకొనే వదినకు తనేమిటో తెలుస్తుందని ఆశించాడు. అన్న కృష్ణారావు తన ప్రయోజకత్వం చూసి మురిసిపోతాడని చిత్రించుకున్నాడు మనస్సులోనే చంద్రం కాని కనీసం అన్నకూడా రాకపోవటం ఎంతో కష్టమనిపించింది చంద్రానికి. అదే అమ్మా నాన్నా బ్రతికుంటే అలా చేసేవారా! అన్నయ్యకు తనంటే ప్రేమే. వదినకు భయపడి వచ్చిఉండడు. అయినా అన్నయ్య వదినకు అంతగా ఎందుకు భయపడాలో! అదే తనయితేనా?

చంద్రానికి ఏడుపు పొర్లుకొచ్చింది. దిండులో తల దూర్చి పడ్డాడు.

వరండాలో పరధ్యాన్నంగా కూర్చొని ఉన్న కృష్ణారావును భార్య కాంతమ్మ అన్నానికి లేవమని కేకపెట్టటంతో ఈ ప్రపంచంలోకి వచ్చాడు.

"చంద్రం భోజనం చేశాడా?" భార్య ముఖంలోకి చూడకుండానే ప్రశ్నించాడు కృష్ణారావు. ఈనాడు తమ్ముడిమీద అనురాగం, జాలీ కట్టలు తెంచుకుంటున్నాయి కృష్ణారావు హృదయంలో. మరోవైపు మొదటిసారిగా భార్యంటే ఓవిధమైన అసహ్యం కలుగుతోంది, ఆమె గొంతు వినిపిస్తే కోపం ఉబికివస్తుంది.

"దొరగారు గదినుంచిబయటకొస్తేనా; ఆయనగార్ని సాగతీసే ఓపికా, తీరికా, ఇక్కడ ఎవరికీ లేదు." అంటూ రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది కాంతమ్మ వంటింట్లోకి. అలా వెళుతున్న భార్యను చూస్తుంటే కృష్ణారావుకు పుట్టలోకి వెళుతున్న జర్రిగొడ్డును చూసిన ట్లనిపించింది.

గబగబా తమ్ముడి గదిలోకి వెళ్ళాడు. చంద్రం వెల్లకిలా పడుకొని నిద్రపోతున్నాడు. అలా నిద్రపోతున్న చంద్రం ముఖంమీద కట్టిన కన్నీటిచారలు చూడగానే కృష్ణారావుకు దుఃఖం పొర్లుకొచ్చింది. వళ్ళు మరిచి నిద్రపోతున్న తమ్ముణ్ణి లేపా లనిపించలేదు.

కృష్ణారావు వంటగది గుమ్మంలో నిలబడ్డాడు. కాంతమ్మ రెండు కంచాల్లో అన్నం పెడుతున్నది.

"ఆకలిలేదు. అన్నం తినను" అన్నాడు కృష్ణారావు.

"ఊఁ" హుంకరిస్తూ రెండుకంచాల్లోని అన్నం తీసి విసురుగా గిన్నెలో వెయ్యసాగింది.

కృష్ణారావు వరండాలో ఈజీచైర్‌లో కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. మనస్సంతా కలతకలతగా ఉంది.

"ఏమండీ కృష్ణారావుగారూ భోజనాలయాయా?"

"ఎవరూ? ప్రసాదరావుగారా రండి రండి!" అంటూ ఆహ్వానించాడు కృష్ణారావు తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో.

"చంద్రం ఏం చేస్తున్నాడు?" అన్నాడు ప్రసాదరావు పైపు పొగను గుప్పుగుప్పున వదులుతూ.

కష్ణారావు గతుక్కుమన్నాడు. "నిద్రపోతున్నాడు," అన్నాడు ఎలాగో.

"చూడండి! మన రెండు కుటుంబాల మధ్య ఉన్న చనువుకొద్దీ చెబుతున్నాను, ఏమీ అనుకోకండి! పసి హృదయాలను నొప్పించకూడదు." తల్లి అయినా తండ్రి అయినా మీరేకదా!

కృష్ణారావు రాయిలా బిగుసుకుపోయాడు. అది గమనించిన ప్రసాదరావు ప్రసంగం మారుస్తూ "చంద్రం మంచికవి అవుతాడండీ!" అన్నాడు.

ఇంత సేపూ ముకుళించి ఉన్న కృష్ణారావు వదనం వికసించింది.

"వయస్సుకు మించిన ఊహలు కలవాడు చంద్రం. అతితెలివైన పిల్లల్ని చాలా జాగ్రత్తగా కాపాడాలి. తెలివైన పిల్లలు అతిత్వరగా మార్గం తప్పే అవకాశా లున్నాయి."

కృష్ణారావు ఉలకలేదు పలకలేదు. కాని అతని బాధ ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆఁ, అసలు సంగతి చంద్రాన్ని కాలేజీకి పంపించనంటున్నారట?"

"అవునండీ! వ్యాపారంలో పెడదామనుకుంటున్నాను."

"ఇంత చిన్న వయస్సులో బాధ్యతలు నెత్తిన వేయటం భావ్యం కాదు."

"నా ఉద్దేశం అది కాదండీ! ఈ వ్యాపారానికి వాడూ సమభాగస్తుడు. ఇప్పటినుంచే వ్యాపారంలో మెళుకువలు తెలిస్తే వాడి భవిష్యత్తుకే మంచిదని అలా అనుకున్నాను" అన్నాడు కృష్ణారావు పట్టుపడిన అపరాధిలా.

"చంద్రం తెలివైనవాడు. రేపు తనకు చదువు లేదని బాధపడవచ్చు. చంద్రం బాగా చదివి పైకి రావాలని దీవిస్తున్నానని ఇవ్వాళ స్కూలుఫంక్షన్లో హెడ్ మాస్టరుగారుకూడా అన్నారు.

"అలాగేనండీ! మీ అందరి సలహా ప్రకారమే, వాడికి ఇష్టం వచ్చినంతకాలం చదువు చెప్పిస్తాను," అన్నాడు కృష్ణారావు చంద్రాన్ని ఇప్పటినుంచే వ్యాపారంలో పెడితేనే మంచిదని మనస్సులో ఉన్నప్పటికీ.

"సరే వస్తానండీ! ప్రొద్దుపోయింది;" శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు ప్రసాదరావు.

"ఈయనగారి పని ఊళ్ళోవాళ్ళకు సలహాలు ఇవ్వటమే లాగుంది. అయినా మన బంగారం మంచిదయితే."

"ఏంచే నీ వాగుడు?" అన్నాడు కృష్ణారావు, మధ్యలోనే భార్యమాటలకు అడ్డువచ్చి.

"మరేఁవిఁటి! అత డొచ్చి చెప్పటం, మీరు వాణ్ణి చదివిస్తానని ఒప్పుకోవటం."

"అవును! వాణ్ణి చదివించదలచుకున్నాను." కచ్చితంగా అన్నాడు కృష్ణారావు,

"ఉన్నదంతా తమ్ముడి చదువుకు దోచిపెట్టి నాబిడ్డనోట్లోదుమ్ముకొట్టండి."

"వాడు ఈ ఆస్తికి సమభాగస్తుడని మర్చిపోకు," అంటూ కృష్ణారావుఅక్కడనుంచి లేచి లోపలకు వెళ్లాడు విసురుగా.

[సశేషం]



ప్రధానమంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి
హైదరాబాదు ప్రథమ పర్యటనం

"ఆయన సరళోదాత్తస్వభావం కలవారేగాక ఆయన దయార్ద్ర హృదయంనుండి సహజౌదార్యంకూడా పొంగిపొర్లుతూ వుంటుంది."

# ఘనమైన స్వాగతం



ప్రధానమంత్రి లాల్ బహదూర్ శాస్త్రి బేగంపేట విమానాశ్రయంలో.





రెండురోజుల పర్యటనపై ఢిల్లీనుంచి నగరానికి విచ్చేసిన ప్రధాన మంత్రికి ఘనమైన స్వాగతం ఇవ్వబడింది.



మ. ఘ. వ. నిజాం. ప్రధానమంత్రికి పరిచయం చేయబడుతున్నారు.

# పదినేముత్యాలు

శ్లో॥ "వ్యతిషజతి పదార్థాన్ అంతరః కోఽపి హేతుః;
న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే।
వికసతి హి పతంగస్యోదయే పుండరీకమ్;
ద్రవతి చ హిమరశ్మావుద్గతే చంద్రకాంతః॥"

— భవభూతి.

— "మనయింద్రియములకు అగోచర మై యనిర్వచనీయ మైనకారణ మేదో యొకటి. ప్రపంచములో ఏమాత్రము సంబంధములేని పదార్థములకు పరస్పరసంబంధము కలిగించుచుండును. లోకములోనివస్తువుల పరస్పరప్రేమకు బాహ్యము లైనకారణము లేమియు నుండవు. ఇదిలోకసిద్ధమగు సత్యము. ఎట్లనగా:— భూమండలమునందు జలాశయములో నుండుకమలమునకును. ఆకాశములో నెంతయో దూరమున నున్న సూర్యునకును పరస్పరసంబంధము లేకున్నను సూర్యుడు ఉదయించగనే కమలము ప్రీతిచే హాసితవదన మై వికసించును; అలాగే చంద్రోదయము కాగనే భూమియందలి చద్రకాంతమణి ద్రవించునుగదా !"

శ్లో॥ "సిధ్యంతి కర్మసు మహత్స్వపి యన్నియోజ్యాః
సంభావనాగుణమవేహి తమీశ్వరాణామ్
కిం వాఽభవిష్యదరుణః తమసాం విభేత్తా
తం చేత్ సహస్రకిరణో ధురి నాకరిష్యత్॥"

—కాళిదాస.

— "లోకములో సేవకులు, తమకు నియుక్తము లైనవిధులను జయప్రదముగా నెఱవేర్ప గలుగుట కేవలము వారిప్రభువులు వారిపైన చూపుఆదరమువలననే కాని వేఱు కాదు. ఎట్లనగా :— సహస్రకిరణు డైనసూర్యుడు అరుణుని ఆదరించి తనకు రథసారథిగా చేసికొని తనముందు నొగలపైన ఉంచుకొన్నాడు కనుకనే అరుణుడు సూర్యుడు ఉదయించుటకు మున్నే కటికిచీకట్లను పారద్రోల గలుగుచున్నాడు గదా!"

సీ॥ "కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోగి
సెలయేటినీలాద్రిచెలువు దెగడు;
హాస్తినీహస్త విన్యస్తపద్మంబుల
వేయుగన్నులవాని వెఱపు నూపుఁ,
గలభీసముత్కీర్ణకల్హారరజమునఁ
గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ;
గుంజరీపరిచితకుముదకాండంబుల
ఫణిరాజమండనప్రభ వహించు;

ఆ॥ వె॥ మదకరేణుముక్తమౌక్తికకుక్షుల
మెఱుఁగుమొగిలుతోడ మేల మాడు ;
నెదురు లేనిగరిమ నిభరాజమల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు."

— పోతనామాత్యుడు.

(మిగతా 39 వ పేజీలో)



### అనంతపురంజిల్లా

*పాఠశాల భవనం:*

ధర్మవరం సమితికి చెందిన రావులచెర్వు శివార్లలోని తిప్పపల్లి గ్రామంలో పాఠశాల భవనానికి ఫిబ్రవరి 25వ తేదీన శంకు స్థాపన జరిగింది.

### చిత్తూరుజిల్లా

*పంచాయతీ భవనం:*

తిరుచానూరులో పంచాయతీ కార్యాలయం భవనానికి మార్చి 9వ తేదీన కలెక్టరు శంకు స్థాపన చేశారు.

### గుంటూరుజిల్లా

*నీటిసరఫరా పథకం:*

వలివేరులో ఫిబ్రవరి 26వ తేదీన మునిసిపల్ వ్యవహారాల, గృహనిర్మాణ శాఖామంత్రి నీటిసరఫరా పథకానికి శంకు స్థాపన చేశారు. ఈ పథకానికి రూ.50,000లు ఖర్చువుతుందని అంచనా.

### హైదరాబాదుజిల్లా

*సంగీత, నాటక సమ్మేళనం:*

బొల్లారంలో మార్చి 6వ తేదీన హైదరాబాదుజిల్లా సంగీత, నాటక సమ్మేళనానికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

### కరీంనగర్ జిల్లా

*గ్రామ ఐక్యత శిబిరం:*

బండాలింగపూర్‌లో ఫిబ్రవరి 25వ మూడు రోజులపాటు జరిగే గ్రామైక్యత శిబిరానికి ప్రారంభోత్సవం జరిగింది.

### ఖమ్మంజిల్లా

*వసెక్టమీ శిబిరం:*

భద్రాచలంలో మూడు రోజులపాటు జరిగే కుటుంబనియంత్రణ, పునశ్చరణ శిక్షణ శిబిరానికి ఫిబ్రవరి 22న కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

*శిక్షణ శిబిరము:*

నెల్లిపాక గ్రామంలో మూడు రోజులపాటు గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. వివిధ విషయాలలో సుమారు 100 మంది స్త్రీలు శిక్షణ పొందారు.

### కృష్ణాజిల్లా

*కీలక గ్రామీణ కేంద్రం:*

పొన్నూరు పంచాయతీ సమితికి చెందిన కొండపాతూరులో ఫిబ్రవరి 22వ తేదీన రాష్ట్ర ఆహార, వ్యవసాయ శాఖామంత్రి గ్రామీణ కీలక కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

*క్షయనిరోధక కేంద్రం:*

యునిసెఫ్ తాలూకు ప్రపంచ ఆరోగ్య సంస్థ సహాయంతో మచిలీపట్టణంలోని జిల్లా ప్రధాన కార్యస్థానపు వైద్యశాలలో ఒక కొత్త క్షయనిరోధక కేంద్రం ప్రారంభించబడింది.

### కర్నూలుజిల్లా

*సంగీత, నాటక సమ్మేళనం:*

కర్నూలులో ఫిబ్రవరి 23వ తేదీన జిల్లా స్థాయి సంగీత, నాటక సమ్మేళనానికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

### మహబూబ్‌నగర్ జిల్లా

*జిల్లా పునశ్చరణ సమ్మేళనం:*

ఫిబ్రవరి 22వ తేదీన ఉపాధ్యాయ - బోధకుల, ఇనస్పెక్టింగ్ అధికారుల జిల్లా స్థాయి పునశ్చరణ సమ్మేళనం ప్రారంభించబడింది.

*గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం:*

అచ్చంపేట పంచాయతీ సమితిలోని జనకుంటగ్రామంలో మూడు రోజులపాటు జరిగే గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఫిబ్రవరి 26న ప్రారంభించబడింది.

### మెదక్ జిల్లా

*స్త్రీ సంక్షేమ సదస్సు:*

సంగారెడ్డిలో ఫిబ్రవరి 22 నుండి రెండు రోజులపాటు స్త్రీ సంక్షేమ సదస్సు జరిగింది.

### నల్గొండజిల్లా

*ఉపాధ్యాయుల సమావేశం:*

భువనగిరిలో పంచాయతీరాజ్ మంత్రి ఫిబ్రవరి 22వ తేదీన విద్యావిషయక సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

*యువజనోత్సవం:*

మునుగోడు పంచాయతీ సమితిలో ఫిబ్రవరి 25వ తేదీన మూడు రోజులపాటు వార్షిక యువజనోత్సవం నిర్వహించబడింది.

### నెల్లూరుజిల్లా

*ప్రాథమిక విద్యా సదస్సు:*

నెల్లూరులో ఫిబ్రవరి 26వ తేదీన ఐదు రోజులపాటు జరిగే ప్రాథమిక విద్యా సదస్సుకు కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

*గ్రామీణ వైద్య చికిత్సాలయం:*

కోవూరు తాలూకా పెదపుతేడులో ఒక గ్రామీణ వైద్య చికిత్సాలయం, ఒకగోడౌను తెరువబడ్డాయి.

ప్రగతి పథంలో

నిజామాబాదుజిల్లా

*సమాజ వికాసంలో పునశ్చరణ సదస్సు:*

సమాజ వికాసానికి సంబంధించిన పునశ్చరణ సదస్సు ఒకటి జిల్లా స్థాయిలో ఫిబ్రవరి 25 నుండి 27 వరకు నిజామాబాదులో నిర్వహింపబడింది.

శ్రీకాకుళంజిల్లా

*దోల - పొలకి రోడ్డుపై వంతెన:*

నరసన్నపేట పంచాయతీ సమితికి సంబంధించిన దోల - పొలకిరోడ్డుమీద ఒక వంతెనను నిర్మించడానికై ఫిబ్రవరి 25 వ తేదీన శంకుస్థాపన జరిగింది. ఈ వంతెన నిర్మాణానికి రూ. 80,000 ఖర్చవుతుందని అంచనా. దీనిని ప్రభుత్వము, ప్రజలు భరించవలసి వుంటుంది.

*సంగీత, నాటక సమ్మేళనం:*

ఫిబ్రవరి 28 వ తేదీ నుండి మార్చి 1 వ తేదీ వరకు శ్రీకాకుళంజిల్లా సంగీత, నాటక సమ్మేళనం ఏర్పాటు చేయబడింది.

వరంగల్లుజిల్లా

*విద్యా విషయక సమావేశం:*

వరంగల్లులో ఫిబ్రవరి 27 న వరంగల్లు జిల్లా తృతీయ విద్యా విషయక సమావేశానికి రెవెన్యూ మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

*శిక్షణ శిబిరం:*

పరకాల పంచాయతీ సమితిలోని పెద్ద కోడెపాకలో ఫిబ్రవరి 22 నుండి మొత్తం మూడు రోజులపాటు జరిగే గ్రామపెద్దల శిక్షణ శిబిరం స్త్రీల నిమిత్తం నిర్వహించబడింది.

తూర్పుగోదావరిజిల్లా

*పరిరక్షిత మంచినీటి సరఫరా పథకం:*

గణపవరం పంచాయతీ సమితిలోని అర్ధవరం, చనమిల్లిలలో పరిరక్షిత మంచినీటి సరఫరా పథకానికి ఫిబ్రవరి 28 తేదీన శంకుస్థాపన చేయబడింది.

*వ్యవసాయ శిక్షణ:*

ఏలూరులో ఫిబ్రవరి 23 వ తేదీన వ్యవసాయ శిక్షణ కార్యక్రమం ఒకటి ఏర్పాటు చేయబడింది. జిల్లాలోని బ్లాకుల నుండి యీకార్యక్రమానికి సుమారు 75 మంది ముఖ్య సేవికలు, గ్రామసేవికలు హాజరయ్యారు.

✲

---

(37 వ పేజీ తరువాయి)

సీ॥ "ఎవ్వానివాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు;
నెవ్వానిచారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపుఁ గఱపు;
నెవ్వానికడకంట నివ్వటిల్లెడుచూడ్కి
మానితసంపద లీను చుండు;
నెవ్వానిగుణలత లేడువారాసుల
కడపటికొండపైఁ గలయఁ బ్రాకు;
తే॥ గీ॥ నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడే ధర్మసుతుఁడు."

— తిక్కనామాత్య

ఉ॥ "భూనుతకీర్తి! బ్రాహ్మణుఁడు పుట్టుడుఁ దోడనపుట్టు నుత్తమ
జ్ఞానము, సర్వభూతహితసంహితబుద్ధియు, జిత్తశాంతియున్
మానమదప్రహాణము, సమత్వము, సంతతవేదవిద్యను
ష్ఠానము, సత్యవాక్యము దృఢవ్రతమున్ గరుణాపరత్వమున్."

— నన్నయభట్టారకుడు.

# సంగ్రహ ప్రకటనలు

### అక్రమంగా నీటిపారుదల వినియోగంపై పన్ను

అక్రమంగా నీటిపారుదల వినియోగంపై విధించే పన్నుకు సంబంధించిన నిబంధనలను ప్రభుత్వం పరిశీలించి జుల్మానాలను యీ దిగువవిధంగా రూపొందించింది :-

మొదటి తరగతి వనరులు : (అంటే 30,000 అంతకు పైబడ్డ ఎకరాలు ఆయకట్టుగల వనరులు)

(1) అక్రమంగా నీటిపారుదల వినియోగానికి జుల్మానా మామూలు నీటిపన్నుకు పదిరెట్లు వుంటుంది.

అక్రమంగా నీటి పారుదలను వినియోగించుకున్నప్పుడు మొదటిదఫా సాధారణంగా అతను న్యాయబద్ధంగా చెల్లించిన పన్నును మినహాయించి జుల్మానాను విధించేహక్కు పన్నువిధింపు అధికారులకు వుంటుంది.

రెండవసారి ఆపైన అక్రమంగా నీటిపారుదలను వినియోగించుకున్నట్టయితే అతనికి గరిష్టమొత్తం జుల్మానా అంటే మామూలుపన్నుకు 10 రెట్లు విధించబడుతుంది.

అయితే పై విచారణ అధికారులు జుల్మానాను తగ్గించాలనుకున్నట్టయితే మామూలు నీటిపన్నుకు అయిదింతలవరకు జుల్మానాను తగ్గించవచ్చు.

### మొదటి తరగతి వనరులు కాని ఇతరములు

మొదటి తరగతి వనరుల పైమాదిరిగానే వీటిపైకూడా అపరాధ పన్నులు విధించబడ్డాయి. అయితే పన్నువిధించే అధికారి, అప్పిలేట్ అథారిటీలు నీటిపారుదల అక్రమ వినియోగం తీవ్రతను యితర విషయాలను పరిశీలించి సవ్యమని భావించేపక్షంలో పన్నులో కొంతభాగాన్ని తగ్గించవచ్చు.

పై నిర్ణయాల అమలుకు వీలుగా నియమావళి సవరించబడేవరకు 1373 ఫసలీ సంవత్సరంలో నీటి పారుదల అక్రమ వినియోగంపై విధించిన పన్నుల విషయంలోవచ్చే దరఖాస్తులను, పునః పరిశీలనలను కలెక్టరు స్వయంగా గానీ అతని సబార్డినేట్స్‌గానీ విచారించి పై నిర్ణయానుసారం పన్నులు తగ్గించే అధికారాన్ని జిల్లాకలెక్టర్లకు ఇవ్వడం జరిగింది.

### తిరుపతి తిరుమలదేవస్థానం ట్రస్టీల బోర్డు

తిరుమల, తిరుపతి దేవస్థానం ట్రస్టీల బోర్డులో యీ దిగువ వారిని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ట్రస్టీలుగా నియమించింది.

17-1-1965 వ తేదీలో రద్దు అయిన శ్రీ కె. చంద్రమౌళి స్థానంలో-విధానసభ సభ్యులకొరకు ఉద్దేశించబడిన యీ స్థానంలో - సికిందరాబాదుకు చెందిన శ్రీ కె. ఎస్. నారాయణ, ఎమ్.ఎల్.ఎ. బోర్డు సభ్యుడిగా నియమింపబడ్డారు. శ్రీ కె. ఎస్. నారాయణ స్థానంలో పశ్చిమ గోదావరి, భీమవరానికి చెందిన శ్రీ గాదె జగన్నాధరాజు బోర్డు సభ్యుడుగా నియమింపబడ్డారు.

### పంట ఉత్పత్తుల సమీక్ష-కమిటీ ఏర్పాటు.

ముఖ్యపంటలు వేసిన భూమి విస్తీర్ణం. ఉత్పత్తులకు సంబంధించి, ఆర్థిక గణాంకముల శాఖవారు తయారు చేసిన అంచనాలను మధ్యమధ్య పరిశీలించే నిమిత్తం 1964 జనవరిలో వ్యవసాయ గణాంకముల కమిటీని నియమించడం జరిగింది. మూడవ ప్రణాళికలోఆదనపు ఆహారధాన్యాల ఉత్పత్తి లక్ష్యాలు, విజయాలను గురించి చర్చించడానికి గాను 1965 జనవరి 16 వ తేదీన జరిగిన సమావేశంలో, ఆహార ధాన్యాల ఉత్పత్తి అంచనాలపై సమగ్రంగా చర్చ జరిపిన మీదట, ఉత్పత్తి లక్ష్యాలు, విజయాలకు సంబంధించిన అంచనాలను కమిటీ మధ్య మధ్య సమీక్షించాలని, వారి సేద్యపు నీటి పారుదల శాఖ చీఫ్ ఇంజనీరును కూడా ఈ కమిటీ సభ్యునిగా నామినేటు చేయాలనీ నిర్ణయించారు.

ప్రభుత్వం ఈ సూచనను పరిశీలించే ఉత్పత్తి లక్ష్యాలు, విజయాలకు సంబంధించిన అంచనాలను వ్యవసాయ గణాంకములకు సంబంధించిన కమిటీ మధ్య మధ్య సమీక్షించాలని ఆదేశించింది. భారీ సేద్యపు నీటిపారుదల శాఖ చీఫ్ ఇంజనీరును ఈ కమిటీ సభ్యునిగా చేర్చుకోవాలని కూడా ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

ఈ కమిటీలో దిగువ పేర్కొన్న వారు సభ్యులుగా వుంటారు:

ప్రణాళికా శాఖ ప్రత్యేక కార్యదర్శి, వ్యవసాయ శాఖ డైరెక్టరు, రెవెన్యూబోర్డు అదనపు సంయుక్త కార్యదర్శి, భారీ సేద్యపు నీటిపారుదల శాఖ చీఫ్ ఇంజనీర్, ప్రణాళికాశాఖ (ఎకనమిక్సు, రిసోర్సెస్ విభాగం) డైరెక్టరు - సభ్యుడు - కార్యదర్శి. ఆహార వ్యవసాయ శాఖ కార్యదర్శి, ఆర్థిక, గణాంకముల శాఖ డైరెక్టరు:

### ధాన్యం దొంగరవాణాను కనుగొన్న వారికి బహుమతులు

భారత ప్రభుత్వం 1964 అక్టోబరు 8 వ తేదీని, 1964 వ సం.పు దక్షిణ రాష్ట్రాల (బియ్యం ఎగుమతి క్రమబద్ధం) ఉత్తర్వును జారీచేసిన ఫలితంగా ఆంధ్రప్రదేశ్‌లోని



హైదరాబాదు స్టేషన్‌కు ఆగమనం, "హైదరాబాదు ఎంతో ఆప్యాయంగా ఉన్నది."



ప్రతినిధివర్గం నాయకుడు ఫిబ్రవరి 18 న రిట్జ్ హోటల్‌లో పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తున్నారు.

# మంత్ర ముగ్ధులను చేసిన హంగరీ నృత్య ప్రదర్శనలు

భారత హంగరీ సాంస్కృతిక వినిమయ కార్యక్రమం క్రింద, బుడాపెస్ట్ జానపద నృత్యబృందం ఫిబ్రవరిలో హైదరాబాదు నగరంలో నాలుగు ప్రదర్శనలు యిచ్చారు.



: బృందంవారు ఫిబ్రవరి 18 న సాలార్జంగ్ మ్యూజియం సందర్శించారు.



ముఖ్యమంత్రి మొదటిరోజు ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేస్తూ ప్రతినిధివర్గం తమ దర్శనీయ స్థలాలలో హైదరాబాదును చేర్చినందుకు వారికి కృతజ్ఞతలు తెల్పారు.



ఈ బృందంలోని 16 సంవత్సరాల నర్తకి మెరికాజిడెనియా బృందంతరఫున ముఖ్యమంత్రికి తమ జ్ఞాపకచిహ్నాన్ని అందజేశారు.



సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ యం. ఆర్. అప్పారావు యీ బృందానికి స్వాగతం చెప్పారు.



ముఖ్యమంత్రి – బృందంతో.



శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి కళాకారులకు కానుకలు అందజేశారు.



మొదటిరోజురాత్రి ప్రదర్శనతర్వాత బృందం నాయకుడు ప్రసంగిస్తున్నప్పటి దృశ్యం.





# సంగీత, నృత్య, గానముల త్రివేణీ సంగమము.

...స్నిగ్ధ, సౌందర్య, సమ్మోహన సమ్మిశ్రితము" అని హంగరీ నృత్యం అభివర్ణించబడింది. శ్రోతలూ, ప్రేక్షకులూ, ప్రతిక్షణాన్ని జ్ఞాపకం వుంచుకోదగ్గట్టుగా ఈ ప్రతిభావంతులైన నవయౌవన కళాకారులు అద్వితీయ ప్రదర్శన కావించారు. అతిసామాన్యమైన జానపద నృత్యం మొదలుకొని అతి నాజూకైన విన్యాసాల వరకు ప్రతిదీ ఆహ్లాదకరమైనదే. పురాతనమైన వీర, శృంగారరస విశ్వసంగీత నిస్వనాలు హంగరీ సిపాయీల నృత్యంలో ప్రతిధ్వనిస్తాయి. కూపర్స్, విరోధులు అన్న నృత్యాలలో ఎంతో హాస్యం ఉన్నది.







కార్మిక, రవాణా, సమాచార శాఖామంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి ఫిబ్రవరి 20 వ తేదీన కళాకారులకు పూలగుత్తులను బహూకరిస్తున్నారు.



సైనికుల నిమిత్తం ప్రత్యేక ప్రదర్శన యిచ్చిన సందర్భంలో బ్రిగేడియర్ సయీద్‌తో కళాకారులు.



ఆర్థిక శాఖామంత్రి డా. ఎమ్. చెన్నారెడ్డితో ఫిబ్రవరి 21 వ తేదీన కళాకారులు.



ఈ బృందం నగరంలో చేసిన పర్యటన ఫొటోల ఆల్‌బమ్‌ను డా. చెన్నారెడ్డి బృందనాయకునికి బహూకరిస్తున్నారు.

ఏదైనా ప్రదేశంనుంచి ఈ రాష్ట్రం వెలుపల గల మరో ప్రదేశానికి బియ్యాన్ని కానీ వడ్లను కానీ రవాణాచేయడాన్ని పర్మిటు ద్వారా క్రమబద్ధం చేయడం జరిగింది. ఈ పర్మిట్లను రాష్ట్ర ప్రభుత్వం కానీ లేదా పర్మిట్లు ఇవ్వడానికై ప్రభుత్వం అధికారం ఇచ్చిన అధికారి గానీ జారీచేస్తారు.

పర్మిటులేకుండా ఆంధ్రప్రదేశ్ నుంచి బయటి ప్రదేశాలకు దొంగచాటుగా బియ్యాన్నీ లేక వడ్లను రవాణా చేయడాన్ని అరికట్టే ఉద్దేశ్యంతో ప్రభుత్వం, సరిహద్దు జిల్లాలైన ఆదిలాబాదు, నిజామాబాదు, మెదక్, హైద్రాబాదు, మహబూబ్ నగర్, కర్నూలు, అనంతపురం, చిత్తూరు, నెల్లూరులలో చెక్‌పోస్టులను నెలకొల్పడానికి ఉత్తర్వుచేసింది. దొంగచాటుగా ధాన్యం రవాణా జరిగే సందర్భాలను కనుగొని ఆ సమాచారాన్ని ప్రభుత్వానికి తెలియజేయడానికై సరిహద్దు ప్రాంతాలలోని గ్రామస్థులను ప్రోత్సహించే తలంపుతో ప్రభుత్వం మెదక్, ఆదిలాబాదు, నిజామాబాదు, హైద్రాబాదు, మహబూబ్‌నగర్, కర్నూలు, అనంతపురం, చిత్తూరు, నెల్లూరు జిల్లాలకు ఒక్కొక్కదానికి రూ. 1000 ల చొప్పున మంజూరు చేసింది. ధాన్యం దొంగ రవాణాలను గురించి ప్రభుత్వానికి సమాచారం తెలియజేసే వ్యక్తులకు బహుమానాలు ఇవ్వడానికి ఆయా జిల్లా కలెక్టర్లు ఈ సొమ్మును వినియోగిస్తారు.

ఈ బహుమతుల గరిష్ఠపరిమాణం ఒక్క బియ్యం బస్తాకు రూ. 5-00 లు, ఒక్క వడ్లబస్తాకు రూ. 2-00 ల చొప్పున వుంటుంది. ఏ వ్యక్తిగత సందర్భంలోనూ బహుమతి పరిమితి రూ. 250 లకు మించకుండా వుంటుంది.

## పోకచెక్కల పంపిణీ

వక్కపొడి గాని, లేదా యిండ్లల్లో యితర వాడుకకుగాని పోకచెక్కలు అవసరపడే ప్రజలకు అమ్మడానికి వీలుగా రాష్ట్రంలోని యీ దిగువ సహకార సంఘాలకు పోకచెక్కలను సరఫరా చేసే విషయమై భారత్ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్‌తో ఏర్పాట్లు జరిగాయి.

| సహకార సంఘాల పేరు | అమ్మకానికై సరఫరా చేయబడే పరిమాణం షుమారుగా |
|---|---|
| విశాల హైదరాబాదు వినియోగదారుల కేంద్ర సహకార సంఘం, హిమాయత్‌నగర్, హైదరాబాదు. | |
| వినియోగదారుల కేంద్ర సహకార సంఘం, విజయవాడ. | ఒక్కొక్క సంఘానికి రూ. 25,000 ల విలువగలవి |
| వినియోగదారుల కేంద్ర సహకార సంఘం, గుంటూరు. | |
| శ్రీకాకుళం, వైజాగ్, కాకినాడ, ఏలూరు, నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, వరంగల్లు, నిజామాబాదులోని వినియోగదారుల కేంద్ర సహకార సంఘాలకు. | ఒక్కొక్క సంఘానికి రూ. 9,000 ల విలువగలవి |

ఇళ్ళల్లో వాడకానికై ప్రజలకు ఒకేతడవ రూ. 10 లు పోకచెక్కలు అమ్మడం జరుగుతుంది. తమకు అవసరానికి పోకచెక్కలు కొనదలచిన వ్యక్తులు తమ జిల్లాలోని వినియోగదారుల కేంద్ర సహకార సంఘాలను సంప్రదించవచ్చు.

వక్కపొడిని తయారుచేస్తున్న వ్యక్తులు గాని, సంస్థలుగాని తాము 1962-63 నుండి వక్కపొడిని తయారుచేసి అమ్ముతున్నట్టు వారి వినియోగం, టర్నోవరు అమ్మకం పన్ను చెల్లింపు మొదలయిన వాటిని వ్యక్తంచేసే పత్రాలను కలిగివున్నట్టయితే అట్టివారికి వక్కపొడి తయారీ, అమ్మకం నిమిత్తం ఒకేతడవ రూ. 1500 ల విలువ గల గరిష్ఠ మొత్తంపోకచెక్కలను కొనడానికి అర్హులు. పోకచెక్కలను కొనదలచినవారు ముందుగా తమకు దగ్గర్లో గల పరిశ్రమలు, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరునుండి తమ అవసరాన్ని ధృవీకరిస్తూ సర్టిఫికెట్టును పొందడానికై దరఖాస్తుచేసి, ఆ తరువాత అక్కడనుండి పొందిన సర్టిఫికెట్టును తమ జిల్లాలోని వినియోగదారుల కేంద్ర సహకార సంఘానికి అందజేయాలి.

అదిలాబాద్, కరీంనగర్, మహబూబ్‌నగర్, ఖమ్మం, నల్గొండ, మెదక్ జిల్లాలలోని వినియోగదారులు తమకు అవసరమైన పోకచెక్కలను హైదరాబాదు, హిమాయత్‌నగర్‌లోని విశాల హైదరాబాదు వినియోగదారుల కేంద్ర సహకార సంఘంలో కొనుక్కోవచ్చు

ఎల్లుండి పరీక్షలనగా నెత్తురుబంక విరేచనాలు పట్టుకున్నాయి. క్లాసు తెచ్చుకుందామనే ఆశతో ప్రిపరేటరీ హాలీడేస్‌లో చాలా కష్టపడి చదివాను. దిక్కుమాలిన డిసెంటరీ పట్టుకుంది. పరీక్ష తన్నేస్తుందని కాదుగాని క్లాసు రాదేమోనని.

అదే నేను డాక్టరు కనకంగారి దగ్గరకి మొదటిసారి వెళ్ళటం. ఆయనను గురించి నా కదివరకే తెలుసు. మంచి డాక్టరుట, ప్రాక్టీసు లేదుట. ఈ రెండూ ఒకేచోట ఎట్లా ఒనగూడాయో నా కర్థం కాలేదు. మా బాబాయితో కలిసి చదువుకున్న డాక్టరు ఒకాయన మా వూళ్లో రెండేళ్ళ క్రితం ప్రాక్టీసు పెట్టాడు. హస్తవాసి మంచిదన్నారు. ఇప్పుడాయన సంపాదన నెలకు రెండువేల ప్రాంతంలో ఉంది.

ఎంత ప్రాక్టీసో! ప్రతిఉదయమూ ఆయన డిస్పెన్సరీదగ్గిర ఇసకేస్తే రాలనంతమంది జనం! జనాని కాయనంటే గురి. ఎవరో అన్నారుకూడా, ఆయన మూడే మిక్శ్చర్లతో అనేకరకాల రోగాలకు చికిత్స చేస్తాట్ట. ఏడేళ్ళ ప్రాక్టీసులో ఒక మేడ లేపాడు. ఇప్పుడు రెండో మేడ లేస్తున్నది."

"కనకంగారంటే జనానికి గురి లేకపోవటాని కేమిటీ కారణం?"

"ఖర్మ! ఆయన అదోరకం మనిషి. ఒకసారి వెళ్ళరాదూ? నీకే తెలుస్తుంది!"

నెత్తురుబంక విరేచనాల మూలంగా నేను కనకంగారి దగ్గిరికి వెళ్ళటం తటస్థించింది. అరండల్‌పేట పార్కు పరిసరాల్లో ఆయన ఒక దాబాయింట్లో ఉంటున్నాడు. "డాక్టర్ పి. బి. కనకసుందరం ఎం. బి. బి. ఎస్"

## సీరియల్ నవల

"మందు కావాలండీ," అన్నాను. రోగిని నేనేనని స్ఫురించేటట్టుగా గొంతు పెట్టాను.

"మందా?" అన్నాడాయన, ఆమాట ఎక్కడో చాలాసార్లు విన్నవాడిలాగా.

"అవునండీ. డిసెంటరీ."

"డిసెంటరీ అని మీరెట్లా చెప్పగలరూ?"

"రోజుకు ముప్పై విరేచనాలవుతున్నాయి."

డాక్టరుగారు నాకేసి జాలిగా చూసి. "డిసెంటరీలో అసలు విరేచనమే ఉండదు. మలబద్ధకం ఉంటేనేగాని డిసెంటరీ రాదు. కూర్చోండి."

"నెత్తురూ, బంకా, బొడ్డుచుట్టూ మెలి



"మంచిడాక్టరై ప్రాక్టీసు లేకపోవటమేమిటి?" అని అడిగాను.

"ఏమిటంటే ఏం చెబుతాం? రాత! డిస్టింక్షన్‌తో పాసయిన గ్రాడ్యుయేట్లు ఉద్యోగాలు లేక రాట్ కొడుతుంటంలా?" అన్నాడు చిదానందం. కనకంగారంటే వాడికి తగని అభిమానం. అందుచేత ఆయన్ని గురించి కర్కశంగా మాట్లాడే హక్కును పుష్కలంగా వినియోగించుకునేవాడు.

"ఉద్యోగం దొరక్కపోతే అది వేరే సమస్య. ప్రాక్టీసు చేసే డాక్టరు మంచివాడైనప్పుడు పేషంట్లు ఆయన్నెట్లా వదిలిపెడతారూ?"

"రోగికి రోగం నయం కావటమే అన్నిటికన్న ముఖ్యమనే మూఢవిశ్వాసం. రోగికి కావలసింది డాక్టరుపైన గురి. మందు సెకండరీ. డాక్టరు వీరభద్రరావుకు, చూడు,

అన్న బోర్డొకటి తలవాకిలిపక్కగోడకు కొట్టి ఉన్నది. ఇంటికీ ప్రహరీగోడకూ మధ్య అయిదారు గజాల ఖాళీజాగాలో ఒకపక్కగా చిన్న పాకా వేసిఉన్నది. అందులో ఒకకొయ్యబల్లా, ఒకమడతకుర్చీ ఉన్నాయి. ఒకనులక మంచం ఎత్తిపెట్టి ఉన్నది. బెంచీ విజిటర్ల కోసం. కుర్చీ డాక్టర్‌గారికోసం. అందులో డాక్టరుగారేకాబోలు కూర్చొని, పేపరు మొహానికి అడ్డం పెట్టుకుని చదువుకుంటున్నాడు.

"డాక్టరుగారండీ?" అన్నాను.

ఆయన పేపరు దించి, "ఏం కావాలి? ఎవరూ?" అన్నాడు.

పెట్టటం — ఇవన్నీ డిసెంటరీ లక్షణాలే అనుకుంటున్నాను. మీరు నన్ను ఎక్స్‌క్యూజ్ చెయ్యాలి," అన్నాను.

ఆయన అకస్మాత్తుగా నవ్వి, "కూర్చోండి మీది డిసెంటరీ కాదని నేననటంలేదు. కాని పేషంట్స్ తమ డయాగ్నోసిస్ తామే చేసుకోవటం తప్పు. చాలామంది కాసెస్సుండదు. 'హైపరాసిడిటీకి మందివ్వండి.' 'లివర్ ట్రబుల్‌కు మందివ్వండి.' 'ఆస్త్మాకు మందివ్వండి' అంటూ అడుగుతారు. ఏ విధమైన లివర్ ట్రబుల్? ఆస్త్మాలో ఏరకం? అదే మీవాళ్ళకి తెలీదు. 'నీకేకాదు, మాకూ నా కాస్త వైద్యం తెలుసులేవోయ్!'

**కొడవటిగంటి కుటుంబరావు**

అన్నట్టు మాట్లాడకూడదు, ఐగోట్ వెరీ ఇంపే షంట్ విత్ దట్ పేషంట్స్. ఇంకోటి చూశారా? నిజంగా పేషంటుకు తన రోగం తెలిస్తే డాక్టరు దగ్గిరికి రావట మెందుకూ? ఏ కెమిస్ట్స్ షాపులోనైనా మందు తీసుకోవచ్చు. ఆ సంగతికూడా వాళ్ళు గమనించరు ... ఇంతకూ మీకు ఈడిసెంటరీ ఎన్నాళ్ళనుంచీ!"

"మొన్న ఉదయంనుంచేనండీ. ఎల్లుండి పరీక్షలు ఆరంభం."

ఏదో జోక్ చెయ్యబోయిన వాడల్లే నవ్వి ఆయన, "మీకీ జబ్బు ఫ్రీక్వెంట్‌గా వస్తూం టుందా?" అన్నాడు.

"లేదండీ. రెండేళ్ళక్రితం ప్రీయూ ఫైనల్ పరీక్షలప్పుడొచ్చింది. అప్పు వేసి వైద్యం



కూడా చెయ్యలేదు. పరీక్షలో మార్కులు బాగా తెచ్చుకోలేకపోయాను. ఈసారికూడా అదే అవుతుందేమోనని భయం."

డాక్టరుగారు జోక్‌ను నిగ్రహించుకోలేకపోయాడు. "ఎగ్జామినేషన్ ఫోబియా అయివుంటుందా?" అన్నాడు.

"కావచ్చండీ! కాని నాకు సాధారణంగా ఫస్టుమార్కుల్లాటివి రావడం అలవాటు. నాకుభయం క్లాసు రాదనే," అన్నాడు కాస్త పౌరుషంగానే.

"అదీ ఒక భయమేగా? అయినా తెలిసే భయాలకన్న తెలీని భయాలు ఎక్కువ జబ్బుచేస్తాయి. ఇన్నేళ్ళయాక ఇప్పటికీ నేను స్కూలుఫైనలు పరీక్షలకు కూర్చున్నట్టూ పేపరేమీ అర్థం కానట్టూ, ఏమీ రాయలేకపోయినట్టూ కలవచ్చి దిగులు పుట్టుకొస్తూంటుంది. పరీక్షలంటే భయం అణచిపెట్టడంచేత అట్లా జరుగుతుంది.

ఆయన ఎంతసేపైనా ఆ విధంగా మాట్లాడుకుంటూ పోయేటట్టున్నాడు. నాకివతల డిసెంటరీ, అవతల పరీక్షలూనూ, కనీసం ఇంకో పేషంటైనా వచ్చినా బాగుండుననిపించింది. కాని ఎవరూ రాలేదు.

"ఫ్రాయిడ్." అన్నాడాయన. ఆ ఒక్క ముక్కలో ఎంతో ఇమిడి ఉన్నట్టు. ఏ కారణంచేతనో నేనప్పటిదాకా ఫ్రాయిడ్ పేరు వినిఉండలేదు,

"ఏమిటండీ అదీ?" అన్నాను. టైఫాయిడ్ లాటి జబ్బేమో ననిపించింది.

"సైకోఎనాలిసిస్. మనకు ఫిజియాలజీయే సరిగా తెలీదు,!" నవ్వాడు "రోగాలంటే అందరూ భయపడతారు. చాలా ప్రాథమిక రోగాలు శరీరం తనకు తాను చేసుకునే వైద్యమే. మామూలు జ్వరమూ, జలుబూ, కురుపులూ వంటివి శరీరం తనకు తాను చేసుకొనే వైద్యమే. కాకపోతే బాధ అన్నది మట్టుకు సహించరానిది. వైద్యుడి మొట్టమొదటి కర్తవ్యం రోగికి బాధలేకుండా చూడటం. మిగిలినదంతా వట్టి భేషజం. జ్వరం వస్తే డయాఫోరిటిక్ మిక్చరిస్తాం—చెమట పట్టడానికి. అది ఇవ్వకపోయినా జ్వరం దానంతట అదే నయమవుతుంది. దానంతట అది నయంకానిజ్వరం డయాఫోరిటిక్‌తోనూ నయంకాదు. హాల్డేన్ చెప్పినట్టు పేషంటు మంచాన పడేదాకా వైద్యుడితో పనిలేదు. రోగి మంచాన పడ్డాక వైద్యుడు చెయ్యగలిగింది బహు కొద్ది. అందుచేత ఎథికల్‌గా చూస్తే వైద్యుణ్ణి మించిన సంఘసేవకుడుండడు. మోరల్‌గా చూస్తే ఈ వృత్తిలో ఐశ్వర్యవంతుడైన వాడికున్న రోగ్ ఉండడు! మిశ్చర్లూ, మాత్రలూ ఇవ్వటంలోనూ, ఇంజెక్షన్లివ్వడంలోనూ ఎంతరోగరీ ఉందో ఆపరేషన్లు చెయ్యటంలోనూ అంత రోగరీ ఉంది. నేనొక గొప్ప సర్జన్నెరుగుదును..."

నాకు కాస్త విసుగెత్తింది. చెప్పొద్దూ. నేను వెళ్ళాలి; నాకు మందివ్వడు. నా పేరు కూడా అడక్కుండా చిన్ననాటి స్నేహితుడితో మాట్లాడినట్టు మాట్లాడుకు పోతున్నాడు. చూడగా ఆయనకు తన వృత్తిపట్ల ఏ విధమైన అభిమానమూ ఉన్నట్టులేదు. తాను సంపాదించలేని స్థితిలో ఉండి రెండుచేతులా ఆర్జించేవాళ్ళని తిట్టటంలో ఉన్న దౌర్బల్యం కూడా ఆయన గ్రహించినట్టులేదు.

"ఏమండీ, డాక్టరుగారూ! నా కేం మందు చెబుతారు?" అన్నాను.

ఆయన దేనికోసమో వెతుకుతున్నవాడల్లే అటూ ఇటూ చూస్తూ, "అమ్మాయ్. నర్సూ?" అని కేకపెట్టాడు.

ఓ పన్నెండు, పదమూడేళ్ళ గడ్డుకాయలాటి పిల్ల ఇంట్లోనుంచి వచ్చి, "ఏమిటి, నాన్నా?" అని అడిగింది.

"కాస్త కలమూ, కాగితమూ తెస్తావా? ప్రిస్క్రిప్షన్ రాస్తాను." అని డాక్టరుగారంటుంటే నేనా పిల్లకేసి చిత్రంగా చూశాను. ఆమె పాత చొక్కా ఒక్కటి తొడుక్కున్నది. ఒక అరదుప్పటి లాటిది కట్టుకున్నది. చొక్కా డాక్టరుగారిదై ఉండాలి. ఆపిల్ల జుట్టు చిందరవందరగా ఉన్నది — తల దువ్వుకొని కనీసం రెండురోజులైనట్టు.

కొంచెంసేపటికి పిల్ల తిరిగొచ్చి, కలంలో సిరా ఉన్నట్టులేదు, నాన్నా, కాగితం ఎక్కడా కనబడదు." అన్నది.

డాక్టరుగారేమీ ఆశ్చర్యపడలేదు.

"అన్నట్టు, నా దగ్గిరేవో శాంపిల్స్ ఉండాలి." అంటూ ఆయన తన అట్టపెట్టె పట్టుకురమ్మని కూతుర్ని మళ్ళా లోపలికి పంపాడు.

ఆ పిల్ల తెచ్చిన అట్టపెట్టెలో మెడికల్ లిటరేచరుతో బాటు ట్వైనుదారమూ, తెగిపోయిన రిబ్బను ముక్కలూ, ఒకరబ్బరూ, ఏవేవో మాత్రలూ, ఒకఖాళీ ఇంజెక్షను బుడ్డీ వగైరా ఉన్నాయి.

"ఓయస్, ఇవుగో టాబ్లెట్స్, పస్ త్రై మెన్సే డే." అంటూ మూడుమాత్రలు నా చేతిలో పెట్టాడు డాక్టరుగారు.

"వీటి ఖరీదెంతండీ, డాక్టరుగారూ?" అన్నాను.

"ఖరీదా? ఇవి ఫ్రీ శాంపిల్స్. వీటితో రాత్రికల్లా కట్టకపోతే వచ్చి చెప్పండి నేను రాత్రి పదిదాకా మేలుకునే ఉంటాను." అన్నాడాయన.

ఆయనకు థాంక్స్ చెప్పి, మాత్రలు తీసుకుని రూము కొచ్చి, వెంటనే ఒకటి మింగి నీళ్ళు తాగాను. చెప్పొద్దూ, అవి పనిచేస్తాయని నేను కలలోకూడా అనుకోలేదు. కాని పని చేశాయి. ఆఖరు విరేచనం మధ్యాహ్నం రెండుగంటల కయింది. ఆ తరవాత తనకు డిసెంటరీ మాటే గుర్తు రాలేదు.

నేను శలవుల కింటికి పోలేదు. పోవటానికి నాకు సొంత ఇల్లంటూ లేదు. నా కున్న ఆప్తులు తెనాల్లో మా బాబాయీ, నందివెలుగులో మా సుబ్బక్కయ్యానూ. ఎక్కడికి పోయినా నాకు గుంటూరులో గడిచినట్టు కాలం గడవదు.

మొత్తంమీద పరీక్షలు బాగానే రాశాను. క్లాసువస్తుందని ధైర్యంవుంది. కానిచెప్పలేం. నేనెవరితోనూ చెప్పలేదు. పరీక్షలయినరోజే డాక్టరుగారింటికి పోయి, "డాక్టరుగారూ.

మీ మాత్రలు అమోఘంగా పని చేశాయి. పరీక్షలకు హాయిగా చదివి రాశాను." అని చెప్పుకున్నాను.

"కూర్చోండి. అవి నా మాత్రలు కావు. ఎవరో కంపెనీవాళ్ళు తయారు చేసినవి. ఏదైనా పనిచేసింది మందు." అన్నాడాయన.

ఈసారికూడా డాక్టరుగారింట పేషంట్స్ లేరు. అయన్ను చూస్తే, ఏదన్నా సహాయం చెయ్యగలిగితే ఎంత బాగుండు ననిపించింది. మొత్తంమీద రోగులనుఆకర్షించేశక్తి ఆయనలో లేదు. ఆయనకు డబ్బు కావాలో అక్కర్లేదో కూడా తెలియరాలేదు. జీవితపు అట్టడుగు మెట్టుమీద జీవిస్తున్నాడనటానికి సందేహం లేదు. అటువంటి వాడికి కొంత డబ్బుకాంక్ష ఉండటంలో తప్పులేదు. ఒంటరిగాడైనా కాదు; పెళ్ళామూ, పిల్లా గల సంసారి. డాక్టరిగారి భార్యకూడా కనిపించింది. రెండురూపాయలు ఖరీదుచేసే అహమ్మదాబాదు మిల్లుచీరె కట్టుకున్నది. ఒంటిమీద చిన్నమెత్తు బంగారం లేదు. ముక్కూ, చెవులూ, చేతులూ బోడిగా ఉన్నాయి. క్రిస్టియనులాగున్నది — మొహాన బొట్టు మినహాయిస్తే.

కృతజ్ఞత చెప్పుకోవటం అయింది గనక నేను సెలవు పుచ్చుకుందా మనుకున్నాను. కాని ఆయన వెళ్ళనివ్వక, "సెలవులేగదా, ఏం తొందర, కూర్చోరాదూ?" అంటూ నేలమీదినుంచి ఒక పుస్తకం తీశాడు.

"ఏమిటండీ ఆ పుస్తకం?" అన్నాను.

"షా నాటకం. డాక్టర్స్ డిలెమా: నాటకం కాదు, చదవాలిసింది ప్రిఫేస్. వైద్యాన్నీ, వైద్యుల్నీ పట్టుకు కడిగేశాడు!" అన్నాడు డాక్టరుగారు తన కసితీరినంత సంతోషంగా.

డాక్టరుగారి అసలు వ్యసనం సాహిత్యమని నాకు క్రమంగా తెలిసి వచ్చింది. ఆయన జీవితాన్ని మరిచిపోవటానికే సాహిత్యాన్ని అడ్డంపెట్టుకుంటున్నాడో, లేక జీవిత సత్యాలను సాహిత్యంలో చూసి ఆనందిస్తున్నాడో నాకు చచ్చినా అర్థం కాలేదు.

నా సాహిత్యాభిలాష ఏమిటో తెలుసుకోవటానికి ప్రయత్నించి ఆయన విఫలుడయాడు. నేను అప్పటికి ఒక్క షానాటకం గాని ప్రిఫేసుగాని చదవలేదు.

వినేవాళ్ళుంటే ఆయనకు మాట్లాడటం సరదా. ఆయన ప్రచారకుడిలాగా కనిపించేవాడు కాడు; తన తలలో ఎప్పటి కప్పుడు ఏర్పడే సరికొత్త భావాలను ఎవరితోనన్నా పంచుకోవటం ఆయన కిష్టం. ఆయన సంభాషణలో ఇంకో విశేష మేమంటే, సాహిత్యంనుంచి వైద్యానికి, వైద్యంనుంచి సాహిత్యానికీ క్షణంలో మారేవాడు.

"వైద్యంలో వచ్చిన పెద్ద చిక్కేమిటంటే చాలా రోగాలకు నమ్మకమైన చికిత్స లేదు. జలుబుకూ, తలనొప్పికీ మందుల్లేవు. టైఫాయిడ్‌కు మందుల్లేవు. పెర్నిషస్ ఎనీమియాకు ఫోలికేసిడ్ ఈ మధ్యనేగదా వచ్చింది? టి. బి. లాటి దిక్కుమాలిన రోగానికి మందేమిటి? విశ్రాంతి, మంచి ఆహారమూ తప్ప ఏమీలేదు. ఊపిరితిత్తి మరీ దెబ్బతింటే ఏ. పీ. ఇస్తాం. బీస్ట్లీ చికిత్స. ఏ. పీ. షాక్‌తో పేషంటు బల్లమీదనే చావటం నే నెరుగుదును. టీ. బీ. అంటే జ్ఞాపకం వచ్చింది. థామస్ మాన్ మాజిక్ మౌంటెన్ చదివారా? ఎమేజింగ్! ఏళ్ళతరబడి శానిటోరియాలలో ఉన్నవాడు తప్ప ఆ పుస్తకం రాయలేడు. లిటరేచరంటే అట్లా ఉండాలి. మన లిటరేచరూ ఉంది. ప్లీడరు ప్లీడరులాగుండడు, డాక్టరు డాక్టరులాగుండడు, మేస్టరు మేస్టరులాగుండడు. అందరూ ఒక్కలాగే ఉంటారు ఖర్మ!"

డాక్టరుగారి ధర్మమా అంటూ నాకు ఇంగ్లీషు సాహిత్యంలో పూర్వం ఎన్నడూ లేనంత ఆసక్తి కలిగింది. షా నాటకాలు చదివాను. రెండు ఇబ్సెన్ నాటకాలూ, గాల్స్‌వర్దీ నాటకాల సంపుటీ చదివాను. ఇవన్నీ డాక్టరుగారు లైబ్రరీనుంచి అరువు తెచ్చినవి. ఆయనదగ్గిర షేక్‌స్పియర్ రచనలూ, డికెన్స్, థాకరే, హార్డీ, స్కాట్ నవలలూ కొన్ని ఉన్నాయి.

డాక్టరుగారి వయసు నలభై దాటిఉండాలి. మనిషి సన్నం, కాని ఈడుకు మించిన వార్ధక్యలక్షణా లున్నాయి. ఆయనతో పరిచయం అయినతరవాత ఆయన సంగతు లన్నీ అడిగి తెలుసుకున్నాను. ఆయనకు దీర్ఘరోగు లిద్ద రున్నారు. ఇద్దరూ చెరొకపాతికా ఇస్తారు. దానితోనే ఆయనకు కాలక్షేపం.

ఆయనకు రోగాలను గురించీ, చికిత్సలను గురించీ కన్న ఆరోగ్యం గురించి మాట్లాడటం ఇష్టం.

"ఆరోగ్యమనేది ఫిక్సెడ్ డిపాజిట్ వేసుకునేదికాదు. అది డైనమిక్ ఫంక్షన్ డైనమోను నడిపి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసినట్టు శరీరంలో అనుక్షణమూ ఆరోగ్యం ఉత్పత్తి కావాలి. అంతేగాని...ఆరోగ్యాన్ని వినియోగించుకోవటంలోనే దానికి భంగం కలుగుతూంటుంది. దాన్ని సరిచేసుకునేశక్తి శరీరానికుండాలి. నడిచేవాడికి అడుగుతీసి అడుగు వేసినప్పుడల్లా బాలెన్సు తప్పుతూనే ఉంటుంది. దాన్ని నడకలోనే సరిచేసుకుంటూఉంటాం. అంతేగాని బాలెన్సుకు అసలు భంగమే రాగూడదనుకుంటే నడవనేలేం; ఎక్కడికీ పోలేం. కొంతమంది ఆరోగ్యానికి భంగము కలక్కుండా జీవించాలనుకుంటారు. అదేం జీవించటం? అంటువ్యాధులనే తీసుకుందాం. వాటికి శరీరం ఇమ్యూన్ కావాలంటే అవి శరీరంలో ప్రవేశించికూడా వ్యాధి కలిగించకుండా ఉండాలన్నమాట. అంతేగాని వాటిని ఆమడదూరంలో ఉంచడం ఇమ్యూనిటీ సంపాదించటంకాదు. మైక్రోబ్ హంటర్స్ అన్నపుస్తకం చదివి పిరికివాడైపోయి, ఈనాటి కింకా భయంతో చదువుతున్నవాణ్ణి నే నెరుగుదును. ఈ నాగరికత ఒకవంక మనిషికి గొప్పశక్తు లిస్తున్నది గాని, మరోవంక నిర్వీర్యపరుస్తున్నది."

నేను సాధారణంగా ఆయననే మాట్లాడనిచ్చేవాణ్ణి, వినేవాణ్ణి. కాని ఈసారి, "ఈ నాగరికత అంటనివా ళ్ళెంతమంది ఉన్నా రంటారు?" అన్నాను.

"అబ్బో, లక్షలు! కోట్లు!" ఆయన

భరించని వారిపైన కత్తి కడతారు. నమ్మకాలు అందరికీ ఉంటాయి. నాకే ఉన్నాయి. కాని ఆ నమ్మకాలలో విశ్వాసం ఉన్నవాడు వాటిని నిలబెట్టుకునేటందుకు జీవితంలో కొన్ని సుఖాలో, సౌకర్యాలో విడిచిపుచ్చాలి. ఆయనకు నేనంటే ఏమిటి కోపం? నా భార్య వితంతువనీ, బాలవితంతు వన్నా గాక ఒక మొగెడితో కొంతకాలం కాపరం చేసిందనీనూ. ఆడవాళ్ళు రెండోపెళ్ళివాణ్ణీ, మూడోపెళ్ళివాణ్ణీ చేసుకోవటంలో వాళ్ళకేమీ విడ్డూరం కనిపించదు. మగవాడు రెండో పెళ్ళిదాన్ని చేసుకుంటే మిన్ను విరిగి మీద పడ్డంత గలభా చేస్తారు. అది రేషనల్ కాదు. మా నాన్నను మెప్పించటానికో, ఆయన డబ్బుకోసమో నేనుకూడా ఇర్రేషనల్‌గా ఉండనా? ఒకడి పెళ్ళాని చాటుగా ప్రేమించటం సాధ్యమైనప్పుడు, ఒకడి, వితంతువును బహిరంగంగా ప్రేమించటం ఎందుకు అసాధ్యం కావాలీ? ఎందరి సంసారాలో చూశాను. నా భార్యలాటి అనుకూలవతి నూరుమందిలో ఒకతె ఉంటుందని నాకు తోచదు. నేను కోతలు కొయ్యటంలేదు."

కొత్తస్థలంలో నీరులాగా డాక్టరుగారు నా కింకా పూర్తిగా నంటబట్టలేదు. ఆయన మాట్లాడుతుంటే ఒక్కొక్కసారి నా మనసు నిర్దుష్టంగా ప్రతిధ్వనించేది. కాని ఒక్కొక్కసారి ప్రతిధ్వని ఆయన మాటలకు ఎదురొచ్చేది. ఇప్పుడదే అయింది. ఆయన ఏదో ఆత్మసంతృప్తితో మాట్లాడుతున్నవాడు లాగా కనిపించాడు. ఆయనకు అంత ఆత్మసంతృప్తి ఉండదగిన కారణం నాకేమీ కనిపించలేదు. ఆయన వితంతువును చేసుకోవటమూ, ఆమె తనకు అనుకూలవతి అయిన భార్య అనుకోవటమూ నా కభ్యంతరం లేదు. కాని ఆయన ఇప్పుడున్న దారిద్ర్యానికీ ఆయన రేషనల్‌గా జీవించటానికీ సంబంధ మేమిటో నాకర్థం కాలేదు. ఆయన ఇల్లూ, ఇంటి వాతావరణమూ, ఆయన సాగించే వృత్తీ చూస్తే ఎండిపోయిన మాసులు స్ఫురించాయి. ఆయనచీకటిలో ఉన్నమనిషి అనిపించాడుగాని వెలుగులో ఉన్నమనిషిలా కనిపించేవాడు కాడు. క్షమదేవత లక్షణాలు, అనరాదు గాని, డాక్టరుగారిలో కొన్ని ఉండేవి. ఆ లక్షణాలకూ ఆయన చెప్పే విలువలకూ సంబంధం ఉండేది కాదు. ఒక్కొక్క నిజం ఒక్కొక్కరు చెబితేనే రాణిస్తుంది. ఇతరులు చెబితే రాణించదు. ఛాందస బ్రాహ్మడి నోట శృంగార కవిత్వం విన్నట్టుగా ఉంటుంది.

నేను డాక్టరుగారిని గురించి ఇటువంటి వ్యతిరేక భావంతో ఉన్నప్పుడల్లా, ఆయన జీవితం మోడులాగా ఉండటం ఆయన తప్పే ననిపించేది. రోగు లాయనదగరికి రాకపోవటం కూడా సహజమే ననిపించేది. చిదానందంగాడి కాయన మీద కోపమూ, అభిమానమూ కూడా ఉన్నదంటే ఆశ్చర్య మేమిటి?

అయితే నాకు మాత్రం డాక్టరుగా రంటే ఇదే అభిప్రాయం ఉండేదికాదు. ముఖ్యంగా ఆయనకు గల సాహిత్య ప్రియత్వం చూసేటప్పుడు ఆయనంత సంపన్నుడు లేడని పించేది. నేను చదివిన షేక్‌స్పియర్ నాటకమే ఆయన చదువుతూ ఆనందం పొందుతుంటే నాకా నాటకంలో రెట్టింపు స్వారస్యం కనిపించేది. ఆయన సాహిత్య ప్రియత్వం ఒకరకం అంటువ్యాధే నని చెప్పాలి. నేను దానితో ఇప్పటి కింకా తీసుకుంటూనే ఉన్నాను. నేనే యూనివర్సిటీకైనా వైస్‌చాన్సల రయితే ఆయన్ని ఇంగ్లీషు లిటరేచరు బోధించటానికి పెట్టేఉందును.

ఒకే ఒక్కసారి ఈ విషయంపైకూడా ఆయనని ఆక్షేపించాను. "డాక్టరుగారూ, మీకు భావాలపట్ల ఉన్న ఆసక్తి భౌతిక జీవితంపైనకూడా ఉంటే మీ జీవితం మరింత సుఖంగా ఉండునేమో!" అన్నాను.

"నా కట్లా అనిపించటంలేదు. నిజమైన ఆనంద మంతా భావప్రధానమైనదే. నేనొక ఆడపేషంటు నాడి చూస్తే అందులో ఏమీ లేదు. కాని పేషంటు గాని మనిషి చెయ్యి పట్టుకుంటే చాలా గొడవవుతుంది. చెయ్యి పట్టుకోడం ముఖ్యంకాదు, భావమే ముఖ్యం. 31లో ఒక విషయం విన్నాను. మా ఊళ్లో ఒక ప్లీడరుగుమాస్తా క్లయింట్ల సొమ్ము కొంత తినేశాట్ట. దాన్నిగురించి ప్లీడరుగారి దాకా వెళ్ళి ఆయన ప్రోబింగు అరంభించే సమయంలో ఆ గుమాస్తా కాస్త సత్యాగ్రహోద్యమంలో చేరి, అరెస్టయి, జైలుకు పోయి దేశభక్తుల జాబితాలో చేరిపోయాడు. ఎందుకు చెప్పా నీమాట? ఆఁ! పెద్దభావం వచ్చి చిన్నభావాన్ని కొట్టేసింది.... భావాలు గాలిలో తేలిఉంటా యని కాదుసుమా. పుస్తకాలు చదివి నిజంగా ఆనందించ దలచినవాడికి జీవితం బాగా తెలియాలి. జీవితానుభవానికి అతీతంగా ఉండే కావ్యానందాన్ని నేనూ ఆమోదించాను. అయితే పుస్తకాలు చదివి ఆనందించటానికి మూడుపూటలా పెరుగన్నమూ, సిల్కుబట్టలూ, పెద్దరాబడీ, పరువూ, హోదా, నౌకర్లూ, చాకళ్ళూ కావాలంటావా? అదీ ఒప్పుకోను."

ఆయన అన్నమాటల్లో అభ్యంతరం చెప్పటానికి నాకేమీ కనిపించలేదు. ఆయనే ఇంకా చెప్పుకుపోయారు.

"నీవు గమనించే ఉంటావు. మన సమాజంలో కిందితరగతులవాళ్లూ పుస్తకాలు చదవరు, చదివిన వినరు. ఎందుచేత? వాళ్ళ వాస్తవ జీవితానికి అనుగుణమైనదేదీ సాధారణంగాపుస్తకాలలోఉండదు. వాళ్ళభౌతికానుభవం సహాయంతో పొందటానికి కావ్యానందం మన మామూలు పుస్తకాలలో వాళ్లకి కనిపించదు. మనం సాహిత్య మనుకునే దానికన్న పురాణాలే వాళ్ళకి అందుబాటులో ఉంటాయి. రాముడూ, రావణుడూ, సీతా, కైకేయీ, దశరథుడూ, పాండవులూ చాలా తేలికగా అర్థమయే పాత్రలు. వాటితో పోల్చితే షేక్‌స్పియర్ పాత్రలు నిగూఢమైనవి. ఆ మాట అంటే మన పండితులు నేను పాశ్చాత్య వ్యామోహంలో పడిపోయానంటారు. భాసుడి నాటకాలేవైనా చూశావా? అరెరే ఎంతపొరపాటూ? రేపు కూర్చుని ప్రతిమ చదువుదాం. నా దగ్గిర కాపీవుండాలి. వాల్మీకి కన్న భాసుడు, నన్నడిగితే, చాలా సటిల్? అతనికి కవి సమయాలూ, కన్వెన్షన్లూకూడా ఉన్నట్టు నాకుతోచలేదు."

మర్నాడు డాక్టరుగారు ప్రతిమ చదివి వినిపించాడు. ఆ అనుభవం నాజన్మలో మరువను. భాసుడెవడో, ఏ శతాబ్దివాడో నాకు తెలీదు. కనీసం షేక్‌స్పియర్‌కన్నా, తప్పకుండా ఫ్రాయిడ్ కన్నాముందువాడు. ప్రతిమలో సైకిక్ రిప్రెషన్ చిత్రించాడు భాసుడు: దాన్ని డాక్టరు వివరించాడు. నాకు మతిపోయినట్టయింది.

[సశేషం]

# విశాఖపట్టణం ఉక్కు ఫ్యాక్టరీ

**వావిలాల గోపాలకృష్ణయ్య**

ఒక దేశంయొక్క ఆర్థిక వ్యవస్థలో 'ఉక్కు' కీలకమైనది. దేశంయొక్క పారిశ్రామికాభివృద్ధికి అది గట్టి పునాది రాయి. ఉక్కు పరిశ్రమ అభివృద్ధి చెందకుండా దేశంలో భారీ ఎత్తున నిర్మాణమూ, పెట్టుబడికి ధనం తయారు కావటమూ అసలు ఊహించలేని విషయాలు. కాబట్టి ఒక దేశం యొక్క ఆర్థిక పురోగభివృద్ధి ఆ దేశంలో ఎంత ఉక్కు తయారవుతుందో, దాన్నిబట్టి లెక్కిస్తారు. దేశం యొక్క ఆర్థిక సౌష్టవానికీ, రక్షణ సామర్థ్యానికి ఆ దేశంలో తయారైన ఉక్కు నిజమైన కొలమానం.

నాలుగవ పంచవర్ష ప్రణాళిక తయారు చేయటంలో ఉక్కుకు సంబంధించిన విషయంలో ప్రభుత్వానికి తోడ్పడటానికి ఒక సారథ్య దళం నియమించబడింది. ఈ సారథ్యదళం వారి అభిప్రాయంలో ఎగుమతికి ఏర్పాటు లేకుండా కేవలం దేశీయావసరాలకే, 120 లక్షల టన్నుల ఉక్కు తయారు చేసేందుకు 160 లక్షల టన్నుల ఇన్‌గాట్స్ కావాలి. ఎగుమతికి కూడా ఏర్పాటు చేసినట్లయితే 17.3 లక్షల టన్నుల ఉక్కు తయారు చేయాలి. ఫౌండ్రీరకం దుక్క ఇనుము. 40 లక్షలు కావలసి ఉంటుందని అంచనా వేయబడింది.

ఈ పైన పేర్కొన్న ఉత్పత్తి లక్ష్యాలను చేరుకొనేటందుకు ప్రస్తుతం ఉన్న ఉక్కు ఫ్యాక్టరీల ఉత్పత్తి సామర్థ్యాన్ని వీలయినంత ఎక్కువ చేయటంద్వారా కలిగే లాభాన్ని పూర్తిగా వినియోగించుకోవాలని పై సంఘం అభిప్రాయపడింది. ఇప్పటికే ఉన్న ఫ్యాక్టరీల సామర్థ్యాలను యీ క్రింది విధంగా ఎక్కువ చేయవచ్చునని సూచించింది.

## ఉక్కు ఉత్పత్తి

(లక్షల ఇగ్నెటు టన్నులు)

| ఫ్యాక్టరీ పేరు | 1966–67 ఈనాడు | 1970–71 ఆశించినది | అంచనా |
|---|---|---|---|
| టాటా | 20.00 | 30.00 | 30.00 |
| ఇండియా | 20.00 | 20.00 | 13.00 |
| భిలాయ్ | 25.00 | 35.00 | 35.00 |
| రూర్కెలా | 18.00 | 25.00 | 21.05 |
| దుర్గాపూర్ | 16.00 | 30.00 | 23.00 |
| మొత్తం | 86.00 | 140.00 | 122.05 |

భిలాయ్, రూర్కెలా, దుర్గాపూర్ లలో 1966–67 నాటికి మూడవ ప్రణాళిక విస్తృత ప్లాను అమలు జరిగితే.

మొదట్లో 1970–71 నాటికి బొకారో ఫ్యాక్టరీ 4 మిలియన్ టన్నులవరకూ పని చేస్తుందని. 25 లక్షల టన్నుల ఇగ్నెటు ఉక్కు తయారు చేస్తుందనీ ఊహించబడింది. కాని తర్వాత బొకారో ఫ్యాక్టరీలో 15 నుండి 20 లక్షల టన్నులు మాత్రమే తయారుచేసి తర్వాత, 40 లక్షల టన్నుల వరకూ ఉత్పత్తి అభివృద్ధి చేయాలని నిర్ణయించబడింది. ఈ ఫ్యాక్టరీ సోవియట్ రష్యా సహాయం చేసే షరతులు నిర్ణయించబడినవి. 25–1–65 తేదీన ఢిల్లీలో ఈ సహాయపు ఒడంబడికపై రష్యా ఇండియా అధికారులు సంతకాలు చేశారు. మన అంచనాలకు, ఉన్న సామర్థ్యానికీ మధ్యగల భేదాన్ని తగ్గించేందుకూ, ఇంకా ముందు ముందు, జరుగవలసిన అభివృద్ధికి తగిన పునాది తయారు చేసేందుకూ, బొకారో ఫ్యాక్టరీ కాక 15 లక్షల టన్నులు ఉత్పత్తి చేయగల ఇంకా రెండు ఉక్కు ఫ్యాక్టరీలు నాలుగవ ప్రణాళికలో స్థాపించటం అవసరమనికూడ నిర్ణయించబడింది.

దక్షిణదేశంలో సుమారు 5 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి చేసేటందుకు వీలుగా నైవేలీ లిగ్నైటు ఫ్యాక్టరీ, సేలం ఇనుప గనులమీద ఆధారపడుతూ ఒక ఉక్కు ఇనుము ఫ్యాక్టరీని స్థాపించాలని మూడవ ప్రణాళిక ఉద్దేశించింది.

మద్రాసు రాష్ట్రంలో వీలయినంత వరకు తక్కువ ఖర్చుతో ఎక్కువ సామర్థ్యంగా పనిచేయగల్గి, ప్రారంభ దశలో సంవత్సరానికి 300,000 నుండి 500,000

మెట్రిక్ టన్నుల వరకూ ఇగ్నేటు, తరువాత పోతఉక్కు తయారు చేసేటట్లుగా వీలైతే ఇంకా అభివృద్ధి చేసేటందుకు వీలుగా ఇగ్నైటు. తయారుచేసే ఒక ఫ్యాక్టరీ స్థాపించేందుకు వివరాలు సేకరించి సంపూర్ణమైన నివేదిక సమర్పించేందుకు దస్తూర్ కంపెనీని ప్రభుత్వం నియమించింది.

ఈ కంపెనీని నియమించినప్పుడు జరిగిన ఒప్పందం ప్రకారం నైవేలీ–సేలం ఉక్కు ఫ్యాక్టరీ స్థాపించేందుకు ముందుగానే తగిన స్థలం నిర్ణయించుకొనటానికి వీలుగా. సేలం పట్టణానికి 10 కిలో మీటర్లు పశ్చిమంగావున్న 'కంజూమలై' ఉక్కుఫ్యాక్టరీ నిర్మాణానికి తగన ప్రదేశం అని పై కంపెనీ నిర్ణయించింది. ఆ ప్రకారంగానే కంజూమలైవద్ద 10,000 హెక్టార్ల స్థలం ఉక్కుఫ్యాక్టరీ నిర్మాణానికి ఉద్దేశించిందిగా మద్రాసు ప్రభుత్వం ప్రకటించింది.

దస్తూర్ కంపెనీవారి పూర్తి వివరాలతో కూడిన నివేదిక సేలం–నైవేలీవద్ద ఫ్యాక్టరీ నిర్మించటాన్ని ఆ ప్రదేశానికి కావలసిన ఉక్కు మీద ఆధారపడి సమర్థించింది. కంజూమలై వద్ద వ్యాపారావసరాలకు కావలసిన ఉక్కు తయారు చేసేందుకు ప్రారంభ దశలో 500,000 ల టన్నుల ఉక్కును వినియోగించు శక్తిగల ఫ్యాక్టరీ నిర్మించాలని యీ నివేదిక సూచించింది. దీనికి కావలసిన పెట్టుబడి సుమారు 95 కోట్ల నలభైలక్షల రూపాయలు వుంటుంది. అందులో 38.60 కోట్ల విదేశీ మారకద్రవ్యం కూడా వుంటుంది అని కూడా చెప్పింది. సేలం వద్ద ఫ్యాక్టరీ నిర్మించడానికి ఎక్కువ పెట్టుబడి అవసరం లేదనీ, ఫ్యాక్టరీ నిర్వహణ వ్యయం కూడా తక్కువగా వుంటుందనీ యీ దస్తూర్ కంపెనీ తమ అభిప్రాయం వెల్లడించారు.

నాలుగవ పంచవర్ష ప్రణాళిక తయారు చేయటంలో ఇనుము, ఉక్కు విషయాలలో ప్రభుత్వానికి తోడ్పడేందుకు నియమించిన సారథ్యసంఘంవారి సిఫారసుల ననుసరించి. గోవా–హాస్పేట ప్రాంతంలోనూ, బైలదిల్లా–విశాఖపట్నం ప్రాంతంలోనూ రెండు ఉక్కు ఫ్యాక్టరీలు నిర్మించేటందుకు సాధ్యమవుతుందా లేదా అన్న విషయంపై దస్తూర్ కంపెనీనుండి. హిందూస్తాన్ స్టీల్ కంపెనీవారి కేంద్ర సాంకేతిక సంస్థనుండి నివేదికలు ప్రభుత్వం సేకరించింది. పై ఫ్యాక్టరీలు సుమారు 150 లక్షల టన్నులు ఉక్కును ఉత్పత్తి చేస్తాయి.

ఈ ఫ్యాక్టరీలు ఎక్కడ నిర్మించాలి అని నిర్ణయించటంలో ప్రభుత్వానికి తోడ్పటానికి నియమింపబడిన ఒక సాంకేతిక నిపుణుల సంఘం పై రెండు నివేదికల్నీ కూలంకషంగా పరిశీలించి, పై రెండు స్థలాలకు గల అనుకూల, వ్యతిరేక పరిస్థితులను కూడా పరిశీలించి, యీ క్రింది నిర్ణయాలు చేసినట్లు తెలుస్తున్నది.

1. హాస్పేటకు దగ్గిరగా వున్న తోరణగల్లు వద్ద సంవత్సరానికి ముప్పది లక్షల టన్నుల ఇగ్నైట్సును ఉత్పత్తి చేసే సామర్థ్యంగల ఒకపెద్ద ఫ్యాక్టరీని నిర్మించాలి.
2. ఈ హాస్పేట ఫ్యాక్టరీ నాలుగవ పంచవర్ష ప్రణాళిక కాలంలోనే ఉత్పత్తి ప్రారంభించడానికి వీలుగా వెంటనే ఫ్యాక్టరీ నిర్మాణానికి ముందుగా తీసుకోవలసిన చర్యలు తీసుకోవాలి.
3. ఐదవ పంచవర్ష ప్రణాళికకు కావలసిన ఉక్కు తయారు చేయడానికి నిర్మించవలసిన ఉక్కు ఫ్యాక్టరీలకు బైలదిల్లా – విశాఖపట్టణం ప్రాంతం అనువైనది. ఇక్కడ ఫ్యాక్టరీ స్థాపించడానికి నాలుగవ ప్రణాళికలోనే తగినంత ధనం కేటాయించడానికి వీలుగా ఒక ప్రాథమిక సర్వే నివేదిక వెంటనే తయారు చేయించాలి. అదే సమయంలో బాలచెరువు వద్ద ఒక నౌకాశ్రయం నిర్మించటానికి గల అవకాశాలనూ, బైలదిల్లాకు రైల్వే లైను వేయడాన్నీ, ప్రాజెక్టు స్థలంవద్దలభించే నీటి వనర్లూ, మొదలైన సౌకర్యాలను గూడా పరిశీలించాలి.

ఏయే స్థలాల్లో ఫ్యాక్టరీల నిర్మాణం సాధ్యమవుతుందో పరిశీలించి నివేదికను తయారు చేయడానికి భారత ప్రభుత్వానికి - ఒక ఆంగ్లో అమెరికన్ కంపెనీ మధ్య ఒక ఒప్పందం యీ మధ్యనే కుదిరింది. ఈ కంపెనీ తమ నివేదికను నాలుగు నెలల్లోపల భారత ప్రభుత్వానికి అందచేయవలసివుంది.

ఈ దళం పర్యటన ప్రారంభించిన తర్వాత 3-2-65 వ తేదీన ప్రకటింపబడిన ఒక వార్త ప్రకారం 150 లక్షల టన్నుల ఉత్పత్తి సాగగల ఐదవ ఉక్కు ఫ్యాక్టరీని గోవాదగ్గర స్థాపించే సూచనలు వున్నాయి అన్నారు.

ఈ ఫ్యాక్టరీకి కావలసిన విదేశీ మారకధనం, తదితర ఖర్చులు మొదలైన వివరాలు అనేక విషయాలపై ఆధార పడి వుంటాయి. వాటి నన్నిటినిగూర్చి సమగ్ర పరిశీలన జరిగితే గాని సరియైన వివరాలు తెలుసుకోలేము. అని కూడ అన్నిట్లో ప్రకటింపబడింది.

ఈ ఆంగ్లో అమెరికన్ కంపెనీ నిపుణుల బృందం బళ్ళారి జిల్లాలోని హాస్పేట ప్రాంతంలో పర్యటించి, ఐదవ ఉక్కు ఫ్యాక్టరీల ఆ ప్రాంతంలో నిర్మించడానికి సుముఖంగా అభిప్రాయం వెలిబుచ్చినట్లు 24-2-65 వ తేదీన మైసూరు పరిశ్రమల మంత్రి శ్రీ కె. మల్లప్పగారు చెప్పారు. శ్రీ మల్లప్ప ఆంగ్లో అమెరికన్ కంపెనీ బృందంతో హాస్పేటలో ఉక్కు ఫ్యాక్టరీ స్థాపించటం గురించి వివరంగా చర్చించారని, అంతేకాక తమ రాష్ట్ర ప్రభుత్వ సాంకేతిక నిపుణులు తయారు చేసిన నివే

దికను కూడా పై కంపెనీకి అందజేశామని చెప్పారు.

దస్తూర్ కంపెనీ హాస్పేటకు 25 మైళ్ళ దూరంలోవున్న తోరణగల్లు ఫ్యాక్టరీ స్థాపనకు అనువైన స్థలం అని సూచించగా ఆంగ్లో అమెరికన్ కంపెనీ సభ్యులు మాత్రం హాస్పేట – కొత్తూరు రైల్వే లైనుపై హాస్పేటకు 7 మైళ్ళదూరాన గల వేరొక ప్రదేశానికి సుముఖులుగా ఉన్నట్లు కనబడుతోందని, తగినంత సున్నపురాయి లభించే అవకాశాన్ని పరిశీలించడానికి యీ కంపెనీసభ్యులు బగల్ కోటకూడా పర్యటించారని తెలుస్తున్నది.

అక్కడ ఏర్పాటుచేయదలచిన ఉక్కు ఫ్యాక్టరీకి 2 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి కావలసివుంటుంది. ఫ్యాక్టరీ పరిసరాల్లో 120 మైళ్ళ రైల్వేలైను నిర్మించవలసి వుంటుంది:

ఆంగ్లో అమెరికన్ కంపెనీ జూన్ నెలాఖరులోగా కేంద్రప్రభుత్వానికి తమ నివేదిక నందజేస్తుందనీ, కేంద్రప్రభుత్వం స్థల నిర్ణయం చేసిన 10 నెలలలోగా ప్రాజెక్టు రిపోర్టు తయారవుతుందని కూడా శ్రీ మల్లప్ప చెప్పారు.

తుంగభద్ర నదీతీరంలోవున్నహాస్పేట వద్ద ఇనుమూ, సున్నపురాయీ, విద్యుచ్ఛక్తి సమృద్ధిగా లభిస్తాయి. ఉక్కు ఫ్యాక్టరీ నిర్మించటానికి ఈ మూడు అత్యంత ప్రధానమైనవి అని కూడ శ్రీ మల్లప్ప అన్నారు.

ఉక్కుఫ్యాక్టరీ నిర్మించడానికి తగిన స్థలనిర్ణయం అక్కడ లభించే ముడి సరుకూ, విద్యుచ్ఛక్తి, అక్కడగల రవాణా సౌకర్యాలపై ఆధారపడి వుంటుందని ఆంగ్లో అమెరికన్ కంపెనీలో భాగస్వాములైన "కాపర్స్ ఇంటర్నేషనల్" కంపెనీ ప్రతినిధి శ్రీగార్డన్ కాక్స్ చెప్పారు,

ఈ స్థలాలను పరిశీలన చేయటానికి వచ్చిన ఆంగ్లో అమెరికన్ దళంవారు సేలం ప్రాంతం కూడా వెళ్ళివచ్చారు. అక్కడిప్రాంతం ఫ్యాక్టరీకి చాల అనువైనస్థలం అని వారభిప్రాయం ప్రకటించినట్లు పత్రికల్లో వార్తలు వచ్చాయి.

అల్లే యీదళం హైదరాబాదుకు మార్చి నాల్గవతేదీన వచ్చారు. మేమందరం ముఖ్యమంత్రి యింటివద్ద వారిని కలిశాం. మన ప్రభుత్వంతో సంప్రతింపులు జరిపి అటుతర్వాత విశాఖపట్టణంవెళ్ళి ఆ ప్రాంతములు అన్నీ తిరిగిచూశారు. వారి అభిప్రాయం తెలుపవలసినదిగా పత్రికలవారు అడిగితే తామిదివరలో చెప్పనివిషయాలు చెప్పినట్లు ప్రకటింపబడినవనీ, అందుచే తామేమీ చెప్పదలచలేదని అయితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తమకు కావలసిన వివరాలు సమగ్రంగా అందజేశారని అన్నారు.

1965 మార్చిలో లోక్ సభలో ఉక్కుశాఖ తరఫున మాట్లాడుతూ కేంద్రప్రభుత్వప్రతినిధి ఆంగ్లో అమెరికన్ నిపుణుల నివేదిక తమ కందిన తర్వాత పరిశీలనచేసి నిర్ణయం ప్రభుత్వమే తీసికుంటుందన్నారు. - 'హిందూ'. 14–3–1965.'

శ్రీ సి. సుబ్రమ్మణ్యం కేంద్రంలో ఉక్కుమంత్రిగా వుండినప్పుడు హైదరాబాదునుండి హెవీ ఎలెక్ట్రికల్స్‌నూ ఇప్పుడున్న దానినికూడ తిరుచునాపల్లి పోతున్నదని ఆంధ్రప్రజానీకం తీవ్రాందోళన చేసిన సందర్భంలో హైదరాబాద్ వచ్చినప్పుడు నేనూ శ్రీ తెన్నేటి విశ్వనాథం కలిశాం. మాతో విశాఖపట్టణంలో ఉక్కుఫ్యాక్టరీ పెట్టడం తథ్యం అని చెప్పారు. అంతేకాదు ఆరోజు బహిరంగ ప్రకటన కూడా చేశారు. మరియిప్పుడు కేంద్రప్రభుత్వ ప్రతినిధి లోక్ సభలో పైవిధంగా నివేదిక వచ్చినతర్వాత నిర్ణయం తీసుకుంటా మనడంలో యీ ప్రవీణులదళం ఇన్నిప్రాంతాలు తిరుగవలసిన పని లేనేలేదు. ఒక్క విశాఖపట్టణం, బైలదిల్లాప్రాంతం సమగ్ర సాంకేతిక పరిశీలనచేసి ఉక్కుఫ్యాక్టరీ నిర్మాణానికి కావలసిన సాంకేతిక నివేదిక మాత్రమే సమర్పించవలసి వుంది. నిర్ణయం అయినతర్వాత తిరగడం అనవసరమే. అనుమానాలకు కారణమే. ఏమైనా సాంకేతిక దళంవారు గోవా, హాస్పేట, సేలం, విశాఖపట్టణం ప్రాంతాలు చూశారు. ఆయారాష్ట్రాలు తమతమ ప్రాంతాలలో ఫ్యాక్టరీ పెట్టడానికి ఉన్న అవకాశాలు తెలియజేశారు. నివేదికలు సమర్పించారు. దళంవారు ఇక రెండు మూడు నెలల్లో తమ నివేదికను కేంద్రప్రభుత్వానికి సమర్పించుతారు.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా వెనుకబడివున్న రాష్ట్రం అనేది నిర్వివాదం. ఆంధ్రప్రదేశ్ ఇప్పటికి మూడు ప్రణాళికలలోనూ వెనుకబడింది. అఖిల భారతంలో తలసరి సగటు ఆదాయం 334 రూపాయలుంటే మన ఆంధ్రప్రదేశ్ 287 మాత్రమే వుంది అంటే తలకు 57 రూపాయలు తక్కువ అయిందన్న మాట. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాదాయంలో 105 కోట్లు తగ్గిపోయిందన్నమాట. ఇక మహారాష్ట్రము పోల్చుకుంటే తలకు సరాసరి వారికి 468 రూపాయలుంది. ఈ విధమగు అసమానతలకు గురియై వాటిని సరిచేసుకోవటానికి పారిశ్రామికాభివృద్ధి కన్న గత్యంతరం లేదు. అందుకే ఉక్కుఫ్యాక్టరీ కొంతసహాయపడుతుంది. మనకింతవరకు చెప్పుకోదగ్గ పరిశ్రమలేమీలేవు. పైగా కేంద్రం యిచ్చినవీ లేవు. ఈ ఉక్కుఫ్యాక్టరీ విశాఖపట్టణంలో స్థాపించుటకున్న సౌకర్యాలు, విశాలస్థలం, పుష్కలంగా నీరు సమృద్ధిగా నుండి సరుకు బాహాటంగా రవాణా

వివిధ దేశాలకు ఎగుమతి దిగుమతులు చేయటానికి విస్తరించ నవకాశంగల నౌకాశ్రయంవున్నవి. ఆ సౌకర్యాలు పరిశీలనచేద్దాం.

స్థలం – విశాఖపట్టణం సమీపంలో 30–40 చదరపుమైళ్ళస్థలం ఫ్యాక్టరీ నిర్మాణానికి ముందరనే కేటాయించబడివుంది. ఇప్పటికే పారిశ్రామికంగా అభివృద్ధి అవుతున్న ప్రాంతానికి పక్కనే వుండడంవల్ల యీ పరిశ్రమపెంపుకు అవకాశము మాత్రమేకాక ఇంకా ఇందుకు సంబంధించిన అనుబంధ పరిశ్రమలు విస్తరించుటకు అవకాశము వుంది.

విద్యుచ్ఛక్తి – ఫ్యాక్టరీ మొదటి దశలో '150 లక్షల టన్నులు' ఉత్పత్తికి అవసరమైన మొత్తం 70 మెగావాట్ల విద్యుచ్ఛక్తి. రెండవదశలో '450 లక్షల టన్నులు' ఉత్పత్తికి కావలసినమొత్తం 200 మెగావాట్ల విద్యుచ్ఛక్తి కావలసివుంటుందని అంచనా. ఎగువసీలేరు ప్రాజెక్టు పూర్తికాగానే మొదటిదశలో కావలసిన విద్యుచ్ఛక్తి, దిగువసీలేరు, కొత్తగూడెం, రామగుండం థర్మల్ స్టేషన్లూ, శ్రీశైలం ప్రాజెక్టూ పూర్తికాగానే రెండవదశకు కావలసిన విద్యుచ్ఛక్తి పూరిగా లభిస్తుంది.

## నీరు

150 లక్షలటన్నుల ఫ్యాక్టరీకి రోజుకు 250 లక్షల గాలనుల నీరు కావలసివుంటుంది అనీ, ఇక 450 లక్షలటన్నుల ఫ్యాక్టరీకి రోజుకు 6 కోట్లగాలన్ల నీరు కావలసి వుంటుంది అనీ హిందుస్తాన్ ఉక్కు కంపెనీ సూచించింది. ప్రస్తుతం విశాఖపట్టణంవద్ద రోజుకు 50 లక్షల గాలన్లనీరు లభిస్తోంది. గంభీరగడ్డపై రోజుకు 190 లక్షల మిలియన్ గాలన్ల నీరు సరఫరాచేసే ఒక రిజర్వాయరూ గోస్థనదిపైన తాటిపూడి వద్ద రోజుకు 11 మిలియన్ల గాలన్ల నీరు సరఫరాచేసే మరొక రిజర్వాయరూ, నిర్మించబడుతున్నాయి. ఇవ్వేకాక చంపావతీ నదిపైన రోజుకు 850 లక్షల గాలన్ల నీరు అందించే మరొక రిజర్వాయరూ, శారద నదిమీద రోజుకు 230 లక్షల గాలన్లనీరు అందించే రైవాడ రిజర్వాయరూ, అదేనదిమీద, రోజుకు 680 లక్షల గాలన్లనీరు అందించగల ముద్దుర్తి రిజర్వాయరూ, నిర్మించాలని ప్రస్తుత ప్రతిపాదనలున్నాయి. ఇంకా మేహాద్రిగడ్డ వరద నిరోధక పథకంద్వారా రోజుకు సుమారు 70 లక్షలగాలన్ల నీరులభిస్తుంది. ఉక్కు ఫ్యాక్టరీ మొదటిదశకు కావలసిన నీరు, రైవాడ రిజర్వాయరునుండే సమృద్ధిగా లభిస్తుంది.

పోలవరం వద్ద గోదావరికి బారేజి కట్టి అక్కడి నుండి విశాఖపట్టణమునకు కాలువ త్రవ్వాలని ఇటీవల కేంద్రమంత్రి శ్రీ కె. ఎల్. రావు చెప్పారు. అందుకు మన ప్రభుత్వం పథకం తయారుచేసింది. ఈ కాలువ రవాణా సౌకర్యాలకూ, వ్యవసాయ సౌకర్యములకు కూడా యీ కాలువ ఉపయోగిస్తుంది. ఈ ఉక్కు-ఫ్యాక్టరీకి విశాఖపట్టణం వద్ద కావలసిన నీరు రైవాడ, తాండవ, పాలవరం కుడి కాల్వలు ఎత్తునుండి పల్లానికి ప్రవహించేవే, అందువలన పంపు చేయవలసిన పని లేదు. కావున ఈసారి ఇర్రిగేషన్ సెస్సు రేటుల ననుసరించి వెయ్యిగాలనులకు ఒకటిన్నర పైసా మాత్రమే అవుతుంది? ఈ లెక్కల ప్రకారం 950 క్యూ సెక్కుల నీటికి సంవత్సరం మొత్తాన 15 లక్షల ఉక్కు వుత్పత్తి సామర్ధ్యంగల ఈ విశాఖ ఫ్యాక్టరీకి అందచేస్తే సంవత్సరానికి 1 లక్ష 48 వేలు రూపాయలు మాత్రమే కాగలుగుతుందని తెలుస్తున్నది.

## ముడిపదార్థాలు

మధ్యప్రదేశ్‌లోని బైలదిల్లా ప్రాంతంలో ప్రపంచంలో కెల్లా పెద్దవి, మేలురకం ఖనిజం ఉత్పత్తి చేసేవి అయిన ఇనుపగనులున్నాయి. ఈ ప్రాంతములో ఉక్కు ఫ్యాక్టరీకి ఈ గనులలో లభించే ఇనుము సమృద్ధిగా సరిపోతుంది. 1942 ప్రపంచ 2వ యుద్ధ సమయంలో ఇండియాలోని ఖనిజ సంపదల అంచనా వేసిన గ్రెడీ కమీషన్ ఈ బస్తరు ప్రాంతంలో సమృద్ధిగా ఇనుము వుందని అది తరుగని సంపద అని వ్రాశారు. ఈ ప్రాంతంలో ముఖ్యంగా దక్షిణ బస్తర్ ఆంధ్రప్రాంతం. రాష్ట్ర పునర్నిర్మాణ సమయంలో ఆంధ్రలోకి కలుపవలెనని ఆంధ్రప్రదేశ్‌లోని అన్నిరాజకీయపార్టీలు, సంస్థలు కేంద్రప్రభుత్వాన్ని అభ్యర్థించినా, ఒరిస్సా కూడా అడుగుతున్న దంటూ ఈ ప్రాంత మిదివరకు మధ్య రాష్ట్రంలో వుండి హిందీ అధికారుల ప్రాభవంలో వుండటంలో చివరకు మధ్యప్రదేశ్‌లో కలిపివేశారు. ఈ గనుల్లో 500 కోట్ల టన్నాల కంటే ఎక్కువగానే ఇనుము లభిస్తుందని అంచనా వేశారు. ఫ్యాక్టరీకి కావలసిన మరొక ముడిపదార్థం బొగ్గు. ఇది దిగుమతి చేసుకోవచ్చు. ప్రపంచంలో అంతా కూడా ఇదే పద్ధతి అమలులో వుంది. నిజానికి 80 శాతం ఇనుమూ, 50 శాతం బొగ్గూ దిగుమతి చేసుకుంటూ జపాన్‌దేశం ఉక్కు పరిశ్రమను బ్రహ్మాండంగా అభివృద్ధి చేసుకుంది. విశాఖపట్టణంలో దిగుమతి చేసుకున్న బొగ్గు ఖరీదు టన్నుకు రూ. 72లు వుంది. సింగరేణి గనుల్లోని బొగ్గును 15 శాతం – 20 శాతం వరకు మాత్రమే దిగుమతి చేసుకున్న బొగ్గులో కలిపి ఉపయోగింపవచ్చు. బొగ్గుదిగుమతిచేసుకోవలసిన అవసరం వుంది. కనుకనే ఉక్కు ఫ్యాక్టరీకి కోస్తా ప్రాంతంలో స్థలం నిర్ణయించాలి. మనదేశంలో లభించే బొగ్గులో 30 శాతం బూడిద వుంటే విదేశాల నుండి దిగుమతి చేసుకొనే బొగ్గులో బూడిద శాతం 4 పర్సంటు నుండి 6 పర్సంటు వరకు మాత్రమే వుంది.

## సున్నపురాయి

మరొక ముఖ్యమైన ముడిపదార్థం సున్నపురాయి. కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట దగ్గరా, గుంటూరు జిల్లాలోని పిడుగురాళ్ల, బెల్లంకొండల దగ్గరా

సున్నపురాయి విశేషంగా లభిస్తుంది. ఫ్యాక్టరీ స్థలానికి ఈ రెండు ప్రదేశాలు 250 మైళ్ళ దూరం కంటే ఎక్కువలేవు. బెల్లంకొండ నుండి రైలు ద్వారానే కాక నాగార్జున కాల్వలద్వారా కృష్ణలోనికి తెచ్చి జగ్గయ్యపేట మీదుగా చేర్చడం ముందు సులువు. కొత్తగూడెం పరిసరాలలో మంచి మంచి సున్నపురాయి కోట్ల కొలది టన్నులు లభించే అవకాశం వుంది. వీటిని భద్రాచలం చేర్చి అక్కడి నుండి గోదావరి ద్వారా రాజమహేంద్రవరము చేర్చి అచ్చటి నుండి కాల్వలద్వారా కాకినాడ చేర్చి పడవల ద్వారా విశాఖ పట్టణం చేర్చుట చాలచౌక కూడా అవుతుంది. కాకినాడ పెద్దాపురంకు సరాసరి 10 మైళ్ళ రైలు వేయడం జరిగితే ఈసారి కాకినాడ - సామర్లకోట పెద్దాపురం రద్దీ తగ్గి సరాసరి రైలుద్వారా కూడా విశాఖపట్టణం చేర్చవచ్చు. బెల్లంకొండ గుంటూరు రైలు పెద్దదిచేస్తే రైలులో బందరు రేవుకు చేర్చి అక్కడినుండి విశాఖ పట్టణం చేర్చవచ్చు. జగ్గయ్యపేటలో 214 మిలియన్ టన్నుల సున్నపురాయి లభిస్తుంది. ఇది చాల మేలిరకం అయిన ఖనిజం. ఇవికాక అండమాన్, నికోబార్ దీవుల్లో విశేషంగా లభించే సున్నపురాయి ఓడలమీద విశాఖపట్టణమునకు చాల తక్కువ ఖర్చుతో చేరుతుంది.

విశాఖపట్టణం దగ్గర ఉక్కు ఫ్యాక్టరీ నిర్మించడంవల్లన ఇంతకుముందే పేర్కొన్నట్లు బొగ్గురవాణా ఖర్చు చాలా తగ్గుతుంది. ఇనుము బైలదిల్లా నుండి విశాఖ పట్టణమునకు రవాణా చేయవలసివుంది. ప్రస్తుతం వున్న డి. బి. కె. రైల్వేను జంట మార్గంగా చేసిన తర్వాత కూడా 'ఇందుకు 27కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. ఈ మార్గంమీద సంవత్సరానికి 70లక్షల టన్నులకంటె ఎక్కువ రవాణా చేయటం సాధ్యంకాదు. జపాన్ దేశానికి సంవత్సరానికి 80లక్షల టన్నుల ముడి ఇనుము ఎగుమతి చేయుటకు ఒప్పందం వుంది. 20 లక్షల టన్నుల ఇనుము విశాఖపట్టణం ఫ్యాక్టరీకి కేటాయిస్తే జపానుకు విశాఖపట్టణం రేవునుండి 50 లక్షల టన్నులు మాత్రమే ఎగుమతి చేయటానికి సాధ్యమవుతుంది. ఈ సందర్భంలో బైలదిలానుండి గోదావరి ఒడ్డున గల కూనవరం వరకూ ఒక రైలుమార్గం వేసి, అక్కడనుండి పడవలమీద కాకినాడ రేవుకు ఇనుము రవాణా చేసి కాకినాడ రేవునుండి ఎగుమతి చెయ్యాలని జాతీయ ఖనిజాభివృద్ధి సంస్థ 'నేషనల్ మినరల్ డెవలప్ మెంట్ కార్పొరేషన్' ప్రతిపాదించింది.

ఈ రైలు నిర్మాణం విషయం నేడు రైల్వేశాఖవారు సర్వే చేస్తున్నా మని త్వరలో పూర్తి కాగలదని 1965 మార్చి నెలలో లోక్ సభలో రైల్వే ఉపమంత్రి ప్రకటించారు. ఇది కొత్తగూడెం నుండి కూనవరంమీదుగా దంతవాడుకు వేయడమా, లేక భద్రాచలం మీదుగా వేయడమా అని రెండింటి పరిశీలన కూడా జరుగుతున్నదని కూడ తెలుస్తున్నది.

## నౌకాశ్రయం

నౌకాశ్రయాల సౌకర్యాలకు సంబంధించినంత వరకూ విశాఖపట్టణం వద్ద డాల్ఫిన్స్‌నోస్‌కు దక్షిణముగావున్న బాల చెరువును అనుబంధ నౌకాశ్రయంగా అభివృద్ధి చేయవచ్చు. ఇట్లాచేస్తే రవాణా ఖర్చులుకూడా చాలాభాగం తగ్గుతాయి. ప్రత్యామ్నాయ నౌకాశ్రయం ఏర్పాటు చేయడానికి దాదాపు 10కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. ఇంత బృహత్ప్రణాళికలో అది అంత మొత్తం కాజాలదు.

కాబట్టి ముడిపదార్థాలు లభించే విషయంలోనూ, స్థలంలభించే విషయంలోనూ నీరూ, విద్యుచ్ఛక్తి లభించే విషయాల్లోనూ, రవాణా సౌకర్యాలనూ ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణానికి విశాఖపట్టణం చాల అనువైన ప్రదేశం. ఇది నిస్సందేహం.

పటాస్కర్ సలహాను శిరసావహించడంలో తమ హక్కులు కోల్పోయి ఆంధ్రులు సేలంను మద్రాసు రాష్ట్రానికి ఒదులుకున్నారు. కేంద్ర ప్రభుత్వం యొక్క చిన్న చూపు ఫలితంగా న్యాయంగా ఆంధ్రులకు రావలసిన దక్షిణ బస్తరు మధ్యప్రదేశ్‌లో చేర్చబడింది. మనం నిర్లక్ష్యం చేస్తే ఉక్కుఫ్యాక్టరీ కూడా మనకు రాకుండా పోవచ్చు.

కేంద్రంలో పూర్వం ఉక్కుశాఖామంత్రిగా ఉన్న శ్రీ సి. సుబ్రహ్మణ్యం విశాఖపట్టణంలో ఉక్కు ఫ్యాక్టరీని స్థాపించటం తథ్యమని అప్పట్లోచెప్పారు. ఈ ఫ్యాక్టరీ 2 లక్షల మందికి ఉద్యోగావకాశాలు కల్పిస్తుంది. ఆంధ్రులంతా ఒక్కటిగా నిల్చి విశాఖపట్టణం ఉక్కు ఫ్యాక్టరీని సాధించటమో, లేదా దాన్ని శాశ్వతంగా ఒదులుకోవటమో ఇప్పుడే తేల్చుకోవాలి. మనకు ఉక్కు ఫ్యాక్టరీ ఏర్పడితే ఇప్పుడే, లేదా అసలుకి ఎప్పటికీ లేనట్లే.

**"చావలేదు, చావలేదు**
**ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర"**
**కదలండి, సాగండి, సాధించండి — జై ఆంధ్ర.**

ప్రతికథ ఎక్కడో మొదలెట్టాలి. ఈ కథ శంకరయ్య అరుపుతో మొదలెడతాను. ఆ అరుపు శంకరయ్యచేసిన సింహనాదం, వీరహుంకారం.

"చతుర్థశత్రుడు పాపి. అని ఏ వెధవయ్యా అంట ?"

ఈ జ్యోతిష యుద్ధంలో శంకరయ్య ప్రతిద్వంద్వి శేషయ్యనోటితో సాగించవలసిన ఈ పోరులో నత్తివాళ్ళు పాల్గొనడం శుద్ధ పొరపాటు. శేషయ్యకి నత్తి. శంకరయ్యకి సమాధానంగా —

"జ్యోతిష మ-మ-మ-మ..." అని ఆగిపోయాడు.

"ఏవిఁటి మె-మ్మె-మ్మె మ్మె ?" అనేసి ఇంక శేషయ్యని చిత్తు చెయ్యడానికి శంకరయ్య సిద్ధంగా ఉన్న సందర్భంలో, అనుకోని అంతరాయ మొకటొచ్చి తాత్కాలికంగా శంకరయ్య విజయాన్ని వాయిదా వేసింది. ఆ అంతరాయం శంకరయ్య పెద్ద కూతురు కల్యాణి.

"నీ కాఫీ చల్లారిపోతోంది నాన్నా ." అంది గుమ్మంలోకొచ్చి. చతుర్థశత్రుడు; విజయమో వీరస్వర్గమో తేల్చుకోవలసినంత గడ్డుప్రశ్న అని, పాపం ఆ అమాయకురాలికేం తెలుసు ?

"పోతే పోయింది. ముందీ సంగతి తేలాలి." అన్నాడు శంకరయ్య, దిగజారిపోతూన్న ఉత్సాహాన్ని తిరిగి తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ. అయితే అతని సమరోత్సాహం చల్లబడింది — 'కాఫీ' అన్నముక్క చెవినిపడగానే.

శంకరయ్యకి జ్యోతిషయుద్ధం అంటే ఎంత చొరవో, కాఫీ అంటే అంత ఇష్టమున్నూ. మరో అవకాశం దొరికితే శేషయ్యని ఎల్లా చిత్తుచెయ్యాలో వివరంగా ఊహించుకుంటూ, శంకరయ్య కాఫీ తాగడానికి లోపలికి వెళ్ళాడు. శేషయ్య ప్రస్తుతం ఓటమి తప్పినందుకు కాస్త తృప్తిపడి వెళ్ళిపోయాడు.

మనంకూడా శంకరయ్యతో లోపలికి వెడదాం. వొద్దు, కొంచెంసేపు శంకరయ్య వొదలివెళ్ళిన యుద్ధక్షేత్రాన్ని కాస్త పరామర్శచేద్దాం.

ప్రతి కథకీ ఒక మొదలున్నట్టుగానే, ప్రతి ఇంటికీ ఒక ముంగిలి ఉంటుంది. ఆ ముంగిలిని అలక్ష్యం చేశామా, ఇంక ఆఇంటి ఆనుపానులు మనకి తెలియడం కష్టం. ఈ ముంగిలి ఈ ఇంటి చరిత్రను, ఆదినించి అంతందాకా వేనోళ్ళ చాటుతుంది. అంటే ఆముంగిలికి అన్ని నోళ్ళున్నా యనికాదు. ఆ ముంగిట్లో కాలం వొదిలిపెట్టిన చిహ్నాలెన్నో ఉన్నాయి. ఇంటిచుట్టూ ఆదికాలంలో ఒక ప్రహరీగోడ — మట్టితోకట్టినది — ఉండేదని, దానితాలూకు శిథిలాలు, వర్షాలకు కరిగిపోగా మిగిలినవి — రుజువుచేస్తాయి. ఇప్పుడా శిథిలాలు, వీధికీ ఇంటి ఆవరణకీ మధ్య పెద్ద అవరోధంగా లేకపోయినా, మనుషులుమాత్రం, ఒకానొకప్పుడు గుమ్మం ఉండే చోటిగుండానే రాకపోకలు సాగిస్తుంటారు. చరిత్ర మొదల అంత గౌరవ తాత్పర్యాలు లేని ఆవులూ మేకలూ మాత్రం తమ ఇష్టంవచ్చిన మార్గాన్ని పోతుంటాయి. కుడివైపు పెంకుడుకప్పు, వయస్సు బరువుకి వొంగిపోయింది. జారిపోవడానికి కూడా ఓపికలేక కొన్నిపెంకులు అక్కడక్కడ మిగిలాయి, ఇంటి కప్పుమీద. రెండు పెద్ద అరుగులు ఇంటిపొడుగునా ఉన్నాయి, చుట్టూ ఇటికలతో గోడకట్టి మధ్య మట్టిపూడ్చిన అరుగులు, అరుగులమధ్య సింహద్వారందాకా మెట్లున్నాయి, ఇటికలతో కట్టినవి. ఇటికలకు పూసిన సున్నపు గిలాబా ఎప్పుడో పోయింది. ఇప్పుడిటికలు బట్టబయలుగా ఉన్నాయి, తాకితే పొడైపోతూ. పాడుపడ్డ గుడిమెట్లులా గున్నాయి. యింటిమెట్లు పైకి చూస్తూ మీరు మెట్లెక్కారా, మీ మడమ బెణకడంఖాయం. కదిలిపోయిన ఇటికలూ, అవి జారిపోయిన చోట ఖాళీలూ అల్లా ఉంచండి. నిక్షేపంలా అవుపించే ఏ ఇటికన్నా మీకాలికింద మీతో చెప్పకుండా పొడిఅయిపోయే అపాయం ఎప్పుడూ ఉంది.

ఈపక్కా మూడూ, ఆపక్కా మూడూ రాతి దిమ్మలమీద నిలబెట్టిన కర్రస్తంభాలు ముందు చూరుబరువు మోస్తున్నాయి. రెండు అరుగులమీదా, చాపపర్చడానికిచదునైనచోటు అంగుళమైనా లేదు. ఆగోతుల్లా కనిపించేవి పాతాళంవరకూ పోయే రంధ్రాలుకూడా కావచ్చు. అంచేత ఆ ఇంటిసంగతి తెలిసిన వాళ్లు, గొప్పులమీదే అడుగులు వేస్తారు.

ఇప్పటికి కాస్త ఇంటిముంగిలితో మీకు పరిచయం ఏర్పడింది — గనక ఇంక లోపలికి ప్రవేశిద్దాం. జాగ్రత్త. లోపలి కెళ్ళేటప్పుడు తలబాగా వంచండి, కాళ్ళు బాగా ఎత్తి వెయ్యండి. లేకపోతే తలమీద బొప్పి, మోకాలిచిప్పకి మోపైన దెబ్బ తప్పవు. సింహద్వారబంధానికి మీదిగడప ఎత్తు, పైగడప కురచ. బహుశా మొట్టమొదట ఇల్లు కట్టించిన యజమాని మరుగుజ్జేమో. అయితే దేశాభిమానం కలవా డెవడూ వెనకటి కాలంలో మరుగుజ్జు లుండేవారని చచ్చినా ఒప్పుకోడు. వాళ్ళంతా ఆజానుబాహువులు ! అంచేత ఈ పొట్టిగుమ్మానికి మరోకారణం ఉండిఉండాలి. బహుశా ఆ ఆదిపురుషుడు దొంగల్ని దృష్టిలో పెట్టుకుని చేయించి ఉంటాడీ ద్వారబంధం. ఎంతచురుకైన దొంగన్నాసరే, ఇంట్లోంచి బయటికి పారిపోయేటప్పుడు, పైగడపనీ కిందిగడపనీ తప్పించుకోడం అసంభవం. అథవా ఆరెండూ తప్పించుకొని ఎల్లాగో బయటపడ్డా, మెట్లు ఎల్లాగా అతన్ని మోసగిస్తాయి. ఇంతెందుకు మీరొక్కసారి ఇంట్లోంచి బయటికి పారిపోడానికి ప్రయత్నించండి. పైగడప మీ నడినెత్తిని స్పృహతప్పేలా దెబ్బతీస్తుంది. కిందిగడప మోకాళ్ళకు అడ్డుపడి బోర్లా పడేస్తుంది. ఆ తరవాత మెట్లు మిమ్మల్ని చక్కగా జారుడుపట్టు పట్టేస్తాయి. దొంగ మాత్రం మీలాంటి మనిషికాడూ? అయితే— ఇల్లాంటి ఇంట్లో దొంగల కేంపనీ — అని మీరడగొచ్చు. నిజమే. ఏంపని ? అయినా దొంగలున్నారే, మహాచిత్రమయినవాళ్ళు. వాళ్ళు ఎందు కేపనిచేస్తారో చెప్పడంకష్టం.

అమ్మయ్య. ద్వారబంధం గండం గడిచి ఎల్లాగో లోపలపడ్డాం. పైన తలకి కట్టిన చిన్నబొప్పి, ఒరుసుకుపోయిన మోకాలు చిప్పా, అంత లెక్కలోవికాదు. ఇల్లాంటి అవాంతరాలు మహామహులకే తప్పలేదు.

బయటినించి వచ్చిన మనకి లోపల ఏముందో చటుకుని కనిపించడం కష్టం. కాస్తసేపు లోపలిచీకటికి కళ్ళు అలవాటు పడాలి. అదుగో కుడిపక్కని ఓపెద్ద దీర్ఘచతురస్రం. దానిమిద ఫలానిది అని చెప్పడానికి వీల్లేని పెద్ద ఆకారం ముందు మీకు కనిపిస్తున్నాయా? ఆ దీర్ఘచతురస్రం ఒక పెద్ద పందిరిమంచమని. ఈ పాటికి మీ రానవాలు పట్టిఉంటారు. దాని మీదున్న ఆకారం ఒక ఇల్లాలు. ఆమెపేరు శాంతమ్మ. పేరు చూసి మోసపోకండి. అది ఆమె పేరు మాత్రమే. ఆ పేరుకీ, ఆమె స్వభావానికీ ఏదన్నా పంబంధముందని మీ రనుకుంటే. ఆ పూచీ మీదే.

మనం ఇంటిముంగిలిని పరామర్శిస్తుండగా, కల్యాణి వంటింట్లో శంకరయ్యకి కాఫీ ఇచ్చి: సావిట్లోకి వచ్చింది.

"అమ్మా ! కాఫీ కొస్తావా ?" అంది.

శాంతమ్మ లేచికూర్చుంది. మనకికనబడ్డదల్లా ఒకపెద్ద ముద్దకదలడం మాత్రమే ఆముద్ద మొదటిస్థితి పడుకోడం అని నిర్ణయించుకుని, ఇప్పటిస్థితి కూచోడ మన్నానంతే.

"జబ్బుమనిషి నని ఎరగవుటే ? కాస్త కాఫీ ఇక్కడికి తెచ్చి త గ లే స్తే యేం ?" అంది శాంతమ్మ.

అసలు అందరూ వంటింట్లోనే కాఫీలు తాగాలని శాసనం జారీచేసింది శాంతమ్మే. ఈ శాసనం శంకరయ్యకోసం చెయ్యబడ్డది. శంకరయ్య జాతకాల విషయమై ఎవరితో యుద్ధాలు సాగించినా, ఆ యుద్ధాల్లో అతడు నెగ్గినా ఓడినా, శాంతమ్మకేమీ అభ్యంతరం లేదు. అయితే శంకరయ్య తన ప్రతికక్షుల్ని కాఫీ ఫలహారాల ఎర చూపి ఆకర్షించడం ప్రారంభించేసరికి శాంతమ్మ న పే మి రా అంది. అయితే శాసనం జారీచేసిన శాంతమ్మకి. దాన్ని ఉల్లంఘించే హక్కుందని కల్యాణికి తెలుసు. అంచేత మళ్ళీ మాట్లాడకుండా వెళ్ళిపోయింది కల్యాణి. అదీగాక ఆ ఇంట్లో ఏవాదోపవాదాలు జరిగినా అన్నింటిలోనూ అంతిమ విజయం శాంతమ్మది.

శాంతమ్మపుట్టింటివేపువంశవృక్షం మహదొడ్డది. ఆవిడ ముత్తాతగారి తాతగారు చింతలపిల్లి సంస్థానం దివాను. ఈ కథా కాలంనాటికి చింతపిల్లికి ఒక రాజాగారుగాని దివానుగారుగాని లేరు. అసలు చింతలపిల్లే ఉందో లేదో కూడా వివాదగ్రస్తమే. అయితే శాంతమ్మకు సంక్రమించిన పందిరిమంచాన్ని బట్టి చూస్తే, ఆవిడ ముత్తాతగారి తాతగారు మంచి ఐశ్వర్యమే అనుభవించి ఉండాలి.

ఆ వంశచిహ్నంగా శాంతమ్మకు సంక్రమించిన ఐశ్వర్యాలు రెండు. ఒకటి ఆ పందిరిమంచం – నల్ల విరుగుడుచేవ మంచమది. అది చేసిన వడ్రంగి ఒకఅజ్ఞాతశిల్పి. ఆ మంచంమీద ప్రతి అంగుళం లతలతో పూలతో పిట్టలతో నింపేశాడు. ఎప్పుడో ఆదికాలంలో ఆ మంచాని కో పందిరికూడా ఉండే దనడానికి కొన్ని గట్టి నిదర్శనా లున్నాయి – ఒకకోడుమీద పైకి పొడుచుకున్న తుప్పుపట్టిన మరమేకు, మరోకోడు మీద నల్లులు పట్టిన పెద్దచిల్లు, అద్దముండవల్సిన వేపు చట్రంమీద మొండిముక్కలాంటివి. ఆ మంచానికి నాలుగుకాళ్లూ నేల మీద ఆనే అదృష్టం, దాని యజమానురాలు ఎక్కినప్పుడే పడుతుంది. ఆవిడ బరువు లేకపోతే మూడుకాళ్ళే నేలమీద ఆనుతాయి. ఆ దోషం మంచానిదని శంకరయ్య. నేలదని శాంతమ్మ చాలాకాలంగా తర్కించుకొంటున్నారు. ఆ విషయమై వారిద్దరిమధ్యా ఇంతవరకూ అంగీకారం కుదరలేదు. అయితే ఆ మంచం తన యజమానురాలి బరువు ధైర్యంగానే మోస్తోంది. అప్పుడప్పుడు దాని మునిలికీళ్ళుమాత్రం పటపట శబ్దాలద్వారా తమ అసమ్మతిని తెలుపుతాయి.

రెండో ఐశ్వర్యం ఆవిడ నడుంనొప్పి ఆవిడకు గుర్తున్నంతవరకూ తన పుట్టింటి పూర్వీకు లందరికీ ఉంది ఆ నడుంనొప్పి. నడుంనొప్పి వంశపారంపర్యంగా వొచ్చే జబ్బుకాదని డాక్టర్లనొచ్చు. అలా అన్న వాళ్ళకి ఏమీ తెలియదన్నమాట. ఉత్సాహమో ఉద్రేకమో మితిమీరినప్పుడు ఆవిడ తన నడుంనొప్పిని మరిచిపోయి ఇటూ అటూ పచారు చేయడం కద్దు. కాని సామాన్యంగా ఆవిడ ఆ మంచం వొదిలిపెట్టదు.

అంచేత శాంతమ్మ మంచంమీదికే కాఫీ తెప్పించుకుంది. ఆవిడ వేడికాఫీ చప్పరించడం మొదలెట్టిన తరవాత, కల్యాణి దక్షిణంవేపునున్న గది తలుపొకటి తోసింది. ఆమె ననుసరిస్తే ఒక వింతదృశ్యం మీ కంట పడుతుంది. రెండుకాళ్ళు, మెలివేసుకుని ఊర్ధ్వముఖంగా నిలబడ్డాయి. వాటి కింద లంగోటీ బిగించిన పిరుదులూ, పొత్తికడుపూ; మరికొంచెం కింద వెంట్రుకలు అరణ్యంలా అల్లుకుపోయిన ఛాతీ. ఆ కింద ఒక ముఖం ఉండాలి, ఉంది. అయితే అది కనిపించక పోవడానికి కారణం దాన్ని దాస్తున్న ఒక పుస్తకం. దాన్ని – మీదృష్టినించి – రెండు చేతులు తలకిందుగా పట్టుకున్నాయి. మీరుగనక మెడకాస్త కష్టపడి బాగా వంచినట్టయితే – ఆ పుస్తకం అట్టమీద – 'యోగాసనములు' అన్నది చదవగలుగుతారు.

కల్యాణి గదితలపు మీద కాస్త తట్టగానే, పుస్తకం పక్కకి తప్పుకుంది. వెనకాల, గీసిన కందగడ్డలాంటి నున్నని మొహం బయట పడింది. ఆ మొహం ఇంటికి పెద్దకొడుకు కానున్నది. భోజనం నిద్రగాక అతడు చేసే మూడోపని ఆసనాలు వెయ్యడం. ఇప్పు డతను వేసిన ఆసనం పేరు శీర్షాసనం. 'యోగాసనములు' అన్న పుస్తకంలో ఆసనాలు వెయ్యడంవల్ల జ్ఞానం ఆయువు, ఆరోగ్యమే కాక, ఐశ్వర్యంకూడా సిద్ధింస్తు దని అతిస్పష్టంగా రాసి ఉంది.

అంచేత కామన్న మరో ఉద్యోగం ఏదీ చూసుకోలేదు.

"పీ పాలు." అంది కల్యాణి.

"ఒక్క అయిదు నిమిషాలు," అనేసి మళ్లీ పుస్తకం చాటుని ముఖం దాచేశాడు కామన్న. కల్యాణి తల్లి తాగిన కాఫీగ్లాసు తీసుకుని వంటింట్లోకి వెళ్ళి. తండ్రి తాగిన గ్లాసుకూడా తీసుకొని రెండూ శుభ్రంగా కడిగింది. ఆ ఇంట్లో అందరికీ ఆ రెండు గ్లాసుల్లోనే కాఫీ ఇవ్వాలి. ఉన్నవి రెండే గనుక. ఒకపెద్ద పళ్ళెంలో చిన్న పర్వతం లాగ తియ్యబూంది, మరోగుట్ట కారప్పూసా పేర్చింది. ఒకగ్లాసులో మంచినీళ్ళూ మరో గ్లాసులో కాఫీ పోసి పళ్ళెంలో పెట్టింది. ఈ కార్యక్రమం నడుస్తున్నంతసేపూ ఆమెకు తెలియకుండానే ఆమె ముఖంమీద చిరునవ్వు చిందులాడుతోంది. తక్కిన ఇంటి పనంతా ఆమెకు గాడిదచాకిరీ. ఇది ఆమెకు పనే కాదు, ఆటవిడుపు. ఆపళ్ళెం పట్టుకుని ఆమె హాల్లోకి వచ్చింది. దక్షిణం వేపునే మరోగది ఉంది. దానికి బరువైన ఒంటి తలుపు. ఆ తలుపు వీపుతో తోసి పళ్ళెంతో లోపల ప్రవేశించింది కల్యాణి. స్ప్రింగుతలుపులా అది మూసుకుపోయింది.

"మీ ఫలహారం ఇదుగో మహారాణీ!" అంది కల్యాణి, అతి అణకువగా వంగి.

ఆ 'మహారాణి' ఒక నాజూకైన అమ్మాయి. ఆమెకళ్లు, అమాయకపు కుతూహలంతో మెరుస్తున్నాయి. చెక్కిల్లో గులాబీలు పూశాయి. పలచని సుకుమారమైన చేతులు అతి వయ్యారంగా ఒక పుస్తకాన్ని పట్టుకున్నాయి. బోర్లా మంచంమీద పడుకున్న ఆ మూర్తి తక్కిన శరీరం మనకి కనబడ్డంలేదు. అయితే కనబడ్డ శరీరాన్ని బట్టిమిగతా భాగా లన్నీ అంత అందంగామా ఉంటాయని మనం ఊహించవచ్చు. కలువ మొగ్గలాంటి గడ్డం మంచం పట్టీమీద ఆన్చి, పుస్తకాన్ని కళ్ళకి తగినంత దూరంలో మంచం కిందికిపట్టుకుని చదువుతోందా అమ్మాయి.

పుస్తకం అట్టనుగురించి ఇక్క దొక్క మాట. దానిమీద అడ్డంగా ఊహాతీతమయిన ఒక ఆడబొమ్ముంది. దానిదెబ్బకి మీరు తట్టుకోలేకపోయారుగదూ. మీ రేకాదు, ఆరొమ్ముగీసినతరవాత ఆచిత్రకారుడే నీరస పడిపోయిఉంటాడు. అతడు అతి ఉత్సాహంగా ఆ రొమ్ము గియ్యడం ప్రారంభించాడు. ఎక్కడ వంపు కిందికి తిప్పాలో నిర్ణయించుకోలేక ఆ కాగితం కొస కొచ్చేదాకా గీసేసి ఆ తరవాత మళుపు తిప్పాడు. దాన్ని చూసుకుని అతడికే మతిపోయి ఉంటుంది. అంచేతే ఆ తరవాత అట్టమీద గీసిన, రాసిన, ఇతరవివరాలకు అతడు న్యాయం చేకూర్చలేకపోయాడు. ఆ రొమ్ము గల అమ్మాయి ముఖం, రొమ్మముందు ఆనటం లేదు. ఎడమపక్క, కిందగా గీసిన యువకుని చిన్నిబొమ్మనుకూడా ఆరొమ్ము మింగేసింది. ఇంకా అమ్మాయి కళ్ళలోంచి రాలుతున్న కన్నీటిచుక్కలూ, "అభాగిని" అన్న పుస్తకంపేరూ ఏదో అతికినట్టున్నాయి, అంత శరీరసౌభాగ్యంగల అమ్మాయి అభాగిని అని మనకి నమ్మకం కలగడం కష్టం.

"కొంచెం ఉండక్కా. వాళ్ళిద్దరూ నావలో ఉన్నారు. ఒకమూల తుఫాను చెలరేగుతోంది," అంది మహారాణి.

"ఎవళ్ళిద్దరూ?" అంది కల్యాణి. తియ్యబూంది గడ్డ ఒకటి ఆమె నోట్లో పెడుతూ.

"వాళ్ళేనే. మోహన్ లీలా. పాపం ఆ అమ్మాయి క్రిస్టియన్. అతడు బ్రాహ్మడు." అంది రాధ.

కల్యాణి, చెల్లెలు రాధని ఎంతైనా గారంచేస్తుంది. రాధ ఇంటిపను లేవీ చెయ్యడానికి వీల్లేదు. రెండుపనులకోసం ఆమె పుట్టింది. ఒకటి - కొట్టొచ్చే రంగురంగుల అట్ట లున్న నవలను చదవడం. రెండు - నాట్యంచెయ్యడం. నాట్యం ఆమెకు పుట్టుకతో వచ్చినవిద్య. అసలామె నాట్యం చేస్తూనే పుట్టిందేమోకూడా.

రాధ ఏంచేసినా నాట్యభంగిమల్లోనే చేస్తుంది. ఇప్పుడామె బోర్లాపడుకుని చదువుతున్నా నాట్యచేస్తూనే ఉంది. కనుబొమలు బాణాల్లా వంపుతిరిగున్నాయి. పెదవులు చదువుతున్న ఘట్టానికి అనుగుణంగా భావం వ్యక్తీకరిస్తున్నాయి. కళ్ళు మెరుస్తున్నాయి. వేళ్ళు పుస్తకాన్ని అందమయిన ముద్రలో పట్టాయి. కళ్లు కుడిపేజీ తుదిపంక్తి చదవగానే, వేళ్ళు మరొకభంగిమలో పేజీని వయ్యారంగా తిప్పాయి. ముఖం కొంచెం ఎడంపక్కకి వంగింది. ఆ కదలికతో భుజాలూ చేతులూ కెరటంలాగ లేచి వాలాయి. కళ్ళు కుడిపక్క కిందికొసనుంచి ఎడమప్రక్క పైకొసకి వయ్యారంగా తిరిగాయి. కనుబొమల ఇంద్రధనుస్సులు కొంచెం ఆకారం మారి మళ్ళీ సర్దుకున్నాయి. సంధించిన బాణాల్లాగ కథలోని ఉద్రేకానికి అనుగుణంగా మరింత వంగాయి.

ఆమె నాట్యప్రతిభను ఇంతగా ఎందుకు వర్ణించవలసి వచ్చిందంటే, అసలీ కథలోని మోదవిషాదఘట్టా లన్నింటికీ అదే మూల కారణం.

ఆమెతనకి తెలియకుండా నాట్యంచేస్తోంది. ఒకరోజుని. అప్పుడు పట్టూ ఆమెను చూశాడు.

[సశేషం]

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at YUVA PRESS, Public Garden Road, Hyderabad.

## ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గ సభ్యులు ప్రధానమంత్రికి పరిచయం చేయబడుతున్నారు.



... శ్రీ యన్. రామచంద్రారెడ్డి



... డా. యం. చెన్నారెడ్డి



... శ్రీ ఏ. పి. సుబ్బారెడ్డి



శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీ ఎ. బలరామరెడ్డి, శ్రీ ఎ. వెంకట్రామయ్య, శ్రీ యం. ఆర్. అప్పారావు, శ్రీమతి టి. సదాలక్ష్మి ప్రభృతులు ప్రధానమంత్రికి పరిచయం చేయబడుతున్నారు.



... శ్రీ. వి. వి. గురుమూర్తి



ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డి.



బ్రిగేయడర్ జి. యం. సయీద్ ప్రధానమంత్రికి పరిచయం చేయబడుతున్నారు.



వ్యవసాయ విశ్వవిద్యాలయం ప్రారంభోత్సవం సందర్భంలో ప్రసంగిస్తున్న వ్యవసాయశాఖమంత్రి శ్రీ జలగాం వెంగళరావు... 



ప్రధానమంత్రి రాజేంద్రనగర్‌లో వ్యవసాయ కళాశాలకు ప్రారంభోత్సవం చేస్తున్నారు.
"నాల్గవ ప్రణాళికలో వ్యవసాయానికి అధిక ప్రాముఖ్యం ఇవ్వబడుతుంది."



ముఖ్యమంత్రి నివాసగృహంలో మార్చి 20 న పబ్లిక్ వర్క్స్ శాఖ మంత్రి శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి శ్రీశైలం ప్రాజెక్టు



శ్రీమతి రామమ్మ బ్రహ్మానందరెడ్డి శ్రీమతి లలితాశాస్త్రికి



ఫెయిర్‌లాన్స్‌లో మార్చి 20 వ తేదీన జరిగిన డిన్నర్‌లో
శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, శ్రీ నిజలింగప్ప గార్లతో ప్రధాని.



అఖిలభారత గోసంవర్ధన సమ్మేళన కార్యకర్తలతో
ప్రధానమంత్రి.



ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ ఎ. బలరామిరెడ్డి
స్వాగతోపన్యాసం చేస్తున్నారు.



పశుగణాభివృద్ధికి మేలుజాతి పశువుల ఉత్పత్తి అవసరం
అని శ్రీ సుబ్రహ్మణ్యం అన్నారు.



గోసంవర్ధన సమ్మేళనంలో ప్రసంగిస్తున్న
శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి.



అఖిలభారత గోసంవర్ధన కేంద్రకమిటీ సాంకేతిక నిపుణులు
శ్రీ సర్దార్ దాతార్‌సింగ్ సమ్మేళనములో ప్రసంగిస్తున్నారు.



శ్రీ యు. ఎన్. ఢేబర్ అధ్యక్షోపన్యాసం కావిస్తున్నారు.



ప్రధానమంత్రి మార్చి 21 వ తేదీన గోసంవర్ధన సమ్మేళనానికి ప్రారంభోత్సవం చేశారు. గాంధీజీ ఆవును గురించి చెప్తూ "గోవు శోక గీతిక" అని అన్నారు.



రాష్ట్ర శాసనసభ్యులను ఉద్దేశిస్తూ జూబ్లీహాలులో ప్రధాని ప్రసంగించారు. స్పీకర్ ప్రధానమంత్రికి స్వాగత వచనాలు పలుకుతున్నారు.



తెలుగుభాషాసమితి ప్రచురించిన ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం మూడు సంపుటాలను ఆవిష్కరిస్తున్న ప్రధానమంత్రి.



జంటనగరాల మహిళాసంస్థలు రవీంద్రభారతిలో తనకు చేసిన సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ ప్రధానమంత్రి ప్రసంగిస్తున్నారు.



నిజాం కళాశాల మైదానంలో మార్చి 21 వతేదీన బహిరంగ సభలో ప్రధానమంత్రి ఉపన్యసిస్తున్నారు.



బహిరంగసభకు హాజరయిన ప్రజాసందోహం.



హిరంగసభలో ప్రధానమంత్రికి హైదరాబాదు కార్పొరేషను మేయరు శ్రీ శ్యామరావు వెండి చార్ మినార్ నమూనాను బహూకరిస్తున్నారు.



# తొసవెర

పణతుల రామచంద్రయ్య

హోటల్లో టీనుకు ఆర్డరిచ్చి దిక్కులు చూస్తూ కూర్చున్నాడు వెంకటే శ్వర్లు. ఆ సర్వరుగాడింకా తెసుకిరాలేదు. వెంకటేశ్వర్లు గట్టిగా విసుక్కున్నాడు.

తను ఎంత తొందరగా తెమ్మని చెబితే అంత ఆలస్యం చేస్తాడు సర్వరు. తనకేమో తొందర. అసలు తనకు తొందర లేని దెప్పుడు? తన బ్రతుకులో తొందరలేని నిముషమంటూ లేదు...

వెంకటేశ్వర్లు లోపలికి చూశాడు, సర్వరింకా రావటంలేదు...తనకు తొందర...

ఈ తొందరే తన జీవితాన్ని నిలకడలేని

పీటవాగుగా తయారుచేసింది. ఒక చోట నిల్చి ఒక కాలు ఊనేలోగా రెండోకాలు తేలిపోయేది. అక్కడ స్థిరంగా నిలిచి రెండో కాలుకూడా ఊనుదామన్న బుద్ధి తనకు ఏనాడూ లేకపోయింది. ప్రతివిషయంలోనూ తనబుద్ధి వంకరలు తిరిగింది.

ఆ బుద్ధి ఎటు తిప్పితే అటు తిరిగాడు. ఎలా ఆడిస్తే అలా ఆడాడు. మంచీ, చెడూ, మనవారూ, తనవారూ, అనే భేదం లేకపోయింది. ఎవరిదగ్గరా కాస్తంత నమ్మకం నిలుపుకోలేకపొయ్యాడు. నేటి దాకా అదే తీరు... సంవత్సరంనాడు రాఘవయ్యపట్ల అంత ద్రోహం!!

రాఘవయ్య జ్ఞప్తికివచ్చేసరికి వెంకటేశ్వర్లు చలించిపొయ్యాడు. గుండెల్లో ఎవరో గునపంతో గుచ్చినట్టయింది. తనను నమ్మి, అంత బాధ్యతను తనమీద పెట్టిన రాఘవయ్యకు క్షమించరానిద్రోహం చేశాడు తను. అంతా బయటపడినాక కూడా ఎదుటపడి క్షమించమని అడగలేక పిరికివెధవలా తప్పుకు వచ్చేశాడు...తనెంతనీచుడు!

సర్వరు ప్లేటులో గారెలు తీసుకొచ్చి ముందు పెట్టిపొయ్యాడు. ప్లేటు చప్పుడుకు తెలివొచ్చింది వెంకటేశ్వర్లుకు. పరధ్యానంగా గారె తినసాగాడు. గారె తుంచి పచ్చట్లో నంజుతూ వీధిలోకి చూశాడు.

ఆశ్చర్యం..!

రాఘవయ్య హోటల్లోకి వస్తున్నాడు!

వెంకటేశ్వర్లు తనకళ్ళను తనే నమ్మలేకపోయాడు. గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. మొహం చాటుచేసుకున్నాడు. అదాటున రాఘవయ్య తనని చూస్తాడేమోనని హడలిపొయ్యాడు.

కాని రాఘవయ్య వెంకటేశ్వర్లును చూడలేదు. లోపలికి వచ్చి, అల్లంతదూరాన వున్న బల్లదగ్గర వెంకటేశ్వర్లువేపు వీపుపెట్టి కూచున్నాడు. అప్పటికి వెంకటేశ్వర్లు కాస్త స్థిమితపడ్డాడు, 'అమ్మయ్య!' అనుకున్నాడు.

గారె తినటం పూర్తిచేసి కాఫీ తెమ్మన్నాడు. త్వరగా కాఫీతాగేసి ఇక్కణ్ణుంచి బయటపడాలి తను. లేకపోతే రాఘవయ్య ముందు నగుబాటు తప్పదు. రాఘవయ్యకు తనమీద కోపం తగ్గివుంటుందా? ఊహుఁ. తగ్గివుండదు. తగ్గివుండేవిధంగా ప్రవర్తించ లేదు తను.

నాలుగేళ్ళనాడు, వీధిలో ఎందుకూ కొరగాకుండా తిరుగుతున్న తనని చేరదీశాడు రాఘవయ్య. తనవాళ్ళలో ఒకడుగా చూశాడు. తనను నమ్మి అంతపెద్ద మందుల షాపు తనకు వప్పజెప్పాడు. డబ్బు లావాదేవీలు అన్నీ తననే చూడమన్నాడు. ఈ రోజుల్లో అలా చెప్పేవాళ్ళెవరు, ఒక్క రాఘవయ్య తప్ప!

అలాంటి రాఘవయ్యకు, తనని నమ్మినందుకు, తను యిచ్చిన ప్రతిఫలమేమిటి?

తను రాఘవయ్యను మోసం చేశాడు. చాలా నేర్పుగా మోసం చేశాడు. ఖాతా కంపెనీలకు పంపవలసిన నోట్లకట్టలన్నీ బేబులో కుక్కుకుని రాఘవయ్యకు దొరకకుండా పలాయనం చిత్తగించాడు. తనలో ఏ పశువు పనిచేసి అలా చేయించిందో... తన బ్రతుకు కాలిపోను!

ఆ తర్వాత చాలా రోజులు తను మునుగులో వుండిపొయ్యాడు, బంధిఖానాకు భయపడి. కాని రాఘవయ్య తనమీద పోలీసు రిపోర్టుకూడా యిచ్చినట్టు లేదు. ఎందువల్లనో...

నిష్కృతిలేని పాపం చేశాడు తను. నూరు జన్మలెత్తి పశ్చాత్తాప పడినా తరగని పాపం! తనని ముక్కలు ముక్కలు చేసి నెత్తురు పిండి దాన్ని రాఘవయ్య యింటి ముందు కళ్ళేపు చల్లినా నమసిపోని పాపం!

భయం, పశ్చాత్తాపం వెంకటేశ్వర్లు మనసులో పర్జన్యఘోష పెడుతున్నాయి. లోపలికి చూశాడు. చెప్పి పావుగంట కావస్తున్నా సర్వరుగాడింకా కాఫీ పట్టుకురాలేదు ఛీ... వీణ్ణి నరికేస్తే పాపం వుందీ? తన్ను రాఘవయ్య చూసి, తన అంతు కనుక్కునేదాకా వీడు కాఫీ తేడు...

రాఘవయ్య ఆఖరికొడుకు సీనుకు తనంటే ఎంత మాలిమి! తన్ను వదిలేవాడు కాదు. తను వెంటలేనిదే వాడికొక్క క్షణం తోచేదికాదు. తనని 'అన్నయ్యా' అని పిలిచేవాడు. ఆ పిలుపు తలుచుకుంటే గుండె కరిగిపోతుంది. ఒక సీనుయేనా? అయింట్లో అందరూ తనని ఎలా చూశారు? వాళ్ళందరి నమ్మకాన్నీ నట్టేట ముంచి ఇక వాళ్ళు రెండోసారి మానవులను నమ్మే ఆస్కారం లేకుండా చేశాడు తను.

'అబ్బా!' అని మనసులోనే మూలిగాడు వెంకటేశ్వర్లు. సర్వరు కాఫీ తెచ్చిపెట్టాడు. వెంకటేశ్వర్లు సర్వరుమీద చాలా కోపంగా వున్నాడు. తిట్టేవాడే కాని, రాఘవయ్య విని ఇటు తిరిగి చూస్తాడేమో నన్న భయంతో ఆపని చెయ్యలేదు. గుడ్లురిమి చూశాడు సర్వరువేపు. వాడు ఇదేం లక్ష్యం చెయ్యకుండా, 'ఇది నాకో లెక్కా, రోజూ ఇలాంటి అనుభవాలెన్నో మాకు!' అన్నట్టు చూసి వెళ్ళిపోయాడు, బిల్లు బల్లమీద వుంచి.

వెంకటేశ్వర్లు ఒక్కక్షణంలో కాఫీ తాగటం పూర్తిచేశాడు. రాఘవయ్య వేపు చూశాడు. రాఘవయ్య అటుతిరిగి కూచుని కాఫీ తాగుతున్నాడు. పైన తిరిగే ఫాను గాలికి ఆయన నెరిసినక్రాపు మెల్లగా కదులుతోంది.

బిల్లు పుచ్చుకుని ఒక్క అంగలో కౌంటరు బల్లదగ్గర కొచ్చాడు వెంకటేశ్వర్లు, రూపాయినోటు తీసియిచ్చి 'త్వరగా చిల్లరివ్వండి' అన్నాడు. ప్రొప్రయిటరు నెమ్మదిగా చిల్లర లెక్కపెట్టసాగాడు. అంతలో రాఘవయ్య అక్కడికి వచ్చాడు. వెంకటేశ్వర్లు అరికాలికింది నేల కంపించిపోతోంది.

కాని రాఘవయ్య వెంకటేశ్వర్లును చూడలేదు. ఆయన త్వరగా బిల్లు చెల్లించి వెళ్ళిపొయ్యాడు. ప్రొప్రయిటరు వెంకటేశ్వర్లుకు చిల్లర లెక్కచూచి యిచ్చేశాడు.

వెంకటేశ్వర్లు బయటకువచ్చి నిలబడ్డాడు. అల్లంతదూరంలో నడిచిపోతున్నాడు రాఘవయ్య. వెంకటేశ్వర్లు మనస్సులో పెనుతుపాను రేగింది. తను వట్టి పిరికి

పంద! ఎవరి పట్ల తను ఘోరాపచారం చేశాడో. ఆ శాంతమూర్తి కనిపిస్తే ఎదుట పడి క్షమించమని అడగలేక ఖైదున్నలా. దొంగలా దాక్కుంటున్నాడు. ఎవ్వరూ చూడకుండా పాడుపనులు చేసేటప్పుడయితే ఎక్కడలేని ధైర్యమూ వస్తుంది తనకు. ఎవ్వరూ చూడలేకపోయినా. కర్మసాక్షి కళ్ళు కప్పగలడా తను?

రాఘవయ్య దూరంగా కదిలిపోతున్నాడు. వెంకటేశ్వర్లు నిలవలేకపోయ్యాడు. అతడి మనస్సూ, హృదయమూ స్వాధీనం తప్పిపోతున్నాయి. ఏమయినా సరే. వెళ్ళి రాఘవయ్య ఎదుటపడాలి. ఆయన పాదాలు పట్టుకోవాలి. అప్పుడే తన పాపానికి నిష్కృతి.

గబగబా నడవసాగాడు. వెళ్ళి రాఘవయ్యను సమీపించాడు. ఎదుటపడదామా అనుకుంటుంటే భయం అడ్డొచ్చింది. దాంతో మళ్ళీ సందిగ్ధం.

నిస్పృహాయుడై రాఘవయ్య వెనుక యంత్రంలా నడవసాగాడు. రాఘవయ్య వెనక్కి తిరిగి చూడలేదు. చీకటిపడింది. అమావాస్య చీకటి. ముందు రాఘవయ్య. వెనుక వెంకటేశ్వర్లూ నడుస్తున్నారు.

రాఘవయ్య అలా వెళ్ళి పార్కులో కూచున్నాడు. ఆయన వెనుక కొద్దిదూరంలో ఓ పొదచాటున కూచున్నాడు వెంకటేశ్వర్లు.

చల్లగా గాలి వీస్తున్నది. ఆ గాలిలో అదృశ్య రూపంలో వున్న నీటి తుంపురులు ఎందరి మలిన హృదయాలనో క్షాళితం చేసివేస్తున్నాయి. ఆ గాలిలో కరిగి వినవస్తోంది పార్కు రేడియోలో త్యాగరాజ కీర్తన.

'స్వామీ, రామయ్య తండ్రీ! ఎన్నో దుష్కృత్యాలు చేశాను. ఇప్పుడు నీ పాదాల కడ చేరాను. నన్ను బ్రోచే భారం నీదేనయ్యా...' అని కీర్తిస్తున్నాడు త్యాగరాజు.

ఆ కీర్తన బల్లెంలా గుచ్చుకుంటోంది. వెంకటేశ్వర్లు హృదయానికి.

ఏ పాపమూ చేయని. ఎంతో మంచివాడైన త్యాగరాజే తను చాలా దుష్కృత్యాలు చేశానని రాముడితో విన్నవించుకుంటున్నాడు... తను? తను చెడ్డవాడినన్న మాటే ఒక్కరోజుకూడా తన నోట్లోంచి రాలేదు. తను చేసిన దుష్కృత్యాల్లో నూరోవంతు త్యాగరాజు చేసివుంటే. ఈ పాడు జన్మ దేనికని వెంటనే ఆత్మహత్య చేసుకునేవాడు. తనూ — ఇంకా చావక బతికున్నాడు. ఇంకా బతకాలనుకుంటున్నాడు. ఛీ!

రేడియోలో కీర్తన వింటూ సిమెంటు బల్లమీద ఒత్తిగిల్లాడు రాఘవయ్య; అలా పడుకుని, హాయిగా గాలి వీస్తూంటే, మెల్లిగా రేడియోలోంచి వచ్చే కీర్తనకు శ్రుతి కలిపి కూనిరాగం మొదలెట్టాడు. ఆ కూనిరాగం వెంకటేశ్వర్లు చెవుల్లో దూరి, గుండెల్లో గుచ్చుకుని ఊరంత బాధ కలిగించింది. సుదీర్ఘకాలం అజ్ఞాతవాసంలో వుండి హఠాత్తుగా అగుపించిన ఆత్మీయుని పలకరింపులా వినవచ్చింది.

అబ్బ! మళ్ళీ ఇన్నాళ్ళకు తను రాఘవయ్య కంఠం వినగలుగుతున్నాడు! ఇక యీ జన్మకు ఆ కంఠం వినేభాగ్యం వుంటుందా అనిపించింది. ఎంత ఆర్ద్రమయిన కంఠం అది! ఒకప్పుడు తనపై పుత్రప్రేమ వర్షిస్తూ 'వెంకటేశ్వర్లూ!' అని పిలిచిన కంఠం! మళ్ళీ యిప్పుడు వినిపిస్తోంది కాని ఇక ఆ కంఠం అప్పటిలాగా అంతటి ప్రేమతో తనని 'వెంకటేశ్వర్లూ!' అని పిలవదు.

వెంకటేశ్వర్లు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తన జీవితానికి ఎంతటి పతనం! ఈ పతనంలోంచి తనని తిరిగి మనుషుల స్థాయికి చేరుకోగలవాళ్ళు లేరా? ఇప్పుడైనా తను రాఘవయ్య పాదాలు పట్టుకుని క్షమాభిక్ష కోరుకుంటే మంచిది. కాని ఆపని చెయ్యబోతే సిగ్గూ. భయం ఆవహిస్తున్నాయి. చెయ్యకుంటే పశ్చాత్తాపం దహించివేస్తోంది.

చీకట్లు కమ్ముకున్నయ్.

అంతలో రాఘవయ్య స్నేహితు డొకాయన అక్కడికి వచ్చాడు. ఆ స్నేహితుడూ, రాఘవయ్యా చాలా సేపు ఏవేవో మాట్లాడుకున్నారు. పొదచాటున కూచుని వున్న వెంకటేశ్వర్లు వాళ్ళ సంభాషణ మౌనంగా వింటున్నాడు. వాళ్ళ మాటల్లో వెంకటేశ్వర్లు ప్రసక్తి వచ్చింది.

'మీ యింట్లోంచి పరారీ అయ్యాడన్నారే. వెంకటేశ్వర్లనే కుర్రాడు. మళ్ళీ కనిపించాడా?' అని అడిగాడా స్నేహితుడు.

'కనిపించలేదయ్యా! అసలు ఎక్కడ ఉన్నాడో మనకు ఆచూకీ తెలుస్తేనా? వాడికి మెదడులో ఏదోపురుగు తొలుస్తూ వుంటుంది. లేకపోతే. యీ సంవత్సరం నుంచీ ఒక్కసారైనా యింటికివచ్చి మమ్మల్ని చూడాలనుకోకూడదమా?... ఇదుగో బాబూ, మా ఆఖరమ్మాయి సీనుకూ వెంకటేశ్వర్లుకూ ఎంత స్నేహమనుకున్నావు? అదంతా మర్చిపోయ్యాడేమో వెంకటేశ్వర్లు! వెంకటేశ్వర్లు వెళ్ళిపోయిన కొత్తల్లో వాణ్ణి కలవరించి కలవరించి సీను ఎంత చిక్కిపోయ్యాడని... ఏం చెయ్యను? వెంకటేశ్వర్లు పత్తాలేడయ్యె...వాడు మమ్మల్నందర్నీ యిలా ఒక్కసారిగా మర్చిపోవటం ఏమన్నా న్యాయంగా వుందా, నువ్వే చెప్పు?' అన్నాడు రాఘవయ్య.

వెంకటేశ్వర్లు మనస్సంతా దహించుకుపోయి. ఆవిరై, తిరిగి శీతలజలమై ప్రవహించింది. న్యాయం; న్యాయానికీ తనకూ ఎక్కడ సాన్నిహిత్యం! ఎన్నాళ్ళప్పుడో తను న్యాయాన్ని దూరంగా బహిష్కరించేశాడు. తను చేసే పనులకు అడ్డుపడుతుందేమోనని తన దరిదాపుల్లో లేకుండా చేశాడు. రాఘవయ్యలాంటి నిర్మలు లిది తెలుసుకోలేరు.

'అవునండీ, అతడిలో ఏమాత్రం మంచితనం వున్నా అలా వెళ్ళేవాడుకాడు.' అన్నాడా స్నేహితుడు.

'అలా అనకు బాబూ. వెంకటేశ్వర్లు మంచివాడు కాదంటే నే నొప్పుకోను. కాకుంటే కాస్త దుడుకుతనం వుంది. ఆ దుడుకుతనమే వాణ్ణి యిలా రొష్టుపెడుతోంది. లేకపోతే...తనకు డబ్బు కావలిసొచ్చింది. నన్నడిగితే నే నివ్వనూ? ఎంత కావాలంటే ఇవ్వను? వాడికన్నా డబ్బు

ఎక్కువా నాకు? ఇంటిబిడ్డగావున్న వాడికన్నా డబ్బు ప్రధానమయిందా చెప్పు? కాని వాడికి ఇదంతా ఆలోచించేపాటి ఓపికే లేక పోయింది. చెప్పకుండా డబ్బు తీసుకున్నాడు; వెళ్ళిపొయ్యాడు. ఇంతవరకూ జాడలేదు. వాణ్ణి ఏమనాలి ?'

రాఘవయ్య అనే ఒక్కొక్కమాటా వెంకటేశ్వర్లు గుండెల్లో బల్లెమై నాటుతున్నది. గదాఘాతమై వ్రయ్యలిస్తున్నది. అయ్యో, తన పాపానికి నిష్కృతిలేదా ? భూమాత ఒక్కసారి పగిలిపోయి తన్ను గర్భంలో చేర్చుకుంటే మంచిది. తనీ పాపాన్నంతా ఇక ఎక్కువకాలం గుండెల్లో అదుముకోలేడు.

కాసేపు నిశ్శబ్దం కత్తిదూసి నిల్చింది. నాలుగు నిముషాలు గడిచాయి. వెంకటేశ్వర్లు రాఘవయ్యవేపు చూశాడు. ఆయన మొహంమీద దృశ్యాదృశ్యంగా ఏదో విషాద రేఖ ఆవరించివుంది.

రాఘవయ్య లేచివెళ్ళాడు.

వెంకటేశ్వర్లు మోకాళ్ళమధ్య ముఖం పెట్టుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

రాఘవయ్యనుక్షమాపణకోరేఅవకాశాన్ని జారవిడుచుకున్నాడు తను. మేరుపర్వతం లాంటి రాఘవయ్యముందు భీరువై దాక్కున్నాడు. నిజాన్ని అబద్ధంలో పెట్టి మూశాడు. ఇది తనకు సహజమా? పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోగాని పోదా?

రాఘవయ్య అల్లంత దూరాన పేవ్‌మెంటు మీద నడచి వెళుతున్నాడు.

'బాబుగారూ ...' అంటూ లేచి పరుగెత్తాడు వెంకటేశ్వర్లు, రాఘవయ్యవెంట... టర్నింగులో కార్లకూ లారీలకూ అడ్డంగా పరుగెత్తాడు. అంతే...

ఆఫీసరుగారి కారు చక్రాలు ఎర్రబడ్డాయి. వెంకటేశ్వర్లు శరీరం రక్తపు మడుగులో తేలింది.

'పాపం!' అన్నారు చుట్టూ పోగైన జనం.

'అమ్మో! ఎంతనెత్తురు!' అంటున్నారు కొందరు.

ఆ నెత్తురులో ఎంత పశ్చాత్తాపాగ్ని ప్రభవించిందో, ఎన్ని పాపాలు ప్రక్షాళిత మైనవో ఎవరికి తెలుసు ?

(ఆలిండియా రేడియో సౌజన్యంతో.)

# తులసికోట

"శర్వరి"

క. గ్రామావధులను సస్య
శ్యామలమౌ చీరదాల్చి సస్మితముఖియై
భూమాత దినాధిపునకు
ప్రేమముతో జెప్పుచుండె వీడ్కోల్ తెలమిన్.

క. తేకువ, నైపుణ్యముతో
సాకల్యముగా నలమెను సంధ్యాసతి నీ
లాకాశంపు విశాల
ప్రాకారపు గోడపయిని బంగరుపూతల్.

క. పరులను పీడింపక యే
దొరకిన తృణమో పణమ్మొ తోషముతో నో
గిరముగ గైకొని గూళ్ళకు
మరలెను ఖగవితతి గగనమార్గమునందున్.

క. శ్రమమయ దేహజనితములు
నమూల్యములునైన ముత్తియముల నివాళిన్
తమ మాత గొలిచి, కర్షక
సముదాయము మరలె స్వీయ సదనమ్ములకున్.

క. ఎద్దుల గిట్టల బుట్టిన
సద్దులతో దుమ్ము లేచి సత్వరగతితో
ముద్దుల బిడ్డల జడకజని
'యద్దిర చుట్టాలు వచ్చి' రని యెఱిగించెన్.

క. 'అదుగో నాన్న' యటంచును
'నదుగో యన్నయ్య' యని గృహాంగణమందున్
పడిలేచుచు పరువెత్తుచు
నడయాడిరి బాలు లెసగు నానందముతోన్.

క. తారుణ్యము, దార్ఢ్యము నా
కారములో నలసటయును గనుపింప పతుల్
దూరాన రాగ గాంచిరి
కోరికలను దాచి క్రొత్తకోడండ్రంతన్.

క. నింగిని బొడిచిన చుక్కల
సాంగత్యము గోరి స్నేహ సంసిక్తమ్మౌ
యాంగణములలో వెలిగెను
మంగళమయ దీపరాజి మౌనుల వోలెన్,

క. చరణముల బసుపు కుంకుమ
నరములలో నవల జీవన మొసగు రసమ్మున్
గరముల బల్లవ కాంతులు
సురుచిరమౌ తులసిచెట్టు చూపట్టు నదే.

క. పచ్చలు తాపిన మెత్తని
పచ్చడమును గప్పుకొను పడతివగిది క్రొం
బచ్చని యాకులను తులసి
యచ్చపు సౌభాగ్య లక్ష్మి యయి రాజిల్లెన్.

క. ఆ తులసికోట ముందట
నాతతముగ దీపరాజి నర్పించి కనుల్
మూతలుపడ ధ్యానించెడి
నాతి యొకతె దూరమందు నగుపించు నదే.

క. తరశేఖరు యెలజవ్వని
తరుణీమణి యనుచు నామె దలపకుడు, వయః
పరిపాకమందు నడుగిడు
పరిపూర్ణ తపస్విని యని భావింపనగున్.

క. మిసమిసలాడెడి వయసున
శ్వశురగృహమ్మున నడుగిడి పతిసేవకునై
పసిబాలుర బలమునకై
యసిధారల నెత్తురోడ్చి యాపతి నడచెన్.

క. ఇల్లిల్లు దిరిగి జపముల
వల్లించుచు బ్రతుకు నొక్క బంధన మనుచున్
మెల్లన జాఱెడిమును లా
యిల్లాలిని గని ప్రణామ మిడరా దొక్కో.

క. శ్రమమును త్యాగంబందున
రమణీయ వినీలకుంతలములు నెఱవంగన్
విమలప్రశాంతసంధ్యా
సమయములో తులసికోట సన్నిధి జేరెన్.

క. తలపోతల మున్నీటిని
నలతై తలసూపు కలల నాశల సంజన్
తులసికి వినిపించుచు నా
పొలతి మదిని సుంత శాంతి పొందగ తలచున్.

క. కమనీయ హరిత కాంతులు
నమోఘమగు నీదుమహిమ యతివల సౌభా
గ్యమునకు నాయువు పట్టువు;
విమల ప్రేమనిధి వింటివేల్పువు తల్లీ!"

క. దేవత లాకాశమ్మున
పావన నక్షత్ర దీపపం క్తిని నింపన్
నావలె నైతుపడుచు న్నే
హావృతమౌ దీప మొకటె యర్పింపనగున్.

క. ఈ యింటి గడప ద్రొక్కుట
నీ యడుగుల బూజ సేయ నేర్చితి, ప్రాలెన్
ప్రాయము నీ పూజల నని
నా యెద గరువమ్ము నర్తన మ్మొనరించున్.

క. క్రొత్తదనపు సిగ్గుబరువు
నత్తింటికి దెచ్చినప్పు డాదరమున శ్రీ
మత్తులసీపదములకడ
జిత్తము నర్పించి సేవ జేయదలచితిన్.

క. కరగిన కాలము జోడుగ
బరువును నా శిరముపైని పదిరెట్లుగుచున్
పెరుగగ జొచ్చెనకట నీ
కరుణయె లేకున్న నేమి కావలసినదో?

క. కాపురమే కష్టమ్మై
యాపదలే యతిథు లగుచు నరుదెంచంగా
నీపదసేవయె యాశా
దీపమ్మై నాకు దారి తెలిపెను తల్లీ!

క. స్తుతు లొనరింతు న టన్నను
గతిలే దొక యక్కరమ్ము; కలిగిన వ్రతముల్
జితికె దరిద్రస్థితి - నిక
పతిసేవయు నీదుపూజ పరమార్థమ్ముల్.

క. పొలములలో బని సేయుట
నలసిన పెనిమిటి గృహమున కరుదేరగ పూ
జలనైన వదలి యట సే
వలకై నే నేగవలసి వచ్చును తల్లీ!

క. ఇంతటి యలజడిలోన నొ
కింతైన నను గరుణ దప్పనీయక, నా యీ
సంతతికిని నాథునకు న
నంత క్షేమమును గూర్చినావు గదమ్మా!

క. నెత్తురు పంచి యొసంగిన
పుత్తడిబొమ్మను హసించు ముద్దులకూతున్
క్రొత్తదనమ్మును కాపుచు
నత్తింటను గాచు భార మంతయు నీదే.

క. ఈ సంజవేళ నామెయి
నీ సన్నిధి దీపరాజి నిలిపి భజించున్
దోసములను దలపోయక
యాశీర్వాదము లొసంగి యరయుము తులసీ!

క. పగ లెల్లను నలయుట కం
దొగలందున నిద్ర వచ్చి త్రోయునొ యేమో,
పగ గట్టి యాడుపడుచులు.
నెగతాళి యొనర్చ్రదొడగి రేమో గనుమా.

క. లేదెయెదలో నా క్షేమము
నీ యింటిని దలచితలచి యేకాంతముగా
తీయని స్మృతులను బాఘల
హాయమను దుఃఖించునేమొ యరసికొనగదే.

క. వయసున చిన్నది, మనమున
భయ మెక్కువ, క్రొత్తచోట 'పాప' మటంచున్
దయ నేను గందు? కామె క
భయహ స్తమొసగి బ్రోవ బ్రార్థింతు నినున్.

క. అప్పుడు పెండ్లికి నేసిన
యప్పింకను దీర్చకుంటి మప్పులవారున్
జెప్పు లరిగిపో దిరిగెద
'రప్పెప్పుడు తీర్చెద' రని యనవరతమ్మున్.

క. ఫెళఫెళ మనె నాకాశము,
తళుక్కుమనె మెఱుపుతీగ తలసూపె నదే
పొలముల వాన కురిసి యా
కలిమంటలు తీరునటుల గనుగొనుమమ్మా!

క. కోరను బంగరుమేడల,
గోరను మేల్మినసనముల, గోరను సొమ్ముల్,
గౌరవము గాచి బిడ్డల
నారసి రక్షింపుమమ్మయంతియ చాలున్.

క. నీ యాధారము జూచియె
నా యాసలు తీవలగుచు నల్లుకొనుటచే
నీ యాశీర్వాదముచే
నా యాశావల్లి వేగ ననలు దొడుగుతన్.

క. తులసికి నివాళి యెత్తెను
పొలతి; యపుడె నభము నీటిపూవుల గురిసెన్
పొలములు కలకల లాడెను,
కలికి కనుగొలకుల వింత కాంతులు కదలెన్. ★

# ఉగాది

తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి

తెలుగు పండుగ లనేకములు. అందులో ఉగాదిపండుగ చాల ముఖ్యమైనది. దీనిని సంవత్సరాది అని కూడ అందురు. సంవత్సరము ప్రారంభమున వచ్చుటచే దీనికి సంవత్సరాది అను పేరు వచ్చినది. ప్రతి సంవత్సరము ఉగాది చైత్ర శుద్ధ పాడ్యమినాడు వచ్చును. చాంద్రమాన విశ్వావసునామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి శుక్రవారం ఉగాది. మన తెలుగు మాసములలో చైత్రము మొదటి మాసము. ఏ మాసమున పూర్ణిమనాడు చిత్తానక్షత్ర ముండునో ఆ మాసము చైత్రమాసము. ఆ విధముగా పౌర్ణమినాడు ఉండు నక్షత్రమును బట్టి ఆ మాసమునకు పేరు వచ్చుచున్నది. మన పండుగలన్నియు ఋతువుల ననుసరించి వచ్చుచున్నవి. వసంతఋతు ప్రారంభమే ఉగాది. ఒక మహాకవి వసంత ఋతువర్ణన యీ విధంగా చేసాడు. యిందులో ఉగాది ప్రాశస్త్యము చూడ వచ్చును.

"మళ్ళి మ్రోగెను మధుఋతు విపంచి
మళ్ళి పలికెను మధుఋతు కావ్యం
మళ్ళి వీచెను మధుఋతు పవనం
మళ్ళి చూచెను మధుఋతు సుందరి
అందమైన తొలి సుందర దినమున
జీవితమంతా చేదూ తీపి
సమ్మిశ్రితమై సాగు నటుంచును
వేప పచ్చడుల రుచి చూపించెను"

సంవత్సరాదినాడు పెద్దలు పిన్నలు తలంటి పోసుకొని క్రొత్తబట్టలు ధరింతురు. వేపపువ్వు లేతమామిడిముక్కలు. క్రొత్తబెల్లం, క్రొత్త చింతపండు. గసగసాలు మొదలగువానితో ఉగాదిపచ్చడిని తయారు చేయుదురు. తలంటిపోసుకొని శుద్ధులై పచ్చడిని యిష్టదైవమునకు నైవేద్యముపెట్టి అన్నిపదార్థములకంటె ముందుగా చవిచూచెదరు. దీనిని కొన్ని ప్రాంతములలో వేపపూవు ప్రసాదమని అనుచున్నారు. ఈ ప్రసాదము తినినచో ఆ సంవత్సర మంతయు ఆనందోత్సాహములతో సాగిపోవునని ప్రజల దృఢనమ్మకము. తమ జీవితములో నూతన అధ్యాయము ప్రారంభమైనట్లు తలచెదరు. ఎంతటి పేదవారైనను ఆనాడు యీ ప్రసాదమును భుజించనిదే వేరు పదార్థము ముట్టరు. యీరోజున సుఖసంతోషములతో నుండుట. ఎవరితోను వాదులాడకుండుట, పిల్లలను సంతోషపెట్టుట మొదలగు అంశములను ముఖ్యముగా అనుసరింతురు. ఆరోజు మంచిపనులు చేయుటకు పూనుకొందురు. ఆరోజున ఏది జరిగిన అది సంవత్సరమంతయు జరుగునని నమ్మెదరు.

"లలాటలేఖా నపునః ప్రయాతి" అను కర్మసిద్ధాంతమును ఆరోజున మరుగున పడవేయుదురు. ధనికులనేకులు సొమ్ము వమ్ముచేయరు. యీ పండుగకు అల్లుళ్ళను పిలుచు నాచారములేదు. వేపపువ్వు ప్రసాదము తినుటలో కల అంతర్యము తెలుసుకొనదగినది; యిందులో పులుపు, చేదు, వగరు, తీపి తగుపాళ్ళలో మిళితమై యుండును. ఒక విధముగ చూచిన జీవితములోని వివిధ ఘట్టములను సూచించుచున్నట్లు కనబడును. సంసారములో కలిమి, లేమి ఉన్నట్లు ప్రసాదములో తీపి చేదు కలవు. ఆరోగ్యశాస్త్రము కూడ కొంత యీ ప్రసాదభక్షణములో నిమిడియున్నది. వేపఆకు వేపపువ్వు ఆరోగ్యమునకు చాల మంచిది. మనము జీవితములో నెల్లప్పుడు తీపి కోరి భుజింతుము. అధికతీపి వలన ఆరోగ్య భంగముకూడ కలుగును. అందువలన మనపెద్దలు యీ ప్రసాదభక్షణము సంవత్సరమున కొకసారి ఏర్పాటుచేసిరి. కనీసము సంవత్సరమున కొకమారైన చేదు రుచిచూచునవకాశము యీ పండుగద్వారా మనకు కలుగుచున్నది. కావున యీ ప్రసాదభక్షణము ఆచారముగా నున్నది.

తెలుగు సంవత్సరాది పండుగలో చంద్రునికి ప్రాముఖ్యత గమనింప తగినది. తెలుగువారికి చాంద్రమానము. తమిళులకు సౌరమానము ప్రమాణము. ఉత్తరాది వారికి బార్హస్పత్యమానము ప్రమాణము. తెలుగు సంవత్సరాది తమిళ సంవత్సరాది తేడాగా వచ్చుటకు యిదియే కారణము. యీసారి ఆంగ్ల పంచాంగము ప్రకారము క్రీస్తుశకము 2-4-1965 న తెలుగు సంవత్సరాది వచ్చును. తమిళులకు 13-4-1965 తమిళ సంవత్సరాది. మరియొక విశేష మేమన భారత ప్రభుత్వము జాతీయ పంచాంగము తయారుచేయించిరి. అది శాలివాహనశక పంచాంగము. శాలివాహనశకం చాలకాలంనుంచి మన దేశములో అమలులో ఉంది. ప్రస్తుతం క్రీస్తుశకం 78 లో యీ శాలివాహనశకం ప్రారంభమైనది. మన శాసనములలోను, ప్రాచీన గ్రంథములలోను అనేకచోట్ల శాలివాహనశకమే వాడబడినది. కావున యీ శకమే భారతదేశమంతటా ప్రవేశపెట్టబడినది. యీ శాలివాహన చక్రవర్తి ఆంధ్ర శాతవాహన వంశమునకు చెందినవాడు. యీ విధముగ ఆలోచిస్తే శాలివాహనశకం ఆంధ్రజాతి శకం. ఇది

మార్చి 22–1957 అర్ధరాత్రి ప్రారంభమైనది. అంటే శాలివాహన శకంలో మార్చి 22 చైత్రశుద్ధపాడ్యమి అన్నమాట. శాలివాహనశకం విషువదినంతో ప్రారంభమగును. విషువదినం అంటే రాత్రింబవళ్లు సరిగా సమానమైన రోజన్నమాట. యీ ప్రకారం మన కందఱకు మరియొక ఉగాది. శాలివాహన శకం ప్రకారం చైత్రశుద్ధ ౧ పాడ్యమి ౧౮౭౯ ఉగాది.

ఉగాదినాడు పంచాంగ శ్రవణము జరుగును. యిది దేవాలయమునకాని ఏదేని చావడిలోకాని జరుగును. బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలగు చాతుర్వర్ణములవారు ఆ సభకు హాజరగుదురు. పండితులు పంచాంగ శ్రవణము చేయుదురు. వారినుండి ప్రతిపౌరుడు తనఆదాయ కందాయఫలములను, గోచార ఫలములను సంవత్సర ఫలములను తెలుసుకొనును. రాజ పూజ్యావమానములను తెలుసుకొనును. పండితులు సస్యఫలములను, వర్ష సమృద్ధిని చెప్పుదురు. వర్షములు ఎప్పుడు కురియును? హెచ్చుగా కురియునా? క్షామము వచ్చునా? ధాన్య సమృద్ధి ఉండునా? రాజు, మంత్రి ఆ సంవత్సరమునకు గ్రహములలో ఎవరు? సైన్యాధిపతి ధాన్యాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, రసాధిపతి, నీరసాధిపతి ఎవరెవరు? ధరవరలు ఎట్లుండును? పశు సమృద్ధి ఉండునా? మొదలుగాగల విషయములను తెలుపుదురు. గ్రహములు ఎప్పుడువచ్చునో చెప్పి ఆ సమయమున స్నానపానాదుల వివరములు, చేయవలసిన పుణ్యకర్మలు విపులీకరించబడును. గ్రామంలోని వారందఱు సమావేశమై యీ విధముగా వారివారి భవిష్యత్తును తెలుసుకొనుచుండుట చూచుటకు ఆహ్లాదకరముగ నుండును. అచ్చటకూడ పట్టు పీతాంబరములు, యజ్ఞోపవీతములు ధరించిన బ్రాహ్మణులు ప్రథమమున వేపపూవు ప్రసాదము వెండిగిన్నెలోపోసి ఉద్ధరణితో ప్రతిసామాన్యపౌరునకు కులమత భేదములు లేక పంచియిచ్చెదరు. పట్టణములలో ఉగాదికని సమ్మేళనములు జరుగును. ఉగాదినాడు ఆకాశవాణి కవిసమ్మేళనములను ప్రసారము చేయును. ప్రతి చిన్న సాహితీ సమితి యీ పండుగ చేసుకొనును. ఉగాది కవిసమ్మేళనము, ఉగాదిపాటల కావ్యగానము వీనుల విందుగా నుండును. ఉగాదిపాటలు చాల ప్రసిద్ధి కెక్కినవి.

**వచ్చింది వచ్చింది ఉగాది**
**తెచ్చింది తెచ్చింది సంపాది**

సంపదలు తెచ్చు పండుగగాకూడ దీనికి ప్రాముఖ్యము కలదు. ఉగాది పాటలు పల్లెపడచులు చాల మధురముగా ఆలపించుచుందురు. వారు గుంపులు గుంపులుగా చేరి యీ పాటలు పాడుచు ఆనందోత్సాహాలలో ఓలలాడుచుందురు. వారు వారి పనులలో నిమగ్నులై కార్యభారమును మఱచిపోవుటకు యీ పాటలు పాడుచుందురు. యీ పండుగకు గంగిరెద్దుల మేళముకూడ విశేషము. బసవన్న ఉదయమున ప్రతిగృహ ప్రాంగణమున నాట్యము చేయును.

ఉగాదిపండుగకు జ్యోతిష శాస్త్రమునకు సంబంధము కలదు. యీ శాస్త్ర ప్రాధాన్యము యీ పండుగలో తెలియును. ప్రతిపౌరుని భవిష్యత్తు వాని గ్రహములపై ఆధారపడి యుండునుగాన ఉగాదికి ప్రాధాన్యము హెచ్చుచున్నది. యీ పండుగ తెలుగు పండుగల్లోకెల్ల పెద్దపండుగ. మానవ భవిష్యత్తుతో అవినాభావ సంబంధము కలిగిన గొప్పపబ్బము.

**సర్వేజనా స్సుఖినో భవంతు**
**సర్వేషాం సన్మంగళాని భవంతు.**



'ధాన్యలక్ష్మి' చిత్రం : మారేమండ శ్రీనివాసరావు, గుంటూరు.

# వనితాలోకం



# ఈరోజుల్లో కూడా ఇలాగుంటే ఎలాగ?

పంతుల సౌభాగ్యలక్ష్మి

"ఈరోజు మా స్నేహితుడు అతని భార్యా వస్తున్నారు. టిఫినేం చేస్తావు" అన్నారు మావారు. "ఎవరా వస్తున్న స్నేహితుడు?" అని అడిగేను. "కిందటిఆదివారం వెళ్ళేం జ్ఞాపకం లేదూ! మనకి వారంరోజులకిందటి పకోడీలు పెట్టేరూ, వాళ్ళు ఈరోజు మనింటికి వస్తున్నారు. వాళ్ళు పెట్టేరు కదాఅని నువ్వు కూడా ఏవారంకిందటిబజ్జీలో పెట్టకేం." అన్నారు వాళ్ళనిగూర్చి ఎగతాళీగా మాట్లాడుతూ — వాళ్ళింటికి వెళ్ళినప్పుడు పెట్టినపకోడీలు నిలవసరుకులా తోచిన మాట నిజమే కాని ఏదో పిల్లలతో చేసుకోలేక బజారునుండి తెప్పించారేమో. అంచేత అలా ఉన్నాయేమో అనుకున్నా. అంతేకాకుండా ఈజురోల్లో సెనగపిండి ప్రియంగా ఉందని పారెయ్యడానికి ప్రాణం ఒప్పక ఎలాగో తినేశాను. మావారు ఒకటిమాత్రం లాంఛనంగా నోట్లో వేసుకుని అన్నీ వదిలేశారు. ఇంటికొచ్చాక "నువ్వు అరటితొక్క కూడా వృధాగా పోనిచ్చేరకానివి కాదు కనుక తిన్నావు కాని నాకు మాత్రం అవి తిండానికి అసహ్యం వేసింది సుమా. అవి ఎన్ని రోజులకిందటివో ఏవిటో?" అని వాళ్ళతోపాటు నన్ను కూడా హాస్యం చేశారు. ఇంక అసలు కథలో కొద్దాం. ఆ స్నేహితుడు, భార్యా మాఇంటికొచ్చినప్పుడు వేడివేడిగా గారెలు చేసి పెట్టేను. కాఫీ కూడా ఇచ్చేను. ఆయనస్నేహితుడేమో కొద్ది కొద్దిగా రెండుమాట్లు పీల్చి మిగతాది వదిలేశాడు. వారిసతీమణి సగం తాగి వదిలేసింది. వాళ్ళ పిల్లలు మాత్రం "అత్తయ్యగారూ, కాఫీ చాలా బాగుందండీ, వడలు కూడా బాగున్నాయి." అంటూ ఇష్టంగా తీసుకున్నారు. వాళ్ళిద్దరూమాత్రం గారెలు కూడా ఎంగిలిచేసి వదిలేశారు. వాళ్ళలా చెయ్యడమే కాకుండా తింటున్నపిల్లల్ని కూడా "మొహంవాచినట్టు ఏవిటాతిండి". అని మందలించారు. వాళ్ళలా పారేసినందుకు నాప్రాణం ఉసూరు మనిపించింది. అప్పటికీ ఉండబట్టలేక "కాఫీలో ఏదైనా తక్కువైందా, నేచేసినవి బాగులేవా" మొదలైనప్రశ్నలు వేశాను. "అబ్బే, అదేం కాదు, ఇంతకన్న ఎక్కువ తీసుకోలేమండీ," అన్నారు వాళ్ళు. వాళ్ళు వెళ్ళేక మావారిని చేసినవి ఎలాగున్నాయని అడిగేను. "బాగుండకేం. వాళ్ళకి నయించక వదిలేశారా ఏమిటి? అదేం కాదు. కొందరలా వదిలెయ్యడం గొప్పనుకుంటారు." అన్నారు మావారు నేను "ఇలా ఎంగిలిచేసి వదిలేసేకంటే ముందే అంత తినలేను తీసెయ్యండి అనకూడదూ? ఈ ఎంగిలివి ఇంకెవరికీ పనికిరావు కదా?" అన్నాను. మా శ్రీవారు "రోజుల్నిబట్టి అందరం పద్ధతులు మార్చుకోవాలి. ఇప్పుడు చాలామంది ఒకప్లేటులోనే ఏబిస్కట్లో, కాజాలో ఇలాటివేవో వేసి నలుగురిమధ్యనా ఉంచి 'తీసుకోండి' అంటున్నారు. ఇలాగైతే ఎవరికి క్కావలిసింది వాళ్ళు తీసుకుంటారు. పదార్థమా "వృధాకాదు" అన్నారు. నాక్కూడా నిజమే ననిపించింది.

దేశంలో ఆహారం కొరతగా ఉండం వల్ల పదార్థాలు పొదుపుగా వాడుకోమనీ, ఒకపూట ఉపవాసం వారానికోసారి చెయ్యమనీ, ఇలాటి ప్రచారాలు జరుగుతున్న ఈ రోజుల్లో కూడా ఇలా

గుంటే ఎలాగ? ఆహార పదార్థాలు జాగ్రత్తగా వాడుకోవలసినరోజులని అందరికీ తెలుసును. ఐనా కేవలం తృప్తి కోసమో లేకపోతే మొదట్నుండీ అలవాటుమూలాన్నో ఆహారాన్ని దుర్వినియోగం చేస్తున్నవాళ్ళు ఇప్పుడు కూడా ఉన్నారు. కాలాన్నిబట్టి పరిస్థితుల్నిబట్టి మనం తప్పకుండా మారాలి.

ఈమధ్య నేనొకపెళ్ళివిందుకి వెళ్లేను. లడ్డుండలూ, పులిహోర పారవేసినవాళ్లు కూడా ఉన్నారు. సెనగపిండి ఖరీదెక్కువగా ఉందాయె. కొన్నిప్రాంతాలలో హోటలువాళ్ళే బజ్జీలూ, పకోడీలూ చెయ్యడమే మానేశారని విన్నాను: ఇంక పంచదార, బియ్యం సంగతి వేరే చెప్పనే అక్కర్లేదు. వడ్డించేవాళ్ళు జాగ్రత్తగానే వడ్డించారు. రుచికీ లోపం లేదు. అలాంటప్పుడు పారెయ్యడానికెలా ప్రాణం ఒప్పిందో! నాపక్కనే నాకు వదినవరసయ్యేఆవిడ కూర్చుంది. నేను ఆవిడతో "చూశావా, వదినా! నేనేదీ వృథా చెయ్యకుండా ఎలా తిన్నానో" అన్నాను గొప్పగా. ఆవిడ నవ్వుతూ "అవిస్తరి మాత్రం ఎందుకు వృథా చెయ్యడం? ఆ ఆకు కూడా తినెయ్యి." అని అంది వెటకారంగా. ఇలా వేళాకోళంగా ఎక్కడ నవ్వుతారో అనే భయంకొద్దీ పారేసేవారు కూడా ఉంటారు. వట్టితిండిపోతని ఎక్కడనుకుంటారో అని కొందరు, చాలాతక్కువ తింటుందనుకోవాలని కొందరు పారేస్తుంటారు. వెనకటికి ఒకల్లుడు అత్తగారు తనని తిండిపోతని ఎక్కడనుకుంటుందో అని పెట్టినదానిలో చాలాభాగం వదిలేశేవాడట. ఆట్టే తినడు కాబో లని కొంచెం పెడితే అందులోనే వదిలేసేవాడట. ఇలా రెండురోజులయ్యేసరికి ఆయనగారు ఆకలికి తట్టుకోలేక చీకటయ్యేక మధూకరానికి బయల్దేరాడట. దారి తప్పి తన అత్తవారింటిముందే నిల్చి "మాధాకవళం తల్లీ" అని అరిచేడట. అత్తగారు అన్నంతో ఇవతల కొచ్చి అల్లుణ్ని గుర్తించి లోపలికి తీసికెళ్ళి మంచిమాటలతో కడుపునిండా భోజనం పెట్టిందట.

అనవసరంగా తినకుండా వృథాచేసేవారంటే నాకెంత కోపం వస్తుందో, వద్దు మొఱ్ఱో అంటుంటే గొప్పకోసం వడేసేవాళ్ళన్నా నాకంత ఒళ్ళు మండుతుంది. శుభకార్యాల్లో కూడా కొందరు అడక్కుండా గబుక్కున వడేస్తూంటారు. ఈ అలవాటు బాగా గట్టిగా ప్రయత్నించి మానుకోవాలి.

ఒకసారి మాచిన్నాన్నగారింట్లో బారసాలని విందుకి వెళ్లేను. మా చిన్నాన్న పెద్దకొడుకుకొడుకు బారసా లన్నమాట. మాఅన్నయ్యస్నేహితులు, మాచిన్నాన్న ఆఫీసులోవాళ్లు కొందరు మాపిన్ని, వదినల స్నేహితురాండ్రు అంతా విందుకి ఆహ్వానింపబడ్డారు. నేను లోపల కెళ్ళి మాపిన్నితో మెల్లిగా "ఈరోజుల్లో కూడా ఈ చాదస్తాలన్నీ ఏమిటి పిన్నీ? ఇంతమంది భోజనా లంటే మాటలా?" అన్నాను. "ఆ! ఏదో నలుగురూ వచ్చి నాలుగక్షింతలు వేస్తే ఎవరిచేతిచలవచేతనైనా పసివాడు వృద్ధిలోకి వస్తాడని ఆశ" అని పిన్ని జవాబు. నేనూరుకున్నానా? "నీకంత అందరిఆశీస్సులే కావా లంటే ఏపేరంటమో చేసి కుర్రాడికి అక్షింతలు వేయించకూడదా?" అన్నా. పిన్ని "నువ్వు చిన్నదానివి, నీకు తెలీదమ్మా ఇలాంటిశుభసమయాల్లో అన్నశాంతి భూతతృప్తికి చెయ్యాలి" అంది అన్నశాంతి జరగా లంటే ఏముష్టివాళ్ళకో ఇంతపులుసన్నం పెట్టకూడదా అందామనుకున్నా కాని ఆవిడేదో పనిమీద వెళ్ళిపోయింది. భోజనా లయ్యాయి. మాపిన్ని పెద్దపెద్ద మైసూరుపాకు ముక్కలు వడ్డించింది. చాలామంది సగం తిని వదిలేశారు. అంతా వెళ్ళిపోయాక మా చిన్నాన్న "మైసూరుపాకు కాస్త చిన్నముక్కలు కోసి వెయ్యకూడదా? మరీ ఇటికలంతేసి వేస్తే పారయ్య కేం చేస్తారు?" అని పిన్నిని మందలించేరు. వడ్డించేటప్పుడు జాగ్రత్తగా కావలసింది వెయ్యాలి కాని చాలీచాలకుండా వడ్డించాలనిమాత్రం నాఉద్దేశంకాదు. ఈరోజుల్లో కొంతమంది వడ్డించుకోవలసినపదార్థాలన్నీ దగ్గర ఉంచి ఎవరికి వారే వడ్డించుకునేపద్ధతి చేస్తున్నారు. మనంతట మనం తీసుకుందుకి మొదట్లో మొహమాటంగా ఉన్నా తర్వాత రెండుమూడుసార్లు ఇలాటివిందుల కెడితే అదే అలవాటవుతుంది. ఎవరికి కావలసింది వారు వడ్డించుకుంటే మరి పారెయ్యడం అనేది ఉండదు.

ఏ టైములో వచ్చినా కాఫీ టిఫన్లు ఇచ్చేఅలవాటు కూడా మనం మార్చుకోవాలి. మనింట్లో కాఫీ, టిఫనూ తీసుకుంటే ఇంటి కెళ్ళాక అన్నానికి ఆకలి లేకుండా చేసేలా ఉండకూడదు. ఎంత తేలికైనటిఫన్ పెడితే అంత మంచిది. విందుల కెళ్ళేముందు మనం ఇంకోసంగతి కూడా గుర్తుంచుకోవాలి. కొందరికి శనివారమో, ఆదివారమో, ఏదోవారం ఒంటిపొద్దు, అంటే రాత్రి భోంచెయ్యక పోవడం ఉంటుంది. నేను కూడా సోమవారం ఉల్లిపాయ తినను. ఒకరింట్లో టీపార్టీకి తప్పనిసరిగా వెళ్ళవలసివచ్చింది.

(మిగతా 28 పేజీలో)

# రాముడు ఆదర్శమానవుడు - వాల్మీకి చిత్రణము

కె. కమల

వసంత ఋతువునందు మార్తాండ బింబము, సహస్ర కిరణములతో ప్రకాశించును. ఆరు ఋతువులలోను ఇది అతి దీప్తివంతమగుఋతువు. అతిగహనములగు అరణ్యములలోకూడా సూర్యకిరణముల వెలుగు వసంత ఋతువునందు వ్యాపించును. భగవంతుడు ధర్మసంస్థాపనార్థము అవతరించిన పెక్కు అవతారముల కొరకీ ఋతువు నే యెన్నుకొనెను. శ్రీమన్నారాయణుని దశావతారములలో నృసింహ, వామన రామాద్యవతారముల యొక్క జయంతులను మనము ఈ ఋతువులోనే వేడుకగా జరుపుకొనుచున్నాము. బుద్ధభగవానుడుగూడ ఈ ఋతువులోనే అవతరించెను. శంకరుడు హైందవధర్మము నుద్ధరింపబూని శంకరాచార్యులై అవతరించినదికూడా వసంతఋతువునందే.

చైత్రశుద్ధ నవమినాడు శ్రీమన్నారాయణుడు, రాముడుగా సర్వలోకాభిరాముడై, ఇక్ష్వాకుకుల సోముడై జన్మించెను. రామావతారము అన్ని అవతారములలోను ప్రశస్తమైనది. దీనికి కారణము, రామునియందు దివ్యమగు శక్తి యుండుటయేకాక ఆదర్శజీవి యగు మానవునకు, స్వధర్మనిష్ఠగలమానవునకును నుండవలసిన లక్షణములు, లోకరక్షణకై, స్వసుఖమును త్యజించిన మానసి కౌన్నత్యమున్ను కలవు. రాముడు, పితృవాక్య పరిపాలకుడగు పుత్రుడుగా, ఆదర్శ ప్రభువుగా, లోకరక్షకుడుగా, ఏకపత్నీ వ్రతుడుగా, ప్రతి భారతీయుని హృదయమునందును నిలిచిపోవుటకు కారణము, వాల్మీకిమహర్షి యొక్క అమృతవాగ్ధారచే రామాయణమునందు మలచబడిన రాముని వ్యక్తిత్వమే యని చెప్పక తప్పదు. రామనామముయొక్క ప్రభావముచే దారిదోపిడియే వృత్తిగా గల ఒక బోయవాడు, నారదునిచే ప్రబోధితుడై, మహర్షి పదమును పొంది, రామాయణ కర్త యయ్యెను. ఆ బోయవాడు రామ నామమును జపించుచు, నిశ్చలచిత్తుడై కొన్ని సంవత్సరములు తపస్సు చేయగా, అతనిచుట్టును ఒక చీమలపుట్ట పెరిగెనట. జ్ఞానోదయ మైనతరువాత ఆ వల్మీకము నుండి బయలువెడలిన అతడు వాల్మీకి అయ్యెను. తమసానదీతీరమునం దొకనా డీ ముని స్నానార్థియై పోవుచుండగా, క్రౌంచమిథునమునం దొక పక్షిని, ఒక బోయవాడు తన బాణముచే చంపెను. సత్త్వగుణ సంపన్ను డగు ఈ మహర్షి హృదయము - పూర్వము బోయవాని హృదయముకాదు-దివ్య తపోమహిమచే పాప మంతయు క్షాళితమై బ్రహ్మత్వము నొందిన ఆ మహర్షి హృదయము క్రౌంచపక్షి దీనావస్థను చూచి కరుణపూరిత మయ్యెను. ఆ శోకముతో ఈ క్రింది శ్లోకము అప్రయత్నముగా మహర్షి నోటినుండి వెలువడెను.

మానిషాద ప్రతిష్ఠాంత్వం
అగమః శాశ్వతీః సమాః।
యత్క్రౌంచ మిథునాదేకం
అవధీః కామమోహితమ్.

(ఓ బోయవాడా! క్రౌంచమిథునములో కామమోహితమైన పురుషపక్షిని నీవు చంపితివి కనుక నీవు శాశ్వతముగా ప్రఖ్యాతిని పొందకుందువుగాక." అదే కరుణ వచనమే "ఓ రామా ! మండోదరీ రావణులలో కామమోహితుడగు రావణుని వధవలన శాశ్వతముగా నీవు ప్రతిష్ఠను పొందితివి," అని రామ కథకు అంకురార్పణ మైనది).

ఈ విధముగా సంస్కృత సాహిత్యము నందలి ఆదికావ్య మగు రామాయణ రచనకు అంకురార్పణము వాల్మీకిద్వారా కరుణరసభరిత వాక్కుతో జరిగెను. కావుననే ఆనంద వర్ధనాచార్యుడు రామాయణ మహాకావ్యము కరుణరస ప్రధాన మని చెప్పెను. ఈ విషయమునే సమర్థించుచు మహాకవి కాళిదాసు:-

"నిషాద విద్ధాండజదర్శనోత్థః,
శ్లోకత్వమాపద్యత యస్యశోకః॥"

(బోయవానిచే చంపబడిన పక్షినిచూచుట వలన ఉత్పన్నమైన మహర్షి శోకమే "మానిషాద" యను శ్లోకరూపమును దాల్చినది.

అని చెప్పెను. కరుణరసమును స్పందింపచేయుటలోసిద్ధహస్తుడగు భవభూతి రామా

యణమునందు అత్యంత కరుణరస పూరితమగు రామకథను స్వీకరించి వ్రాసినఉత్తరరామ చరితములో ద్వితీయాంకమునందీ క్రింది విధముగా రామాయణ కావ్యావతరణమును ప్రస్తావించెను. "అథ స బ్రహ్మర్షిరేకదా, మాధ్యందినసవనాయ నదీం తమసామనుప్రపన్నః, తత్ర యుగ్మచారిణోః క్రౌంచయోరేకం వధ్యమానం వ్యాధేన దదర్శ. అకస్మికః ప్రత్యవభాసాం. దేవభాషాం మానుషేన ఛందసా పరిణతామభ్యుదైరయత్."

(ఆ బ్రహ్మఋషి యగు వాల్మీకి యొకప్పుడు మాధ్యాహ్నికానుష్ఠానముకొరకు తమసానదిని చేరి యచట జంటగా చరించుచున్న క్రౌంచపక్షులలో పురుషపక్షి బోయవానిచేత వధింపబడుచుండుటను జూచి, హఠాత్తుగా ప్రస్ఫురించి, లౌకికచ్ఛందస్సులో పరిణమించిన దేవభాష (సంస్కృతము) ను చెప్పెను.)

**రామాయణము :-**

తపస్స్వాధ్యాయనిరతం
తపస్వీవాగ్విదాం వరం,
నారదం పరిప్రచ్ఛ
వాల్మీకిర్మునిపుంగవం.

(తపస్వియైన వాల్మీకి, మునిపుంగవుడును తపస్సునందు, వేదాధ్యయనమునందు తత్పరుడును, ఉపదేశకులలో శ్రేష్ఠుడునైనట్టి నారదమునిని ప్రశ్నించెను.)

అను శ్లోకముతో ఆరంభ మగుచున్నది. నారదవచన ప్రచోదితుడై వాల్మీకి ఈ కావ్యమును రచించినట్లు పై శ్లోకము వలన తెలియుచున్నది. వాల్మీకి ఇరువది నాలుగువేల శ్లోకములతో రామాయణమును వ్రాసి, సహస్ర శ్లోకముల కొకసారి వరుసగా పవిత్ర గాయత్రీ మంత్రమునందలి ఒక్కొక్క అక్షరమును పై న శ్లోకాదిలో కూర్చెను.

"తత్స వితుర్వరేణియం..."

అను గాయత్రీ మంత్రమునందలి "త"తో రామాయణ కావ్య మారంభమగును. ఇట్లే ప్రతి సహస్రశ్లోకముల తరువాత, మంత్రాక్షరములలో ఒక్కొక్కటి శ్లోకాదిలో చేర్చబడినది. రామాయణ పారాయణము నిష్ఠతో చేసినచో సకల రోగములు నివారింపబడు నను నమ్మకము భారతీయులకు కలుగుటకు కారణము, తత్పఠనముచేత గాయత్రీ ఉపాసన జరిగి రోగనివారణ మగు ననుటయే. అందును సుందరకాండ పారాయణము మిక్కిలి శ్రేష్ఠమైనదని అందురు. సుందరకాండము నందలి కవిత్వము అతి సుందరముకదా! యుద్ధకాండమునందు రాముడు రావణునితో యుద్ధముచేసి చేసి విసిగి వేసారినప్పుడు అగస్త్యుడతనికి ఆదిత్యహృదయమును ఉపదేశించి, రవిసంకీర్తనముచే శత్రువులను జయింపవచ్చు నని చెప్పెను. ఈ సూర్యస్తవ మత్యంత రమణీయముగా నుండి, సూర్యకిరణములచే ప్రాణికోటి జీవించుచున్న దను సత్యమును -

"నాశయత్యేష వై భూతం
తదేవ సృజతి ప్రభుః
పాయత్యేష, తపత్యేష
వర్షత్యేష గభస్తిభిః"

(ఈ సూర్యుడు తన కిరణములచేత లోకమును నశింపజేయును తిరిగి సృజించును, పాలించును, తపించును, వర్షించును) ఇది అయన కిరణముల ప్రభావము కనుక అతడు త్రిమూర్త్యాత్మకుడు అనిభావము.

మహా కావ్యముయొక్క ప్రయోజనములలో "శివేతర క్షతి" (యనగా - అశుభములను, అనర్థములను నశింపజేయుట) కూడా ఒకటియై యున్నది. కావ్యరత్నమగు రామాయణము, శారీరక, మానసిక మాలిన్యములను, రోగములను నాశనము చేయును.

త్రికాల వేదియగు మహర్షి వ్రాసిన కావ్యమే చిరస్థాయిగా నుండును. కావుననే "నానృషిః కురుతే కావ్యం" (ఋషి కానివాడు కావ్యరచన చేయలేడు) అను ఆర్యోక్తి అన్వర్థమైనది. ఇట్లు కావ్యస్వరూపమును మనము విచారించినచో, రామాయణ, మహాభారతాది గ్రంథములు మాత్రమే కావ్యములనబడును. కావుననే పండితుడు విమర్శకాగ్రేసరుడు నగు అభినవగుప్తుడు "లోకే ద్వావేవ కవయః వ్యాసవాల్మీకి ప్రభృతయః" అని చెప్పెను. లోకములో కవులనబడువారు వ్యాస వాల్మీకు లిద్దరే. కాళిదాసాదులు కూడా ప్రభృతి శబ్దములోనే అతనిచే చేర్చబడినారు. వాల్మీకిని రామునకు సమకాలికునిగా రామభక్తునిగా, కుశలవుల పరిరక్షకునిగా మనము తలచెదము. అట్లే హిందీలో "రామచరిత మానసమును వ్రాసిన"తులసీదాసు", తమిళములో కంబరామాయణమును వ్రాసిన 'కంబన్' గొప్ప రామభక్తులు. భక్తి పారవశ్యముచే రామకథను గానము చేసిన తులసీదాసు అమరుడయ్యెను. వాల్మీకి రాముని ఆదర్శ చక్రవర్తిగ చిత్రించెను. తులసీదాస రామాయణమునందు భక్తిరసమునకే ప్రాధాన్యము గలదు.

ఇక తెలుగుదేశమునందు చూచినచో, తెలుగువారికి రాము డభిమానదైవతము. శ్రీమదాంధ్ర భాగవత కర్తయగు పోతనామాత్యుడు పరమ భాగవతోత్తముడు. రామచంద్రు డతనికి సాక్షాత్క

రించెననికూడా చెప్పుదురు. పోతనా మాత్యుడు భాగవత గ్రంథారంభములో నిట్లు పలికెను.

"పలికెడిది భాగవతమట,
పలికించెడువాడు రామభద్రుండట,
నే బలికిన భవహర మగునట
పలికెద, వేరొండుగాథపలుకగ నేలా!"

అని తన కవిత్వము పలికించినవాడు రామభద్రుడని చెప్పెను. తన కవితను పురుషోత్తమునకే అంకిత మొనర్చెను. త్యాగరాజు రామనామసంకీర్తన మొనరించి, నాదబ్రహ్మోపాసక బిరుదాంచితుడై, సంగీత సాహిత్యములందు అజరామరమైన ఖ్యాతిని పొంది, తన జన్మ సార్థక మొనరించుకొనెను. త్యాగరాజు కీర్తనలు దక్షిణభారతమున దంతటను మిక్కిలి ప్రసిద్ధి నొందెనవి. దేశమునందలి సుప్రసిద్ధ రామాలయములందు మిక్కిలి ప్రశస్తిగాంచినది, గోదావరీతీరమందున్న భద్రాచలమునందలి రామాలయము. ఇది తెలుగువారి రామభక్తికి గొప్ప నిదర్శనము. ఈ రామాలయ నిర్మాణము వెనుక ఒక గొప్ప రామభక్తుని కథ గలదు. కంచెర్ల గోపన్న యను నతడు గోలకొండ నవాబు తానీషాకాలమున భద్రాచలము తహసీల్దారుగా నుండి, ఈ రామాలయమును నిర్మించెననియు ప్రభుత్వధనముచే ఆలయమును నిర్మించెనను నేరముపై తానీషా అతనినిచెరలోనుంచగా రామలక్ష్మణులే తానీషాకు కలలో దర్శనమిచ్చి, రామదాసైన గోపన్నను ఋణవిముక్తుచేసిరనియు ప్రతీతి. ఈరామదాసు భక్తి పారవశ్యముచే రాముని కన్న తండ్రిగా, పాలకునిగా, భగవంతునిగా, ఒక్కొక్కసారి తనకు ఋణపడినవానిగా భావించి, కీర్తించిన కీర్తనలు. తెలుగునాట బాల గోపాలమునకు సుపరిచితములే. రామదాసు, జైలులో రాజభటులుపెట్టు కష్టములను భరించలేక, రామాలయ నిర్మాణమునందు తాను వెచ్చించిన ధనముయొక్క జాబితా తెలుపుచు — "ఎవరబ్బసొమ్మని కులుకుచు తిరిగేవు — రామచంద్రా" అనుచు, "దెబ్బల కోర్వక — అబ్బ, తిట్టితినని ఆయాసపడబోకు — రామచంద్రా" అని వేడుకొనును. భక్తులచేతిలో, భగవంతుడు కీలుబొమ్మయేకదా!

రామావతారమునందు రాముడు. ఆదర్శ మానవలక్షణములను కలిగియే భగవద్రూపమును గోచరింపజేయును: అల్లే సీతాదేవియందు ఆదర్శభారత నారీ లక్షణములు మూర్తీభవించియున్నవి. సీతా సావిత్రులతో దేశమునందలి పతివ్రతాస్త్రీలను పోల్తుము. సీతాదేవిని వాల్మీకి:-

"పతివ్రతా మహాభాగా
ఛాయేవానుగతా సదా॥"

(పతివ్రత, మహానుభావురాలు నగు సీత రాముని నీడవలె అనుసరించుచు అడవికి పోయెను.)

అనిచెప్పి తన పతివ్రతాత్వమును వ్యక్తపరచెను. సీతాదేవి తన పతిని అరణ్యమునందుకూడా అనుసరించుటకు కృతనిశ్చయురాలై:-

"సావిత్రీమివమాం విద్ధి,
త్వమాత్మ వశవర్తినీం॥"

అనుచు, సావిత్రీదేవి కున్నంత స్థైర్యము, ఓర్పు తనలో కలదని చెప్పును. భార్యాభర్తల బంధమువిడదీయరానిదని చెప్పుచు సీతాదేవి:-

"నాతన్త్రీ వాద్యతే వీణా,
నాచక్రో వర్తతే రథః॥"

(తీగలులేక వీణ వాయించబడదు, చక్రములేక రథము నడువదు — అల్లే సీత లేక రాముడు ఉండజాలడు.)

అని చెప్పును. రాముడు లేనిదే తానొక్క నిమిషమైనను నిలువజాల నని చెప్పుచు:-

"రోహిణీన వినా చంద్రం,
ముహూర్తమపి దృశ్యతే॥"

(రోహిణీ చంద్రునివిడచి ఒక క్షణముగూడ కనపడదు) అని సమర్థించి వాల్మీకి తనకుగల జ్యోతిర్విద్యా పాండిత్యమునుగూడ తెల్పెను.

రావణుడు, సీతాదేవిని అపహరించినప్పు డామె చూపిన స్థైర్యము, ప్రతి భారతనారికిని ఆదర్శప్రాయమైనది. సీత, ఇచట కేవలము అబలగానేగాక, తన మనోబలముతో రావణునంతటివానిని సైతము జయింపగలిగినది. రావణునితో ఆమె. భాషించిన క్రమమును చూడుడు. సీతను, వాంఛించుట, నిప్పుతో చెలగాటమువంటిదని, ఈ క్రింది విధముగా చెప్పును:-

క్షుధితస్య హి సింహస్య,
మృగశత్రో స్తరస్వినః.
ఆశీవిషస్య చ ముఖాత్
దంష్ట్రా మాదాతు మిచ్ఛసి,
కాలకూటవిషం పీత్వా,
స్వస్తిమాన్ గంతు మిచ్ఛసి,
సూర్యా చంద్ర మసౌ చోభౌ
పాణిభ్యాం హర్తు మిచ్ఛసి
అగ్నిం ప్రజ్వలితం దృష్ట్వా
వస్త్రేణాహర్తు మిచ్ఛసి.
యోరామస్య ప్రియాం భార్యాం
ప్రధర్ష యితు మిచ్ఛసి॥"

(ఓరావణా! రాముని ప్రియభార్య యగు నన్ను చెనకుచున్న నీవు, ఆకలిగొన్న మృగశత్రువైన సింహము యొక్కయు, సర్పము యొక్కయు ముఖమునుండి కోరలను

పెరుకగోరుచున్నావు; కాలకూట విష మును త్రాగి క్షేమముతో వెళ్ళగోరు చున్నావు; సూర్యచంద్రుల నిరువురిని చేతులతో హరింపగోరుచున్నావు; మండు చున్న అగ్నిని చూచునే నీ యంగ వస్త్రములో ముడిచి తీసుకోగోరు చున్నావు.)

అని రావణునకు వాటిల్లనున్న ముప్పును సూచించును.

లంకానగరములో పెక్కుమార్లు రావణుడు, సీతను బెదిరించినను, సీత ధైర్యమును కోల్పోవలేదు.

"సా తథోక్తాతు వైదేహీ
నిర్భయా శోకకర్శితా
తృణమంతరతః కృత్వా,
రావణం ప్రత్యభాషత"

(రావణునితో మాటలాడునప్పుడు వైదేహి పతివ్రత, పరపురుషునితో మాటలాడ కూడదు కావున గడ్డిపరకను నడుమనుంచు కొని శోకఖిన్నయై, నిర్భయముగ మాటా డినదని దీనిభావము. హనుమంతుడు సీతా న్వేషియై పోయి - పోయి, అశోకవృక్షము క్రింద కఠిన బ్రహ్మచర్యముతో నున్న అసమాన తేజోమూర్తియగు సీతాదేవిని చూచి, ఈ విధముగా భావించును.

"రాజ్యం, వా త్రిషులోకేషు
సీతా వా జనకాత్మజా.
త్రైలోక్యరాజ్యం సకలం.
సీతాయా నాప్నుయాత్కలాం.
"దుష్కరం కురుతేరామో
హీనో, మదనయా ప్రభుః
ధారయత్యాత్మనో దేహం,
న దుఃఖేనావసీదతి॥"

ఇట్టి లావణ్యరాశి, ఒప్పులకుప్పను విడిచి జీవించగలిగిన రాముడొక దుస్సాధ్యమగు కార్యమును నెరవేర్చుటయేకదా, యని దీనిభావము.

లంకా నగరము నందు, రాముడు సీతను, నిరాకరించినప్పుడు కూడ సీతాదేవి ఇట్టి స్థైర్యమునే ప్రదర్శించును. బేలయై, విషణ్ణవదన గాక, సీత నిర్భయ ముగా లక్ష్మణునితో.

"చితాం, మే కురు, సౌమిత్రే"

(ఓ లక్ష్మణా! నాకొరకు చితిని పేర్చుము) అని చెప్పును.

ఇట్టి సీతాదేవి, భారతీయుల ఆదర్శ నారీమతల్లి. శ్రీరామనవమిని మనము, రామ జన్మదినోత్సవముగా సీతారామ కల్యాణ దినోత్సవముగాకూడా పండుగు జరుపుకొనుచున్నాము. దేవీ నవరాత్రులు శరదృతువులో జరిగినట్లే వసంతఋతు వులో వసంత నవరాత్రులు లేక రామ నవరాత్రులు, ఉగాదినుండి రామనవమి వరకు, రామాయణ కావ్యామృత పాన ముతో, పెక్కుచోట్ల జరుపబడును. ఆది కవిగా, కవికుల బ్రహ్మగా వాల్మీకి లోక మున కొనరించిన ఉపకారము అమర మైనది. కవికోకిల వాల్మీకి రామనామ మనెడు మధువుత్రాగి, మత్తెక్కి కవితా శాఖయందు లరారుచుండెడివాడు. సంసార మనెడి విషవృక్షమునకు రెండేరెండు అమృతఫలములు- "కావ్యామృత రస పానము, సజ్జన సాంగత్యము" అని పంచతంత్రములో చెప్పబడినట్లు కావ్యా మృత రసాస్వాదనము చేయవలెనన్న రామాయణమునకన్న మిన్నయగు కావ్యము మరియొకటి లేదుకదా!

కాళిదాస మహాకవి వాల్మీకి రామా యణముచే ఎంతయో ప్రభావితుడయి నట్లు కాళిదాసు కృతులలో పెక్కుచోట్ల కానవచ్చును. కాళిదాసు రామాయణ మును ప్రతిదినమును పారాయణము చేసి అందలి కవితారీతుల నాకళింపు చేసి కొనినవాడు. రఘువంశ మహాకావ్యము యొక్క ఆరంభములో కాళిదాసు తన నొక మందునిగా, అందని మ్రానిపండ్లకు అఱ్ఱులుచాచు వామనునివలె కవి యశ స్సును పొందుటకు పరిశ్రమించుచుంటినని చెప్పుచు —

"అథవా కృత వాగ్ద్వారే
వంశేఽస్మిన్ పూర్వసూరిభిః
మణౌ వజ్ర సముత్కీర్ణే
సూత్రస్యే వాస్తిమే గతిః"

అని చెప్పును. ఒకవేళ కవి యశస్సును పొందుటకు నేనొకింత యత్నము చేసినను ఆ యత్నము ఇంతకుపూర్వము మహా కవులచే ఏర్పరుపబడిన వాగ్ద్వారములోనే జరుగుననియు, మణులలో రంధ్రములు పూర్వకవు లొనర్పగా మణులను గూర్చు దారమువంటిదే తన యత్నమనియు చెప్పెను. పూర్వకవు లనగా ఇచ్చట అవశ్యముగా వాల్మీకినే కాళిదాసు ఉద్దే శించి వ్రాసెను. కాళిదాసు మేఘసందేశ మును రామాయణమునందలి హనుమ త్సందేశమును దృష్టియందుంచుకొనియే వ్రాసెనని మేఘసందేశమునందలి:-

"జనకతనయా స్నానపుణ్యోదకేషు॥"
"ఇత్యాఖ్యాతం, పవనతనయం,
మైథిలీవోన్ముఖాసా॥"

ఇత్యాది శ్లోకములవలన తెలియుచున్నది.

ఇక వర్ణనలలో ఎన్నియో చోట్ల రామాయణ ప్రభావము కాళిదాస కావ్యములలో గానవచ్చును. ఈ విధ ముగా వాల్మీకికి, కాళిదాసు పరోక్ష శిష్యుడుగనున్నాడు.

ప్రకృతి వర్ణనమునందు వాల్మీకి భావనాప్రపంచమునం దత్యున్నత శిఖర

ముల నందుకొని, అద్వితీయు డయ్యెను. అరణ్యకాండమునందలి హేమంతఋతు వర్ణనమును మచ్చునకు పరిశీలింతము :-

"రవి సంక్రాంత సౌభాగ్యః
తుషారావృతమండలః
నిశ్వాసాంధ ఇవాదర్శః
చంద్రమా న ప్రకాశతే
సేవమానే దృఢం సూర్యే
దిశమంతక సేవితామ్
విహీన తిలకేవ స్త్రీ
నోత్తరా దిక్ప్రకాశతే
ఏతే హి సముపాసీనా
విహంగా జలచారిణః
నావగాహంతి సలిలం
అప్రగల్భా ఇవాహవమ్"

(హేమంతఋతువులో సూర్యోదయ కాలమున, చంద్రబింబము యొక్క సౌభాగ్యము సూర్యునికి సంక్రమించినది. చంద్రమండలము మంచుచే ఆవరింపబడినది. నిశ్వాసముచే వస్తు ప్రతిబింబ శక్తిని కోల్పోయిన దర్పణమువలె చంద్రుడు, ప్రకాశించుట లేదు. దక్షిణదిశలో సూర్యుడు ప్రకాశించుచుండగా, ఉత్తరదిశ విహీనతిలక యగు స్త్రీవలె శోభావిహీన యయినది.

జలచర పక్షులుగూడ, అసమర్థులు యుద్ధములో దిగజాలనట్లే, జలములో మునుగలేకున్నవి.

ఇట్లు రామాయణము, భారతీయుల సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థలయొక్క నిజస్వరూపమును తెలుపుచున్నది. రాజులు సత్యప్రతిజ్ఞ కలవారు, దండముచే ధర్మరక్షణము చేయువారు అనిచెప్పబడినది. పత్నీ సహాగమనము, పాతివ్రత్యము, పతిప్రేమ, ఏకపత్నీ వ్రతము, సౌభ్రాత్రము మొదలగు సంసారిక విషయములు విపులముగా నీ మహాకావ్యమునందు కన్నులకు కట్టినట్లు వర్ణింపబడినవి.

రామ జన్మదినోత్సవ సందర్భమున, రామాయణ మహాకావ్యమందలి కొంత భాగమునైనను చదివి ఆనందింపగలుగుట, రాముని దివ్యచరితమును మననము చేసికొనగలుగుట మన భాగ్యము.

"యావత్ స్థాస్యం తిగిరయః
సరితశ్చ మహీతలే!
తావద్రామాయణ కథా
లోకేషు ప్రచలిష్యతి॥"

(భూమండలమునందు పర్వతములు నదులు ఎంతకాలమువరకు ఉండునో అంతకాలము రామాయణకథ లోకములన్నిటియందును శాశ్వతముగా ప్రవర్తిల్ల గలదు.)

పై విషయములను పరిశీలించినప్పుడు, వాల్మీకి మహాముని శ్రీరామచంద్రమూర్తికి దేవత్వముతోపాటు ఆదర్శ మానవత్వమునుగూడ చిత్రించి లోకమునకు మహోపకారమును చేసెనని తెలియుచున్నది.



---

(18వ పేజీ తరువాయి)

ఆగృహిణికి నేను ఆరోజు ఉల్లిపాయ తిననని చెప్పడంవల్ల నాకు ప్రత్యేకంగా పెట్టవలసొచ్చింది, ఉల్లిపాయలేని పదార్థాలని, ఒకావిడ నాతో "చూడమ్మాయీ, మనకి నీమా లుండడం మంచిదే కాని ఇలాటప్పుడు ఒకర్ని ఇబ్బంది పెట్టి, మన నీమం జరిపించుకోడం మంచిది కాదు. నాకు శనివారం ఉంది. కాని ఎవరింటికైనా వెడితే మామూలుగా భోజనం చేస్తాను. పెళ్ళిళ్ళలో కూడ అందరితో భోజనం చెయ్యక వారం ఉంచనేవాళ్ళకోసం ప్రత్యేకం మళ్ళీ ఏదో ఒకటి చెయ్యవలసి వస్తుంది. ఒకరిని ఇబ్బంది పెట్టేభక్తిని భగవంతుడు మాత్రం మెచ్చుతాడా? ఇలా చెప్పేనని ఏమీ అనుకోకు" అంది. ఆవిడసలహా నాకు చాలా నచ్చింది. మీకూ్కడా నచ్చా లని నాకోరిక. మరొక విషయం. కొందరు ఎంగిలి చేసి పారేసినవన్నీ జాగ్రత్త పెట్టి ముష్టివాళ్ళకీ బీదవాళ్ళకీ పెడతారు ఇది చాలా ఘోరం. ఊరికే వృథాగా పారేసేకన్నా వాళ్ళకి పెడితే కళ్ళకద్దుకు తింటారు అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతారు. ఆకలి దహించుకుపోతుంటే ఎంగిలి పెట్టినా తినడంలో ఆశ్చర్యం లేదు. కాని మనం ఎంగిలి చేసి వృథా చెయ్యకుండా వాళ్ళకి శుభ్రమైనదే పెడితే మంచిది. ఒక్క మిరపకాయ చల్దికూటిలో నంజుకుందుకిమ్మంటే మిరపకాయలు ప్రియంగా ఉంటే దానం కూడా ఎక్కడ చెయ్యగలం అనేవారే గుప్పెడుమిరపకాయలు దిష్టి తీసి కుంపట్లో పొయ్యడానికి సంకోచించరు.

ఏది అవసరమో ఏది అనవసరమో ఎవరికి వారు బాగా ఆలోచించుకుని మంచి అలవాట్లు చేసుకోవాలి. ఇంట్లో ఏ ఒక్కరికో ఉంటే చాలదు. అందరికీ మార్పు రావాలి.



# చార్ మినార్ ప్రపంచములో



# అత్యధికముగా అమ్మకమగుచున్న



# సిగరెట్లలో ఒకటి! ఎందువలన?

# కారణం వజీరు సుల్తాన్

ఈ ప్రశ్న చార్ మినార్ ను కాల్చేవారి నెవరినైన అడగండి. "[illegible]" అని సమాధానం వస్తుంది. ఈ [illegible], అద్వితీయమైన రుచి యీ చార్ మినార్ లోనికి [illegible]? వజీరు సుల్తాను టుబాకో కంపెనీ లిమిటెడ్ [illegible] విశ్వసనీయ [illegible] సాంప్రదాయికమైన [illegible] [illegible] అనుమానమైన రుచి. చార్ మినార్ కోసం [illegible] ప్రారంభం [illegible] [illegible] మిశ్రమం చేయుదురు. [illegible] చార్ మినార్ కు ప్రత్యేకమైన [illegible] అద్వితీయమైన [illegible] [illegible]. ప్రపంచమంతటా అమ్మకంలో అగ్రస్థానమలంకరించిన చార్ మినార్ సిగరెట్లు [illegible] కోట్ల [illegible].
చార్ మినార్ వంటిది వేరొకటి లేదు—భారతదేశంలో ఘనమైన సిగరెట్.




ది వజీరు సుల్తాను టుబాకో కంపెనీ లిమిటెడ్.

భారతదేశమందు ఘనత వహించిన సిగరెట్ నిర్మాతలు!

CAS/VS-1



కేంద్ర వాణిజ్యశాఖ మంత్రి శ్రీ మనూభాయిషా, మార్చి 6 వ తేదీన ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల మండలి సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.



ఫిబ్రవరి 28 న బేగంపేట విమానాశ్రయంలో అరబ్ లీగ్ ప్రధాన కార్యదర్శి శ్రీ అబ్దుల్ ఖలీక్ హస్సౌనాకు పబ్లిక్ వర్క్స్ మంత్రి శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి స్వాగతం చెప్పారు.



శ్రీ అబ్దుల్ ఖలీక్ హస్సౌనా, ఫిబ్రవరి 28 న గవర్నరును కలిసి నప్పటి దృశ్యం.



శ్రీ అబ్దుల్‌ఖలీక్ హస్సానా, ఫిబ్రవరి 28 న ముఖ్యమంత్రిని కలిశారు.



ఐరిష్ రాయబారి శ్రీ విలియంవార్నోక్, ఫిబ్రవరి 11 వ తేదీన హైదరాబాదు విచ్చేశారు.



ఐర్లాండ్ రైతుల తరపున శ్రీ ఆర్. జి. లివింగ్‌స్టన్, ఫిబ్రవరి 12 న జర్సీ, కెర్రీ వృషభాలను, పబ్లిక్‌వర్క్స్ మంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డికి అందజేశారు.



గవర్నరు, మార్చి 7 న ప్రదర్శన మైదానములో రెడ్‌క్రాస్ ఉత్సవానికి ప్రారంభోత్సవం చేశారు.



ముఖ్యమంత్రి మార్చి 6 న కాచెడన్‌లో ఆరామ్‌ఘర్ భవనానికి పునాదిరాయి వేశారు.

భారతదేశంలో జపాన్ కౌన్సిల్ జనరల్ శ్రీ యస్. తకాసే, మార్చి 1 న రాజభవనంలో ఆంధ్రప్రదేశ్ గవర్నరును కలిశారు.



గవర్నరు, ఫిబ్రవరి 24 న రేడియం సంస్థ, క్యాన్సర్ ఆసుపత్రులను సందర్శించారు.





ఆర్థికమంత్రి డాక్టర్ యం. చెన్నారెడ్డి, ఫిబ్రవరి 24 న 1966-66 సంవత్సరపు బడ్జెటును శాసనసభకు సమర్పించారు.

ఆర్థిక శాఖామంత్రి డాక్టర్ యం. చెన్నారెడ్డి, ఫిబ్రవరి 23 న ఆంధ్రప్రదేశ్ చర్మకారిక సలహామండలి సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.





డాక్టర్ యం. చెన్నారెడ్డి, ఫిబ్రవరి 18 న హయాత్‌నగర్‌లో బ్లాక్ మేలాకు ప్రారంభోత్సవం చేశారు.

ఆర్థికమంత్రి, ఫిబ్రవరి 16 న హైదరాబాదు జిల్లా, మేడ్చల్ బ్లాకులోని ముదిచింతలపల్లి గ్రామంలో గాంధీ విగ్రహాన్ని ఆవిష్కరించారు.



# నగరంలో రష్యా పార్లమెంటరీ ప్రతినిధివర్గం.



ఉజ్బెక్ రిపబ్లిక్ అధ్యక్షురాలు శ్రీమతి యాడ్గిర్ నస్రిద్దినోవ నాయకత్వాన మార్చి 1 వ తేదీన నగరానికి విచ్చేసిన పదిమంది సభ్యులు గల రష్యా పార్లమెంటరీ ప్రతినిధివర్గం.

మార్చి రెండవతేదీన విధానసభ సమావేశం జరుగుతున్న సందర్భంలో ముఖ్య అతిధుల గేలరీలో కూర్చుని సమావేశాన్ని తిలకిస్తున్న పార్లమెంటరీ ప్రనిధివర్గం.





పత్రికా విలేఖరులతో పార్లమెంటరీ ప్రతినిధివర్గం.



ప్రతినిధివర్గం నాయకురాలితో గవర్నరూ, గవర్నరు సతీమణి.



ప్రతినిధివర్గం మార్చి 2 వ తేదీన గవర్నరును కలుసుకున్నప్పటి దృశ్యం.





ఉజ్బెక్ దేశపు రంగురంగుల వస్త్రాలను ప్రతినిధివర్గం **నాయకురాలు** ముఖ్యమంత్రికి బహూకరించినప్పటి చిత్రం.



మార్చి 2 వ తేదీన శాసనమండలి అధ్యక్షుని ఆయన కార్యాలయం కలుసుకున్న పార్లమెంటరీ ప్రతినిధివర్గం. "ఇరుదేశాలమధ్య సోదర సత్సంబంధాలు నెలకొనాలంటే యీ విధమైన సుహృద్భావ పర్యటనలు యింకా అధికంగా వుండాలి."



సభాపతితో ప్రతినిధివర్గం.



విధానసభ సభాపతి, శాసనమండలి అధ్యక్షుడు యిచ్చిన విందులో పార్లమెంటరీ ప్రతినిధివర్గం. న్యాయశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహ రావును కూడా యీ చిత్రంలో చూడవచ్చు.



భారతీయ దుస్తుల్ని ధరించిన ప్రతినిధివర్గంలోని ఒక సభ్యురాలికి విధానసభ సభాపతి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి పుష్పమాల వేస్తున్న దృశ్యం.



ప్రతినిధివర్గం నాయకురాలికి విధానసభ సభాపతి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి బిద్రీవస్తువు నొకదానిని బహూకరిస్తున్న దృశ్యం.



సాంఘిక సంక్షేమ మంత్రిణి శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మితో భారతీయదుస్తుల్లో ప్రతినిధివర్గ మహిళలు.



శాసనమండలి అధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య ప్రతినిధివర్గం నాయకురాలికి బహుమతిని అందిస్తున్న దృశ్యం.



శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యతో ప్రతినిధివర్గ మహిళలు.

# 'ఆంధ్రప్రదేశ్'

## తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు మాసపత్రిక ప్రకటనరేట్లు

దిగువ రేట్ల ననుసరించి 'ఆంధ్ర ప్రదేశ్' మాస పత్రికలో ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | నాలుగు సంచికలలో | | | ఒక సంచికలో మాత్రమే | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తిపేజీ | సగంపేజీ | పావుపేజీ | పూర్తిపేజీ | సగంపేజీ | పావుపేజీ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| లోపలి పేజీ | 300 | 150 | 100 | 100 | 55 | 30 |
| వెనుక అట్టపేజీ (4) | 400 | — | — | 160 | — | — |
| అట్ట 2, 3 పేజీలు | 350 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కాంట్రాక్టు ప్రకటనలకు 20 శాతం రిబేటు ఇవ్వబడును.

### నిబంధనలు

1. మెకానికల్ వివరాలు : 10½" × 8¼" డెమ్మీ
2. ముందుఅట్ట టైటిల్ పేజీపై ప్రకటనలు స్వీకరించబడవు.
3. పావు పేజీకి తక్కువగా ఉన్న ప్రకటనలు స్వీకరించబడవు.
4. వచ్చే సంచికలో ప్రచురించడానికి వీలుగా స్థలం వివరాలు, డబ్బుతోసహా ప్రకటన సమాచారాన్ని ప్రతినెల 8 వ తేదీలోపుగా యీ కార్యాలయానికి పంపాలి. క్రాస్ చేయబడి డిమాండ్ డ్రాఫ్ట్ద్వారా గానీ, మనియార్డరు ద్వారా గానీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధముల శాఖ డైరెక్టరు, హైదరాబాదు పేర డబ్బును పంపాలి.
5. బ్లాకుల విషయంలో అన్నివిధాలా శ్రద్ధ తీసుకోబడుతుంది. అయితే మెషనుపై బ్లాకు పగిలిన యెడల యీ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన పాఠం, స్థలం వివరాలను ఒక సంచికలో ప్రకటించాలో (భాషను తెల్పాలి) లేక 4 సంచికలలో ప్రకటించాలో స్పష్టంగా పేర్కొనాలి.
7. డబ్బు చెల్లింపు, యితర ప్రత్యుత్తరాలను దిగువవారితో జరుపాలి :—

డైరెక్టర్,
సమాచార పౌరసంబంధాల శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
**హైదరాబాద్-1.**

(ఆఱవ యధ్యాయము)

దర్పమల్లుఁడు తన సైన్యమును గాంధార రాజ్య ముఖ్యనగరమును జేర్చుట కష్టమయ్యెను. మిహిరకులుఁడుఁ తన మార్గము నెట్లు తీర్చికొనుచుఁ బోయెనో యట్లు దర్పమల్లుఁడుఁగూడఁ జేయుటకు స్వాతంత్ర్యమున్నచో నతనికి సుఖముగా నుండెడిది. మిహిరకులుఁడు తాను విజయమించికొన్న దేశముల నెట్లు నిష్కంటకము చేసెనో దర్పమల్లుఁ డట్లు చేసెడివాఁడు. మిహిరకులుని యాజ్ఞ లేదు. మిహిరకులుఁ డట్లేందుకు చెప్పెనో దర్పమల్లునకుఁ దెలియును. తొలుత గాంధారరాజ్య ముఖ్యపట్టణము రక్షింపఁబడవలయును. గాంధార రాజవంశము చెక్కుచెదరకుండ నుండవలయును. గాంధారరాజు భద్రముగా నుండవలయును. ఆ రాజునకు మొప్పము కలిగినచో రాణి హృదయము స్రుక్కిపోవును. ఆమె ధైర్యము నశించును.

దర్పమల్లున కింకొకటి తెలియును. కల్యాణవతి వివాహము చేసికొనుట తండ్రికిష్టములేదు. ఆమె పెండ్లియాడినచోఁ దమ రాజవంశమునకు సంబంధముకల క్షత్రియుఁడైన యొక మహాధికారినిగాని వాని కుమారునిగాని యామె పెండ్లియాడవలయును. వాఁడు రాజగును. వాఁడు రాజ్యరక్ష చేయును తరువాత తన దౌహిత్రునకీ రాజ్యము సంక్రమించును. కాని కల్యాణవతి మిహిరకులుని ప్రేమించెను. మిహిరకులుఁడు గాంధార రాజ్యముమీఁదికి దండెత్తిపోవకముందే యతనిమీఁదఁ గల్యాణవతికి మనస్సు కలదు. దండెత్తివచ్చి దుర్గముతరువాత దుర్గము గెలుచుచుండగా నామె యాపని చేసెను. అట్టి తండ్రిని వదలివచ్చినందుకుఁ గల్యాణవతి మనసులో నెంతైన స్రుక్కుపడుచుండును. ఆ తండ్రి కాపద కలిగినచో నతని మరణమునకుఁ దానే హేతు వనుకొనును. ఆమె నోదార్చుటకే వీలులేదు. దర్పమల్లున కింకొకటి తెలియును. శ్రీకల్యాణవతి వచ్చినది. మిహిరకులుని యందు మార్దవము తెచ్చినది. దర్పమల్లుఁడు మిహిరకులుని వాని యెనిమిదవయేటనుండి యెఱుఁగును. అప్పుడే యతఁడు దుస్సాహసుఁడు. అతని కప్పుడు పదియేండ్లు. ఒక యేనుగు మదించి యంకెకు రాకుండ నుండెను. ఘీంకరించు చుండెను. దాని చుట్టుపట్ల నెవ్వరును చేరరాకుండ నుండెను. దాని వెనుగాళ్ళకు వదుమునకుఁ బెద్దపెద్ద గొలుసులు వేసి దూరదూరముగా నేలలో బెద్ద యినుపకమ్ములు కట్టి వానికి బిగించిరి. అది యటునిటు లాగి ప్రక్కనున్న గొలుసులను త్రెంచుచుండెను. వెనుగాళ్ళ గొలుసులు దానికి సాధ్యమగుట లేదు. ఒకనాటిరాత్రి సైనికు లెక్కువమంది లేనపుడు మిహిరకులుఁడు తన గదినుండి దొంగతనముగా వెలికి వచ్చి గుఱ్ఱముమీఁద దాని వెనుకభాగమున నిలుచుండి యేనుగు

విశ్వనాథ సత్యనారాయణ

కుంభస్థలమునకుఁ జేరెను. దాని నేమిచేసెనో యెచట పొడిచెనో తెలియదు: చుట్టునున్న రక్షక భటులకు దాని విపరీతఘీంకారావము లర్థముకాక పోయి చూచిరి. భయపడిరి. ఆ కుఱ్ఱవాఁడు యువరాజని వారికిఁ దెలియ లేదు. పోయి సేనాపతులతోఁ జెప్పిరి. రాజు, మంత్రులు, సేనానులును వచ్చిరి. మిహిరకులుని గుర్తుపట్టిరి. తండ్రికి బ్రాణము పైన పోయెను.

అప్పటి కేనుఁగు పగము శాంతించెను. మిహిరకులుఁడు సైనికులతో గొలుసులను ఛేదింపుఁ డని యాజ్ఞాపించెను. ఎవ్వరును గదలలేదు. దర్పమల్లుఁ డపుడు దూరముగా మేకులకు బిగించిన యినుపగొలుసుల నూడదీసెను. పసుకుఁనకు దర్పమల్లుని సంహరింపవలె ననిపించెను. మహాతాళవృక్షమంతటి దీర్ఘములైన బలిష్ఠములైన యా యినుపగొలుసు లూడదీయఁబడి యేనుఁగు వానిని లాగికొంచు నడుపనారంభించెను. తొండము పైకెత్తి 'కుంభస్థలమున గూర్చున్నవానిని లాగి సంహరించుటకు వీలులేదు. తుండము పైకెత్తినపుడెల్ల తుండము చివర సున్న సన్నని రంధ్రములోని మెత్తని చర్మముతో మిక్కిలి లఘువుగా సులభముగా నతఁడు దేనినో గ్రుచ్చుచుండెను. ఇట్లు పదిసారు లిడినటుకే గ్రుచ్చఁబడెను. మరల తుండము నెత్తుటకు దంతావళమునకు ధైర్యము చాలుట లేదు. ఇప్పుడు నడచుటకు నా వింకొక రెండేనుఁగులను మోయుచున్నట్లుండెను. ఆ జంతువు తా నీ బరువంతయుఁ దన కుంభమునందుఁ గూర్చున్నవానిదే యనుకొనెను. కొంత సేపటి కంకెకువచ్చెను. మిహిరకులుఁడు దానిని వెనకకుఁ ద్రిప్పెను. మరల కట్టుకొయ్యకుఁ జేర్చెను. తుండము నాశ్రయించి క్రిందికి దిగెను. ఏనుఁగ తని నేమియుఁ జేయలేదు. మరలఁ గట్టివేసిరి. అందఱకు నాశ్చర్య మయ్యెను. తరువాత నతఁడు గజమునొద్ద నిలుచుండగా దాని గొలుసుల నన్నిటి నూడదీసిరి. ఆనాటి నుండియు నది మిహిరకులుని యేనుఁగు, ఎవ్వరి నెక్కనీయదు. ఇతఁడే దాని మావటివాఁడు, దాని యజమాని; ఇట్టివాఁడు మిహిరకులుఁడు. ఈ వార్త దేశదేశములందు వ్యాపించెను.

కాశ్మీరదేశపు పండితులు కొందఱు గాంధార రాజదర్శనమునకు వచ్చి మిహిరకులుని యీ వృత్తాంతమును సభలోఁ జెప్పుచుండగాఁ గల్యాణవతి వినెను. కల్యాణవతి కప్పుడు పదునొకండవ యేఁడు. ఆమె పండితుల నడిగెను. 'మీ రాజకుమారున కప్పు డెన్నేండ్లు?' వా రప్పుడు మిహిరకులునకుఁ బదేండ్లని చెప్పిరి ఇప్పు డెన్నేండ్లనగా బదునేనేండ్లని చెప్పిరి. అది తొలుతటిసారి మిహిరకులుని విని యతనియందు రాగాంకుర మేర్పఱచుకొనిన సమయము. అప్పటికే గాంధారపతి యామెకుఁ జదువుసంధ్యలతో పాటు రాజనీతియు యుద్ధవిద్యయు నేర్పించుచుండెను. ఆ జనకుఁ డేమైన నైనచోఁ గల్యాణవతి యోర్వలేదు. ఆమె యేమైన నైనచో మిహిరకులుఁ డోర్వఁ లేఁడు.



అందుచేత దర్పమల్లుడు రాజాజ్ఞను జేసెను. అతని సైన్యము నడుచుచుండగా దోచికొనుటచేత, ధనమును ప్రోవు చేయుటచేత స్త్రీలను యథేచ్ఛముగాఁ జెఱ పట్టుటచేత మితిమీఱిపోయిన మ్లేచ్ఛులు వాని సైన్యమును వచ్చితాకుదురు. సంహరింపఁబడుదురు. దర్పమల్లుఁడు తాను రాజధాని చేరుటయే లక్ష్యముగాఁ బెట్టికొని పోవుచుండెను. ఇందులో నొకటి యున్నది.

ఈ మ్లేచ్ఛులు తొలుత మహాసైన్యముగా వచ్చినను వచ్చినప్పుడు మహాసేనాధిపతి వంటివాఁ డొకఁ డున్నను క్రమక్రమముగా వారు చీలికలై భిన్నప్రాంతములందు విడివడిపోయిరి. మిక్కిలి యెక్కువగా మ్లేచ్ఛసేన యున్నచోనది వేయిమందికంటె ఎక్కువలేదు. ఈ మ్లేచ్ఛసేనను రా జెవఁడు నడిపించలేదు. ఎవఁడో దోచికొని తినెడివాఁడు నాయకుఁడుగా నిట్లు వచ్చిరి. వారికిఁ బెద్దపెద్ద మూకలుగాఁ బోయినచో భోజనాదులు కుదురుట కష్టముగా నుండెను. వేయిదళములుగాఁ జీలిభిన్నభిన్న ప్రాంతములయందు దోచికొనుట సులభముగా నుండెను. కొన్ని గ్రామములు సులభముగాసాధ్యమగుచున్నను గొన్నింట తద్గ్రామవాసులో పట్టణవాసులో సమూహముగా నేర్పడి యెదిరించుట జరుగుచుండెను. అట్లెదిరించిన స్థలములకుఁ జిన్నదళములు పోవుటలేదు. వారికే దుర్గమును స్వాధీనము కాలేదు. వారు దుర్గములను ముట్టడింపలేదు. రాజ్యము వారికక్కఱలేదు. తండ్రిబిడ్డలు కల్యాణవతి సేనాసన్నివేశములను బరిశీలించి సంరక్షించుచున్నప్పుడు దుర్గములు సుభటరక్షితములై సైనికులు జాగ్రదవస్థయం దుండిరి. కల్యాణవతి కాపురమునకుఁ బోగా రాజునకు దుఃఖ మెక్కువయ్యెను. వైరాగ్య మెక్కువయ్యెను. దుర్గాధిపతులు, సేనాపతులు, తక్కిన యధికారులు సోమరులై లంచగొండులై ప్రజలను దోచుకొనుటయు భోగము ననుభవించుటయుగా నుండిరి. ఈ సమయము మ్లేచ్ఛులకు వీలిచ్చెను. రాజాధికారులు దోచుకొనుచుండిరి. మ్లేచ్ఛులును దోచుకొనుచుండిరి. భేదమేమున్నది. రాజాధికారులును సౌందర్యవతియైన స్త్రీనెత్తికొనిపోవుచుండిరి. మ్లేచ్ఛులు నెత్తికొనిపోవుచుండిరి. భేదమేమి?

మ్లేచ్ఛులు గ్రామములను దగులబెట్టుచుండిరి. రాజాధికారులు తగులబెట్టలేదు. కొన్నికొన్నియెడల మఱికొన్ని విచిత్రములైన సంఘటనలు జరిగెను. కొంతమంది సైన్యముతో రాజాధికారులు ప్రజలనుండి ధనము వసూలుచేయుటకు వత్తురు. అపుడు మ్లేచ్ఛులును వత్తురు. వారికి వీరికిఁ గయ్యము జరుగును. జరుగకయు పోవచ్చును. మ్లేచ్ఛులు తాము దోచికొనిన ధనములోఁ గొంత రాజాధికారుల కిచ్చి పంపించుటయు జరిగినది. బహుప్రదేశములయందలి జనులు సంసారములను లేవనెత్తికొని తూర్పుదేశములకుఁ బోఁజొచ్చిరి. ఇట్టిస్థితిలో దర్పమల్లుని సైన్యము వచ్చుచుండఁగా ప్రతిగ్రామము ప్రతిపట్టణము క్రొత్త మ్లేచ్ఛసేన వచ్చుచున్న దని భయపడఁజొచ్చిరి. వారివారిని వారు పోగా మరల ధైర్యము నందఁజొచ్చిరి. ఆనాటి ప్రజలకు వచ్చెడి ప్రాణము పోయెడి ప్రాణముగా నుండెను. ఎవఁడు స్నేహితుఁడో యెవఁడు కాఁడో ఏది గాంధారరాజసైన్యమో యేది మ్లేచ్ఛసైన్యమో ? 'దుస్తులచేత వివక్ష చేసికొనవచ్చునుగాని సైన్యమును జూచినంతనే ప్రాణములు పోయెడి ప్రజలకు దృష్టి యెక్కడిది. వివక్ష యెక్కడిది. దర్పమల్లుని సైన్యము గాంధారరాజధానిని జేరెను. రాజధాని చుట్టుపట్ల మ్లేచ్ఛుల యెద్దడి యున్నదిగాని రాజధానిలోఁ గనిపించలేదు. మ్లేచ్ఛుల దాడులు రాజధానిమీఁదఁ గూడ నొండురెండు జరిగెను. దుఃఖించుచున్న రాజు దుఃఖమును దొలఁగఁబెట్టి వైరాగ్యమును బొందిన రాజు వైరాగ్యమును దొలఁగబెట్టి నడుముకట్టి నగరములోని రాజభక్తులను పురికొల్పి కట్టుదిట్టము చేసి నగరప్రకారము దుస్సాధ్యము చేసెను. సైనికులను బంపి చుట్టుపట్ల వీలైనంత భద్రపఱచెను. కాని యాసైనికులలో నెంతఱు ప్రజలను బీడించుటకు నాల్గేండ్లనుండి యలవాటుపడినవారు ? భిన్నదుర్గముల రక్షణకు వార్తలు పంపెను. ఆ వార్తలను పరిగణించినవాఁ డెవఁడు ? రాజు రాజధానినుండి కదలలేఁడు. మంత్రులు రారు. మహాసేనాపతి రాఁడు. సేనాపతులు, చమూపతులు, దళపతులు, సేనానులు వారికి సుఖవిహారముగా నుండెను. ఈ దోచికొనెడి మ్లేచ్ఛులు దుర్గాధిపతులకు సైన్యాధికారులకు లంచములు పెట్ట నారంభించిరి. ఇది యంతయు రాజునకు దెలిసెను. తాను వృద్ధుఁడు. ఇప్పు డతని కఱువదియేండ్లు దాటెను. చాలాదినములు పుత్త్రసంతానము లేదని దిగులుపడెను. తీర్థములు సేవించెను. దేవాలయములను నిర్మించెను. అప్పుడు కల్యాణవతి కలిగినది. మరల సంతానము లేదు. ఆమె యిట్లయినది. ఆయన మనస్సులో మహీరథుఁడు వచ్చి యీ

రాజ్యమును పాలించికొనవలయు నని యుండును. మిహిరకులునకుఁ గాశ్మీరరాజ్య మున్నది. రెండురాజ్యములను బాలించికొన వచ్చును. అతఁడు మహావీరుఁడు, మహారాజనీతివేత్తయు నని ప్రసిద్ధి. కూతురు చెడిపోయిన దన్నదుఃఖము, నల్లుఁడు మరల రాలేదన్న కోపము రాజును బాధించుచుండెను. ఎవరినైన దత్తత చేసికొనవచ్చును. సమీపబంధువుల పిల్లలు చాలామంది కలరు. ఒకని బిడ్డను దత్తత తీసుకొన్నచోఁ బదిమంది మహారాజాధికారులకుఁ గోపము వచ్చును. వారు రాజ్యమునకు విరోధు లగుదురు. అప్పుడు మఱియు ననిష్టప్రాప్తి యగును.

ఇట్టిస్థితిలో దర్పమల్లుఁడు తన పదివేల సేనతో రాజధాని ముఖముగాఁ బోవుచుండెను. పదిమంది దుర్గాధిపతులు చూచిరి. వారికి బెదరు కలిగెను. మిహిరకులుఁ డేదైన వార్త నంపుచుండెనా? రాజ్యమును స్వాధీనము చేసికొనుమని మహాసేనాధిపతిని బంపించుచుండెనా? వారి కేమియు నర్థముకాలేదు. రాజు దర్పమల్లు నెఱుఁగును. కూఁతు పెండ్లినాఁ డతఁడు దర్పమల్లు నెంతో సత్కరించెను. దర్పమల్లుఁ డన్నచో గాంధార రాజున కెంతయో గౌరవము. దర్పమల్లుని యోగ్యతమీఁద వసుకులునిరాజ్యము భద్రముగా నుండెను. సుక్షత్రియుఁడు, పరమ యోగ్యుఁడు, శీలవంతుఁడు, రాజభక్తి కలవాఁడు, భారతీయధర్మరతుడు. రాజతనిని గౌరవించెను. దర్పమల్లుఁడును తన వచ్చిన పని చెప్పెను. రాజు తన రాజ్యముయొక్క దుస్థితిని నివేదించెను. రాజధాని భద్రముగా నున్నది. కనుక భద్రము చేయవలసినవి దుర్గములైనవి. దుర్గములు భద్రములు చేయకుండ మ్లేచ్ఛనాశనము చేయుటకు వీలు లేదు. దుర్గములను దాను సాధింపనక్కఱలేదు. రాజాజ్ఞతోఁ దాను సర్వదుర్గములయందు సుఖప్రవేశము చేయవచ్చును. కట్టుదిట్టము చేయవచ్చును; కాని యిపటి రాజాధికారు లందఱును దనకు సాయపడవలయును. ఎట్లు సాయపడుదురు. దర్పమల్లుఁడు రాజధానినగరమునందు నెలనాళ్ళుండెను. తొలుత భయపడిన దుర్గాధిపతులు నిట్టూర్పు తీసికొనిరి. మరల నిద్ర నారంభించిరి. దర్పమల్లుఁడు రాజధానినగరమునుండి సర్వవిషయములు తెలిసికొని మహారాజు దత్తత చేసికొనవలయునన్న విషయమును గ్రహించి దానికి యోగ్యమైన పదిరాజ్య కుటుంబములను తెలిసికొని వారితో స్నేహము చేసి, దత్తతప్రస్తావన తెచ్చుచుఁ దాను వేరువైపునకు మొగ్గక వారందఱకు నాశాజనకముగఁ బ్రవర్తించుచు నెవనికి వాఁడు తన కొడుకునకే రాజ్యము వచ్చునన్నభావములో వ్యవహరించునట్లు ప్రవర్తించుచు వారందఱు నున్నతాధికారు లగుటచేత వారి యందఱిసాయమును దీసికొనుచు రాజ్యమున కర్హత కలిగిన యా రాజకుమారులను విడివిడిగాఁ దాను నియమించుచు నొక్కొక్కప్పు డొకొక్క రాజాధికారిని వారి కుమారునితో భిన్నభిన్న దుర్గములకుఁ బోయి వానిని కట్టుదిట్టము చేయించుచుఁ బూర్వదుర్గాధ్యక్షులను దొలగించుచు నీ రాజకుమారులను దుర్గాధ్యక్షులను జేయుచుఁ బ్రత్యక్షముగా రాజుయొక్క యదుపులో నున్న దళవాయులను చమూపతులను గొందఱు సైనికులను గొనిపోయి యచట స్థాపించుచు దుర్గాధిపతులయుఁ దత్రత్యులైన సైనికులయు దుండగముల నరికట్టెను.

ఇట్లు జరుగుచుండగా ప్రజలలోఁ జాలమందికి ధైర్యము వచ్చెను. దాడులు చేసెడి మ్లేచ్ఛులవలని భయము హెచ్చెను. దర్పమల్లునకుఁ గొన్నివేలమంది రాజాధికారులు శిష్యులుగా తోచిరి. వారిని బంధించుటకుఁ దన కధికారము లేదు. వారిని శిక్షించుట కధికారము లేదు. వారి మీఁద నభియోగములు లేవలయును. వారి దోషములు ఋజువు పఱుపవలయును. శిక్షించెడివాఁడు రాజు కావలయును. లేదా మిహిరకులుఁడు కావలయును. ఆ దుర్గాధ్యక్షులలో నా రాజాధికారులలో నిండుమిండుగా నందఱు నేదోవిధముగా రాజధానినగరమున నున్న మహాధికారులకు బంధువులే యగుచున్నారు. వారి నిపుడు తా నేమైన చేసినచో రాజధానినగరముననే కల్లోలము కలుగును. అందుచేత నతఁడు దుర్గదుర్గమునందుఁ దన యొక్కొక్కనిశము నుంచెను. ప్రతిదళాధిపతియుఁ దనకు సన్నిహితుఁడు. ఇరువది పాతిక యేండ్లనుండి తనక్రింద పనిచేసినవాఁడు, తన పరీక్షల కాగినవాఁడు. మిహిరకులుఁ డనతాంతపురుషుఁ డని నమ్మినవాఁడు. రాజసేవయే తన ధర్మము గాని గొప్ప పదవియు మహాధనమును కావలయు నని వాంఛించెడివాఁడు కాఁడు. ఇట్టి నియమముల వలన చివరకు దర్పమల్లునకు మిగిలినది సగానికి సగము సైన్యము. కొన్నిచోట్ల నెక్కువ యుండని నియమింపవలసివచ్చినది. ఈ దర్పమల్లుని సైనికులు పూర్వదుర్గాధ్యక్షులను, రాజాధికారులను దుర్గమును దాటి పోనీయరాదు. ఎవరైన ప్రజలు వచ్చి యే రాజాధికారిమీఁదనైన దోషమును చెప్పినచో వాఁడు విని యూరకుండవలయును. ఇతరులు చూడకుండఁ దదభియోగముల నన్నింటిని వ్రాసియుంచుకొనవలయును. ఇట్లు దుర్గములను కట్టుదిట్టము చేసి యిది వఱకే భద్రముగా నున్న రాజధానియందుఁ





వన రెండువేలసైన్యమునుంచి మఱియు భద్రపఱచి మిగిలిన మూఁడువేలతోఁ దాను గ్రామములయందుఁ చిన్నచిన్న పట్టణము లందు భద్రత నెలకొల్పవలసి వచ్చెను. అది సాధ్యముకాలేదు. ఈపని చేయుటకే యతనికి నాలుగునెలలు పట్టెను. ఎప్పటి కప్పుడు తన రాజు తన పనిని నిర్వహించి కొని వచ్చునని యెదురు చూచు చుండెను. మిహిరకులుని వార్తలు వచ్చుచుండెను గాని మిహిరకులుఁడు వచ్చుటలేదు.

ఇట్లుండగా గాంధారరాజ్యమునకుఁ బశ్చిమమున నున్న దేశములం దెల్లెడ నిష్కరుణమైన మ్లేచ్ఛసంహారము జరుగు చున్న దని తెలిసి గాంధారమునందుఁ బ్రవేశించిన మ్లేచ్ఛులు సుమా రేఁబదివేలమంది ప్రథమమునఁ గోపము వచ్చి యేదళమున కాదళముగా నచటికిఁ బోవుటయు సంహరింప బడుటయుగా మిగిలిన నలువదియైదు నలువదియారు వేలమందిని సమకూర్చి మహాసేనగాఁ దీర్చగల నాయకుఁడు లేక యుందులోఁ గొన్నిదళములవారు కపీసము నాఁగైదువందలమందియైన చేరినగాని భద్రత లేదనుకొనినవారు కలియుటయు నొకచోట విడియుటయు దోపిళ్ళకన్న వారికిఁ దప్పించికొనిపోవుట ప్రధానలక్షణముగా నుండుటయుఁ గాఁగా దర్పమల్లుఁడు తన మూడువేలసైన్యముతోఁ జిన్నచిన్న దళములను సంహరించుచు నొకటిరెండుసార్లు తమ జాతివారిట్లు మడియుచున్నారని విని నాలుగయిదువేలమందిగా సమకూడిన మ్లేచ్ఛులు వీరి నెదిరించుటకు రాఁగా— మ్లేచ్ఛులు యుద్ధములకొఱకు సుశిక్షితులు కారు. దోపిడికాండ్రు వారు దోచికొని గుఱ్ఱములమీఁదఁ బోయి కొండలలో దాగి కొనెడివారు. దర్పమల్లుని సేన సుశిక్షితమైనది— వారు రెచ్చిపోవుచుండిరి. అరి పోవుచుండిరి. గడ్డిని మెసవుచుండిరి.

ఒకవిధముగా గాంధారరాజ్యమున శాంతి యేర్పడిన దనియే చెప్పవలయును. మిహిరకులుని క్రూరత గాంధారమునఁ దెలియనిది కాదు. కాని యా వార్తలు నాలుగేండ్ల క్రిందటివి. ఒక రాజ్యమునందలి వార్త సులభముగా సన్నిహితరాజ్యములకు జేరును. అందులో రెండురాజ్యములకు పిచ్చి పుచ్చుకొనుట యున్నచో మఱియు నీ రాజ్యమున కతఁడే రాజు కావచ్చు నన్న యభిప్రాయ మున్నచో మిహిరుని సర్వ చరిత్రము గాంధారప్రజలకుఁ దెలియుటలో నాశ్చర్యములేదు. గాంధారదేశస్థులకు వాని శౌర్య మెట్లు తెలియునో వాని క్రౌర్య మట్లు తెలియును. ఆ నాల్గేండ్ల క్రిందటి క్రౌర్య మట్లుంచి యాఱునెలలుగా వరద కటకోత్తర జ్యోతిష సింహపురీముఖ పశ్చిమరాష్ట్రముల యందు మిహిరుఁడు మ్లేచ్ఛులను, మ్లేచ్ఛుల కాశ్రయ మిచ్చినవారిని, వారితో సంబంధములు పెట్టుకొనినవారిని శిక్షించుచున్న వార్తలు కొల్లలుగా గాంధారమునఁ బ్రవేశించుచున్నవి. ఒకచోట వేయిమంది మ్లేచ్ఛులను శరణాగతులైనవారిని విరాయుధులను జేసి వేయిమందికి సంకెలలు తగిలించి త్రాళ్ళతోఁ గట్టి రెండు కొండ కొమ్ములనుండి త్రాడుగా తోరణమువలెఁ గట్టి వారి నందఱను తలక్రిందులుగా వ్రేలాడదీయించెనఁట! మఱియొకచోట పెద్ద కొండమీఁద వేయిమందిని జేర్పించి కొండ నటునిటు దూకిపోకుండఁ గత్తులతోఁ గటారులతో సైనికులను నిల్పి యందఱను వెనుకనుండి తోలి క్రింది యగాధములోఁ బడఁద్రోయించెనఁట! ఎక్కడ కనిపించిన మ్లేచ్ఛు నక్కడ పంకగాల్చిన యినుప కమ్ములలో డిగవేయించునట! మ్లేచ్ఛులతో సంపర్కము పెట్టుకొనిన స్త్రీలను హింసించిన కథలు చెప్పుటకే వీలులేదు. వారికి ముండనము చేయుటయు, వివస్త్రలను జేయుటయు, వీధులవెంట దోలుచు వేటకుక్కలను పిగొల్పుటయు. మిహిరకులుని కీర్తి యీరీతిగా గాంధారమునకు వచ్చుచుండగా గాంధారరాజభటులు లంచములు తిన్నవారు, నిద్ర పోయినవారు, పరిపాలన సరిగఁ జేయని దుర్గాధ్యక్షులు, ప్రజలను హింసించిన రాజాధికారులు గాంధారమునుండి పాఱిపోవుట యెట్లా యన్న యూహతప్ప మఱియొకయూహ లేకుండ నుండిరి. ప్రతిదుర్గమునందు దర్పమల్లుఁ డుంచిన కాశ్మీరసైనికులవలన దుర్గాధ్యక్షులుగాని తదితర రాజాధికారులు గాని పాఱిపోవుటకు వీలులేకుండ నుండెను. దర్పమల్లుఁడు దుర్గాధ్యక్షులనుమాత్రమే తొలఁగించెనుగాని తక్కిన రాజాధికారుల నెవ్వరిని దొలఁగింపలేదు. ఆ దుర్గాధ్యక్షులను గూడ రాజధానినుండి వచ్చిన సన్నిహిత రాజబంధువులను యువకులను రాజు దత్తత చేసికొనినచోఁ జేసికొనవచ్చు నన్నవారిని దుర్గాధ్యక్షులుగా నియమించెను. ఈ నూత్న రాజబంధుకుమారులు పూర్వదుర్గాధ్యక్షుల సాహాయ్యముతో వ్యవహారములను బరిశీలింపవలయును. ఉన్న స్థితియంతయుఁ జూచినచో వారు భయపడనక్కరలేదన్నట్లే యున్నది. కాని దోషాచారులైనవారి భయము భయముగానే యున్నది. ప్రజలలోఁ బలుమంది కలరు. మ్లేచ్ఛులకు భయపడి వారి కంశ యిచ్చినవా రున్నారు. మ్లేచ్ఛులు తమ

బాలికల నెత్తికొనిపోఁగా చెడిపోయిన బాలిక లెట్లును చెడిపోయి రని వారి కిచ్చి పెండ్లి చేసినవా రున్నారు. వారిలో సంసారము చేయు స్త్రీ లున్నారు. ప్రజలలోఁ బలువిధములుగా నున్నారు. వారెక్కడికిఁ బోవలయును? ఎప్పటికప్పుడు గాంధారములలోనికి నేఁడో రేపో వచ్చున ట్లుండెను. దర్పమల్లుని తీక్షణదృష్టివలన వీ రందఱు దేశమునుండి పాఱిపోవుటకు వీలులేకుండెను.

రాజు సహస్రాక్షు డైనచో రాజభటులును సహస్రాక్షు లగుదురు. రాజు ధర్మమతి యైనచో రాజాధికారులును ధర్మ బుద్ధికలవారై యుందురు. రాజు చండశాసను డైనచో నధికారులు చండశాసను లైయుందురు. అధికారుల నాఁడ నెందులకు? ప్రజలే రాజ గుణములు నలవఱచుకొందురు. రా జేధర్మము నవలంబించునో ప్రజ లాధర్మము నవలంబింతురు. అందుచేత దర్పమల్లుఁడు రాకముందు విశ్శృంఖలముగాఁ దిరుగని రాజాధికారులును రాజభటులును నిర్భయులై దోషులైనవారిని బెసగకుండఁ జేయుచుండిరి. వారు పాఱిపోవుటకు వీలులేకుండెను. గాంధారమునుండి పశ్చిమదేశములకుఁ బోవుట యెట్లును వీలులేదు. మృత్యువును మఱియు సన్నిహితము చేసికొనిన ట్లగును. పోయినచో సింధురాష్ట్రమునకుఁ బోవలయును, కాన్యకుబ్జమునకుఁ బోవలయును; మరి గంగాయమునలు ప్రవహించెడిచోటునకుఁ బోవలయును ఈ మూఁడుప్రదేశముల యెల్లలయందును పల్లెలయందుఁ బొలిమేరలందు దర్పమల్లుని యాజ్ఞ కొంచెము; పూర్వము మ్లేచ్ఛులకు లొంగనివారి యధికముగా నాఁడు వారు పొందిన బాధకుఁ బ్రతిక్రియగా వేయి కన్నులతోఁ గాచుచుండిన రాజాధికారుల వలన స్వదేశ స్వమతాభిమానము కలిగిన ప్రజలవలన మ్లేచ్ఛులుగాని మ్లేచ్ఛసంపర్కము కలవారుగాని పాఱిపోవుట కేమియు వీలులేకుండెను. పదినెలలు గడచెను. పదునొకండు గడచెను. పండ్రెండు గడచెను. మిహిరకులుఁడు రాలేదు. ఒక్కొక్క రాష్ట్రమున నతఁడు నాలైదునెల లుండుచుండెను. తా నొక రాష్ట్రమునం దుండగా వానికి దక్షిణమునం దున్న రాష్ట్రములయందు మ్లేచ్ఛులను గట్టుదిట్టములు చేయుటకు దేశాభిమానముగల ప్రజలను ప్రోవుచేయుటకు వాడిచేత మ్లేచ్ఛుల దాడుల నరికట్టించుటకుఁ దత్తద్దేశాధిపతులను మేల్కొలుపుటకు వారిని నిర్భయులను జేయుటకు నధికారులను బంపును. సేనలను బంపును. ఆ దేశమునందలి జనులకీ దేశమునందు గల బంధువులను గనుగొని వారిని బంపును.

దర్పమల్లుఁడు మహాసేనాధిపతి. తరువాత సేనాపతి పేరు నిష్కరుణుఁడు. దర్పమల్లుఁడు మిహిరునకు గుండెలు కోసియిచ్చెడి బంటైనచో నిష్కరుణుఁడు తన కుటుంబము నంతయు సంహరించి యిచ్చెడి బంటు. దర్పమల్లుడు మిహిరుని క్రౌర్యములోఁ గ్రౌర్యమును దొలఁగించి శౌర్యమును, రాజాజ్ఞయు మాత్రమే చూచెడివాఁడైనచో నిష్కరుణుఁడు వానియందుకంటెఁ గ్రౌర్యమునందే యెక్కువ యభిమానము నెఱపెడివాఁడు. రాజు తీవ్రదండుఁడు కావలయును, బంధుప్రేమ లేనివాఁడు కావలయును. ప్రజ లాజ్ఞావ్యతిక్రమము చేసినపుడు రాజు మానవుఁడు కాగూడదు, రాక్షసుఁడు కావలయును. ఇది నిష్కరుణుని సిద్ధాంతము. ఈ నిష్కరుణుని యీ మనోభావము మిహిరకులుఁ డెఱుఁగును. మిహిరకులుఁడు మిహిరకులుఁడు కానిచో దర్పమల్లుని దొలఁగఁబెట్టి నిష్కరుణుని మహాసేనాధిపతి చేసియుండును. కాని మిహిరకులుఁడు దర్పమల్లునికిఁ దెలియకుండఁ గొన్ని కార్యములు చేయును. దర్పమల్లుఁడు మిహిరకులునికంటె ముప్పది యేండ్లైనను పెద్దవాఁడు. నిష్కరుణుఁడు మిహిరకులునికంటె మూఁడునాలుగేండ్లుమాత్రమే పెద్ద.

దర్పమల్లుఁ డెప్పుడో యుద్యోగమునుండి విరమించును. అపుడు నిష్కరుణుఁడు మహాసేనాధిపతి యగును. ఈ యాశ నిష్కరుణునకుఁ గలదు. నిష్కరుణుఁడు పాతికమంది సేనాపతులలో నొకఁడు. దర్పమల్లుని తరువాతివాఁడుగా నగుటకు మిహిరకులుఁడే కారణము. మిహిరకులుఁడు రాజ్యమునకు వచ్చినంతనే వాని కీ యుద్యోగ మిచ్చెను. ఈ ఉద్యోగమునకు నిష్కరుణుని కంటె యోగ్యత కలవారు పలువురు కలరు. వారికిఁ గోపములు వచ్చెను. రాజు చేసెడి మొదటి యవనీతి యిట్లుండును సమర్థులైనవారి సమర్థతయు, యోగ్యతయు, పారంపర్యమునందిలి యౌచిత్యమును గలిగిన వారిని దొలఁగఁబెట్టి యసమర్థులను, దుర్జనులను, తన కిష్టమైన వారిని రాజా యధికారములయందు నియమించినచో సమర్థులు రాజద్రోహు లగుదురు. నిష్క్రియు లగుదురు. రాజ్యము నందలి న్యాయ్యాచరణము భంగింపఁబడును. కాని దర్పమల్లుని యాజ్ఞాముద్రచేత దర్పమల్లుని దక్షతచేత, నతనియందలి గౌరవముచేత రాజు చేసిన యీ యవినీతికి దుష్ఫలము లేకపోయెను.

నిష్కరుణుఁడును మిహిరుఁడును యుద్ధవిద్యయందు సహాధ్యాయులు. ఇతఁ డెంతటి క్రూరుఁడో యతఁ డంతటిక్రూరుఁడు. మిహిరుఁ డెంతటి కాకిచమ్మలమారియో నిష్కరుణుఁ డంత కాకిచమ్మలమారి. దర్పమల్లుఁడు లేని కాశ్మీరమునందలి మహాసేనమీఁద నేఁడు నిష్కరుణుఁ డధికారి. ప్రతి



నాల్గునెలలకుఁ బదివేల పదివేలసైన్యము తానున్నచోటికిఁ బంపుచుండవలయు నని నిష్కారుణునితో మిహిరకులుఁడు చెప్పిపోయెను. ఈ సంగతి దర్పమల్లునకుఁ దెలియదు. అట్లు నిష్కారుణుఁడు పంపిన సేన ముప్పదివేలమంది మిహిరకులుని చేరిరి. ఒక్కొక్క సేనలోఁ బాతికమంది సేనాపతులలో నొకఁడొక్కఁడు వచ్చుచుండెను. మహామంత్రి పేరు గోవర్ధనుఁడు. గోవర్ధనుని కుమారుఁడు మంఖుడు. మంఖుఁడును మిహిరకులుఁడును యుద్ధవిద్యయందును, రాజనీతియందును సహాధ్యాయులు. నిష్కారుణుఁ డెంత క్రూరుఁడో మంఖు డంత సాధువు. మంఖుఁడు తండ్రియైన గోవర్ధనుఁ డెంత నీతివేత్తయో యంత నీతివేత్త. గోవర్ధనుఁడు వసుకులుని విష్ణ్వంశసంభూతుఁ డని నమ్మినవాఁడు. యుధిష్ఠిరుని యవతార మని నమ్మినవాఁడు. భీమార్జునులు లేకుండ యుధిష్ఠిరుఁ డేమిచేయఁగలఁడు. అందుచేత మిహిరకులుని మంఖుఁడు భీముని యవతార మని నమ్మెను. వారి యిద్దఱి స్నేహము చెఱుపరానిది. అయినను మంఖున కొకటి తెలియదు. ఆ మిహిరకులునకుఁ గోపము వచ్చినచోఁ బ్రాణమిత్ర మైన తనైనఁ జంపును. దానికి నతఁడు సిద్ధపడియేయుండును. కాని యతని యసుయాయిత నిర్దుష్టమైనది. నిష్కళంకమైనది. ఇట్లు మిహిరకులుఁడు పాతికవేల సైన్యమును దీసికొని దండయాత్ర వెళ్ళగా ప్రతినాల్గునెలలకుఁ బదివేల బదివేల సైన్యము పోవుచుండగా స్వరాష్ట్రరక్షణార్థము కావలసిన సైన్యము తక్కువ కారాదు. ఆ సైన్యము నచ్చట నిచ్చటను సమకూర్చుచుండనే వలయును. ఆ పని మంఖునిది. నిష్కారుణుని సాహాయ్యముతో నతఁ డా పని చేయుచుండవలయును. కాశ్మీరదేశమునఁ బదాతిసైన్యమునకుఁ దంత్రిణి యని పేరు. ఈ పేరును సృష్టించినది మంఖుఁడు. తరువాతఁ దరువాత సర్వదా పదాతిసైన్యమునకీ పేరు స్థిరపడిపోయినది.

ఈరీతిగా నచట సైన్యము సమకూర్పఁబడుచున్నది. ఇచట మిహిరకులుని దండయాత్ర కొనసాగుచున్నది. ఏడాది గడచినది. దర్పమల్లుఁడు రాజు గాంధారమునకు వచ్చునని నిత్యప్రతీక్షాదగ్ధలోచనుఁ డగుచుండెను. తాను స్వదేశమునకుఁ బోవుటకు వీలులేదు. రాజాజ్ఞ లేదు. గాంధారమునందుఁ దాను చేసెడి పనిలేదు. ఒక నూత్నవ్యవస్థ చేసినవాఁడు తాను పైపరామరిక చేయకుండనున్నచోఁ దద్వ్యవస్థాగత సూక్ష్మాంశములు తీవ్రదృష్టులుకాని స్వల్పమతులైన యధికారులచేత విచ్చిపోవును. దర్పమల్లుఁడు గాంధారమునుండి వెడలిపోవుటకు దీనివలన సాధ్యమగుటలేదు. తొలుతనే మిహిరకులుఁడు దర్పమల్లునితోఁ జెప్పెను. 'నేను పదిచోట్ల నుందును. నీవు నాకు వార్త పంపనక్కఱలేదు. నీకు విధించిన విధిని నీవు నిర్వర్తించుచుండుము. అహో రాజధర్మము వేఱు. గృహస్థధర్మము వేఱు. గృహస్థధర్మములో విద్యాబుద్ధులచేత వయసు చేత వృద్ధుఁడైనవాఁడు గౌరవార్హుఁడు. రాజధర్మమునందు విద్యాబుద్ధులకు వయస్సునకుఁ బ్రాధాన్యములేదు. అధికారమునకే ప్రాధాన్యము. అయినను దర్పమల్లునకుఁ గాశ్మీరమునుండి తన కుటుంబ వర్తమానములు వచ్చుచునే యుండెను. ఒకరాజు పరదేశముమీఁద దండెత్తినచో నతఁడు నతని మంత్రులు సేనాపతులు కుటుంబములతోఁ బోదురు. జైత్రయాత్ర చేసి తిరిగి వచ్చువఱకు నాలుగేండ్లయినను పుత్రమిత్రాదిక విరహముండదు. దండయాత్ర కాదు, దండయాత్ర కాకపోలేదు - మఱియు నాల్గునెలలు గడచెను.

మిహిరకులుఁడు భారతదేశమునకుఁ బశ్చిమదిశయం దున్న సర్వరాజ్యములను నిష్కంటకము చేసెను. మ్లేచ్ఛరహిత మొనర్చెను. ఆవెనుక నున్న మ్లేచ్ఛదేశముల వారు వీని మహాక్రౌర్యము విని గుండెలు తల్లడిల్లిపోయి కొన్నివందల యేండ్లవఱకు భారతదేశమువంకఁ దిరిగి చూడఁగూడ దనుకొనిరి. అట్లే జరిగెను. మిహిరకులుని తరువాతఁ బదునేనువందల యేండ్లవఱకు ననఁగాఁ గలి ప్రవేశించిన తరువాత నాల్గువేల యేండ్లవఱకుఁ గ్రీస్తుశకము పదివందల యేండ్లు దాటువఱకు మ్లేచ్ఛులు భారతదేశముమీఁదికి దండెత్తిన జాడ లేదు. మిహిరకులుఁడు తదితరదేశములందుఁగూడ మ్లేచ్ఛులను యథాపూర్వముగనే సంహరించెను. వారి సంపర్కము పెట్టుకొనినవారిని యథాపూర్వకముగనే హింసించెను. మిహిరకులుఁడు చేసిన దిదియొక్కటియే కాదు. ఆయా దేశములకు రాజులున్నారు. వారిని పట్టికొని శిక్షించెను. రాజులు భోగపరాయణులగుటకా? దుర్గముల ద్వారములు మూసి లోన వెలయాండ్రతో గాయకులతో ద్రాక్షారసములు ద్రావి యధేచ్ఛముగా విహరించుటకా? ప్రజలను బాలించుటలేదు. వారికిఁ గావలసిన సదుపాయములు చేయుటలేదు. నదులు పొంగివచ్చినచో నడ్డుకట్టలు కట్టుటలేదు. ధర్మాచరణము చేయుటలేదు. బ్రాహ్మణులచేత యజ్ఞయాగాదికర్మలు చేయించుటలేదు. చెరువులకుఁ గట్టలు కట్టి కాలువలు త్రవ్వించి పొలములకు నీరు ప్రవహింపఁజేయుటలేదు. అధర్మమును మాన్పించుటలేదు. ధనవంతులు పేదవారిని హింసింపకుండఁ జేయుటలేదు. విద్యాబుద్ధులు నేర్పించుటలేదు. ఈతిబాధలు వచ్చినచోఁ బ్రజలకు సాయపడుటలేదు. ఆహారధాన్యముల ధరలు పెరిగినచో వాని హేతువులను గనిపెట్టి నివారించుటలేదు. ప్రజలకుఁ బండినదైన నెండినదైన ప్రతిచిన్ని వస్తువుపైనను పన్నులు వేసి యా ధనముతోఁ ద్రావి తందనాలాడుటకా? రాజాధికారులచేత సామాన్యజనులు పొందు హింసలను వృద్ధిపొందించుటకా?

ఇట్లు పలువిధములుగాఁ దద్దేశాధిపతులను నిందించి, మఱియు నసమర్థులైనచోఁ దొలఁగించి యా రాజవంశీయులలో సమర్థులైనవారిని రాజులుగా నియమించి యెచట

కచట సైన్యములను ప్రోవుచేయించి దుర్జనులైన మంత్రులను, రాజాధికారులను తొలగించి యసమర్థులైన సేనాపతులను సంహరించి సమర్థుఁడు, రాజభక్తుఁడు, శౌర్యవంతుఁడు, సుత్సాహవంతుడు, క్రియావంతుఁడునైన వానినెన్ని మహాసేనాధిపతిగాఁ జేసి రాజ్యముల నెచ్చటనచ్చట భద్రపఱచి ముందునకు సాగిపోవుచుండెను. ఓహో! ఏమి మిహిరకులుఁడు! భీముఁడును యుధిష్ఠిరుడును గలిసినమూర్తి ఆనాఁడు రెండుధర్మములు విడి విడిగానిద్దఱు పురుషులుగా నుద్భవించెను. ఇప్పు డొకఁడుగా నుద్భవించెను. వృద్ధులైన బ్రాహ్మణు లిట్లు చెప్పికొనదొడగిరి. 'ఇతడు భీముడును యుధిష్ఠిరుండుఁ నన్నమాట నిజమే. కాని వీనిలో దుశ్శాసనుఁడు కూడఁ గలఁడు' మిహిరకులుఁడు పోయినంత మేర ధర్మరాజ్యమును స్థాపించుచుండెను. ధర్మ రాజ్యమనఁగా యుధిష్ఠిరుఁడు నిర్మించిన రాజ్యాంగమువంటి రాజ్యాంగము గల రాజ్యము. భారతదేశమున రామాయణకాలము నుండి భారతకాలమువఱకు నొక రాజ్యాంగము నిర్మింపఁబడియుండెను. ఈ భారతదేశమునందలి సర్వకావ్యములయందు నీ యుధిష్ఠిరనిర్మితమైన, లేనిచో యుధిష్ఠిరుని చేతఁ దిరిగి సముద్ధరింపఁబడిన రాజ్యాంగవ్యవస్థయే వర్ణితమైయున్నది. ఈ రాజ్యాంగవ్యవస్థ కాశ్మీరమునందుఁ దొలినాటి నుండియుఁ గలదు. అది గోనందునినాటిది. గోనందునితరునాత కాశ్మీరరాజ్యము కొంత యెగుడుదిగుడులకు లోనైనను జలౌకుఁడన్నమహారాజు కాలమునకు సంపూర్ణముగా సముద్ధరింపఁబడెను. మిహిరకులుఁడు మూఁడవ గోనందుని వంశములోనివాడు. జలౌకుడు మూఁడవగోనందునకు నైదుతరాల పూర్వుఁడు. ఆ జలౌకుఁడు ప్రతిష్టావంతుఁడు మహాపురుషుఁడు సిద్ధపురుషుఁడు. అతని ప్రతిష్ఠ విని దేవతలే యచ్చెరువు నందిరి. అతని హస్తమునందుఁ బరుసవేదియుండెడిదఁట. అతఁడును మ్లేచ్ఛులను సంహరించెనని నేటికిని ప్రథకలదు. ఆ జలౌకుఁడు మ్లేచ్ఛులను నాశనముచేసిన స్థలము పేరు 'ఉజ్ఝటడింబ' మని చెప్పుదురు. ఆయన కాశ్మీరమున ధర్మరాజు చేసిన రాజ్యాంగ వ్యవస్థను సముద్ధరించి నిలబెట్టెను. దానిని మూఁడవగోనందుని తరువాతివా రందఱు సశ్రద్ధాకముగ నిలబెట్టుచుఁ బరిపాలించుచు వచ్చిరి.

ఆరోజులలో నీ రాజ్యాంగవ్యవస్థలకుఁ దీర్థము లని పేరు. ఇందులో మొదటివాఁడు మంత్రి, రెండవవాఁడు పురోహితుఁడు, మూఁడవవాఁడు యువరాజు, నాల్గవవాఁడు సేనాపతి. సేనాపతి యనఁగా సర్వసేనాధిపతి. అయిదవవాఁడు ద్వారపాలకుఁడు. ఈ ద్వారపాలకుని యుద్యోగము మిక్కిలి క్లిష్టమైనది. వాఁడు దివారాత్రములు నిద్రపోరాదు. రాజప్రాసాదమునం దున్న సర్వజనుల రక్షణయు వానిచేతిలో నుండును. వాఁడు పండితుఁడు, వృద్ధుఁడు, వీరుఁడు కావలయును. రాజదర్శనము చేయుటకు వచ్చిన మంత్రి పురోహిత యువరాజ సేనాపతులనైనను వీలులేనిచోఁ గాదనఁగల ధైర్యవంతుఁడు కావలయును. వేయిమంది రాచనగరును ముట్టడించుటకు వచ్చినచో వారిని పటాపంచలు చేయగలిగిన శక్తిమంతుఁడు కావలయును. వానికి వేఱే సైన్యముండును. వారందఱు పరమరాజభక్తులు. ద్వారపాలుఁ డట్టివారినే యెన్నికొనును. ద్వారపాలకుని కున్న మర్యాద యింక నే యధికారికి నుండదు.

రాజునకుఁ దండ్రి తండ్రికాఁడు. ద్వారపాలకుఁడే తండ్రి. యువరాజునైనను మోసగించి శత్రువులు రాజును వధింపజేయవచ్చును గాని ద్వారపాలకుని వధించి గాని వానిని రాజద్రోహకార్యములకు నియోగించి, పక్షపాతము వహింపఁజేసి రాజద్రోహము చేయించుటగాని చేయరు. అది సార్వకాలిక మైన సర్వరాజ్యధర్మము. కలి ముదిరి గిడసబాఱి పుణ్యాపాపవివక్ష యను నది చచ్చిపోయినచో నట్టిది జరుగునేమో కాని మూఁడులక్షల కలియుగప్రమాణములో మూఁడు వేల సంవత్సరములైన లేత కాలములో నట్టి దెట్లు జరుగును?

అంతర్వేశికుఁ డాఱవవాఁడు, అతనికి సర్వాంతఃపురమునందుఁ బ్రవేశార్హత యుండును, ఇతనినే ప్రతీహారి యందురు. ద్వారపాలకుఁడు వేఱు. ప్రతీహారి వేఱు. ప్రతీహారులు వేదవేదాంగవేత్తలై జీవితమంతయు నిష్కళంకముగ బ్రదికిన బ్రాహ్మణపండితులై యుందురు. కారాగారాధికారి, ద్రవ్యసంచయకారి మఱి యిరువురు. సన్నిధాన యని యింకొకయధికారి, ఇతఁడు ధనభాండాగారమును నిత్యము పర్యవేక్షించువాఁడు, ప్రదేష్ట యనువాఁడు పదియవవాఁడు. అతనికి సర్వాధికారములు కలవు. శ్రుతులయందుఁ జెప్పఁబడిన ధర్మములు నిరూపించుటకు నాచరించుటకుఁ గూడ నతని కధికారము గలదు. తరువాతివాఁడు నగరాధ్యక్షుఁడు, మఱియొకఁడు కావ్యనిర్మాణకృత్తు. ఇతఁడు నేటి పురపాలక సంఘముయొక్క సర్వధర్మములకు నియంత. నగరమునందు, పట్టణములందుఁ బల్లెలయందు జనములకుఁ ద్రావుటకు నీరు, నివసించుటకు గృహములు, ఆ దేశమునందు పండనివస్తువులు పరదేశములనుండి వచ్చిన వానిని దేశమునం దన్నియెడలకుఁ బంపుట, వానిమీఁద సుంకములు విపరీతముగా నుండకుండ జూచుట, యా వస్తువులు సర్వజాతులకు నందునట్లు చూచుట, రాజ్యమునందు సర్వప్రదేశములయందు గల యీ సర్వకార్యములమీఁద నధికారి యతఁడు.

తరువాతివాఁడు ధర్మాధ్యక్షుఁడు, సర్వధర్మాధ్యక్షుఁడు రాజైనను నితఁడు రాజు క్రిందివాఁడు. ఇతనిని దాటిపోయెడి యభియోగము లేదు. ఇతనిని గూడ దాటిపోయెడి యభియోగము వచ్చినప్పుడు రాజు దానిని బరిశీలించును. నాటి కాశ్మీరదేశమున ధర్మాధ్యక్షు నతిక్రమించిన యభియోగ మెట్లుండెడి దనఁగా బ్రాహ్మణులలో న్యాయ్యము జరుగనివారో దేవాలయ

ములయందు నిరాహారదీక్ష నవలంబించెడి వారు. అపుడురాజు వచ్చి తీర్మానించెడివాడు. సభాధ్యక్షుఁడు పదునాల్గవవాఁడు. రాజ్యమును నిజముగాఁ బాలించెడివాఁడు రాజు కాఁడు. ఈ సభ పాలించెడిది. ఈ సభలో శ్రుతి స్మృతి పురాణేతిహాసకోవిదులైన వృద్ధ బ్రాహ్మణులు, నుద్యోగములనుండి విరమించి కొనిన సుక్షత్రియులైన సేనాపతులును మంత్రులును దేశమునం దున్న మహాబుద్ధి మంతులైన వృద్ధులైన న్యాయశీలురును నుండెడివారు. ఆ సభ కధ్యక్షుఁ డీ సభాధ్యక్షుఁడు. యుద్ధములు, రాజాంతఃపుర విషయములు మొదలైన కొన్నిటిని బరిత్యజించి యీ సభ సర్వాధికారము కలదిగా నుండెడిది. ప్రజాపాలన విషయమున నీ సభ తీర్చిన తీర్పేతీర్పు. దండపాలుఁ డన్న మఱియొకయుద్యోగి సైన్యము విషయమున దేశమునం దున్న చోరులు దుర్మార్గులు మొదలైన విషయముల నియామకము వీనికిఁ గలదు. రాజ్యమునందున్న ధర్మము రెండువిధములుగా నుండును. ఒకటి భూమియు, బంటలు, ధనము మొదలైన వానిని వానిది వాఁ డనుభవింపకుండఁ బొరుగువాఁడు దుర్మార్గము చేసినచో నట్టి సర్వవ్యవహారము సభాధ్యక్షుని పర్యాలోచనముక్రిందికి వచ్చును. దొంగతనములు, హత్యలు, దొమ్మి పోరాటలు మొదలైన యసాధు కార్యము లన్నింటిమీఁద దండపాలుఁ డధికారి. పదునాఱవ వాఁడు దుర్గపాలుఁడు. రాజ్యమునం దున్న సర్వ దుర్గములు వాని పర్యవేక్షణక్రింద నుండును. దుర్గములు బాగుచేయించుట, ఏ దుర్గమునం దెంత సైన్యముండవలయును? దాని రక్షణ యెట్లు? దుర్గ మెచట బలహీనముగా నున్నది? దాని నెట్లు బాగుచేయవలయును. ఈ విషయము లన్నియు దుర్గపాలునివి. మఱియు నానాఁడొక రాజున్నచో నొక రాజ్య మున్నచో నందులో రాజధాని దుర్గము కాక రాజ్య విస్తీర్ణతను బట్టి దూరమునందు దుర్గము లుండెడివి. ఆ దుర్గము చుట్టున నున్న పల్లెలు పట్టణములు తద్దుర్గాశ్రయములు. ఈ రీతిగా రాజ్యమునందలి ప్రతి పల్లెయు, ప్రతి పట్టణము నొక దుర్గమునకు సంబంధించి యుండెడివి. పన్నులు మొదలైనవి తద్దుర్గాధిపతి స్వీకరించును. ఈ దుర్గాధిపతులు రాజునకుఁ బ్రతినిధులు. వారి క్రింద సైన్య ముండును. ఒక్కొకప్పు డొక దుర్గాధిపతి దుర్గపాలుని యధికారమును మీఱి స్వతంత్రుఁడుగా వ్యవహరించును. అపుడు రాజు పోయి వాని నంకెకుఁ దెచ్చును. పదిమంది దుర్గపాలురు కలిసి, రాజద్రోహము తలపెట్టుటయుఁ జరిత్రయందుఁ గలదు. తరువాతి వాఁడు రాష్ట్రాంతపాలుఁడు. ఇరుగు పొరుగు రాజ్యముల యెల్లలు వాని సంరక్షణమున నుండును.

పదునెనిమిదవవాఁ డటవీపాలుఁడు. ఇట్టి పదునెనమండుగుర మహాధికారుల పాలనము చేత రాజ్య పరిరక్షణ చేయు వ్యవస్థ పాండవుల జ్యేష్ఠ సోదరుఁ డైన యుధిష్ఠిరుఁడు చేసెను. దానిని భారత దేశమునందుఁ గొన్ని వేల సంవత్సరములు భిన్న ప్రాంతముల రాజు లాచరించిరి. కాశ్మీరమునందా వ్యవస్థ జలౌకుని నాటినుండి సుప్రసిద్ధముగానుండెను. మిహిరకులుఁడు భారతదేశ పశ్చిమ దిశాగత సర్వరాజ్యముల యందు మ్లేచ్ఛులను నిష్కరుణముగా సంహరించి ప్రతిచోట సభాధ్యక్ష పదవిని భద్రముగాఁ జేసి ధర్మము సువ్యవస్థిత మొనర్చుచు రాజు 'తీవ్రదండుఁ డన్నచోఁ బ్రజలు భయభక్తులు కలిగి యుందు రని, భక్తి లేకపోయినను భయము ధర్మరక్షా హేతు వగునని నిర్ణయించి యా దేశములను దీర్చెను. అప్పటికి మిహిరకులుఁడు కాశ్మీరమునుండి బయలుదేరి యేడాది పైన నెనిమిది నెలలు గడచెను. కాశ్మీరమునుండి యతనిని గ్రొత్తగా వచ్చి చేరినది నలువదివేల సైన్యము మాత్రమే. తరువాత నతఁడే వలదని వార్త పంపెను. గాంధారములకు వచ్చుచున్నా నని దర్పమల్లునకు వార్త పంపెను. అతని యేఁబది వేల సైన్యములో నష్టమైనవారు పదివేల మందియే.

(సశేషం)



"రావుగారు ఈమధ్య గుఱ్ఱాన్ని పెంచుతున్నారట!"

# సత్యకామజాబాల

(ఉపనిషత్కథ)

శ్రీధరబాబు

ఒకనాడు సత్యకాముడనే బాలకుడు తల్లి వద్దకు వచ్చి యిలా ప్రశ్నించాడు— "అమ్మా! మన గోత్రం యేమిటి? నేను ఒక సద్గురువును సమీపించి బ్రహ్మచర్య దీక్ష స్వీకరించా లనుకొంటున్నానమ్మా! వారు అడిగితే మన గోత్రం పే రేమని చెప్పను?"

తల్లి సందిగ్ధంలోపడింది. అయినా సమాధానం చెప్పింది. "నాయనా! మన గోత్రం యేమిటో నాకు తెలియనే తెలియదు. నా యౌవ్వనంలో దాసీగా పనిచేస్తూ అనేక చోట్ల తిరిగాను, అనేకమందిని సేవించాను, నిన్ను కన్నాను. కాని నీ తండ్రి ఎవరో నాకు తెలియదు. ఒకటి మాత్రం సత్యం. నా పేరు జాబాల. నీ పేరు సత్యకామ. గురువర్యులు ప్రశ్నిస్తే 'సత్యకామ జాబాలుడను' నేను అని చెప్పు."

సత్యకాముడు తల్లివద్దనుండి గురువు వద్దకు పయనమయ్యాడు. అతడు గౌతమ మహర్షివద్దకు చేరుకొన్నాడు. తనను శిష్యునిగా స్వీకరింపమని అర్థించాడు. మహర్షి "బిడ్డా! నీ గోత్రం ఏమిటి? నీవు ఏ వంశంలో జన్మించావు?" అని ప్రశ్నించాడు.

సత్యకాముడు — "స్వామీ! నేను ఇంటి వద్దనుండి బయలుదేరే సమయంలోనే మా అమ్మని ఈ విషయం గురించి ప్రశ్నించాను. ఆమె ఇలా సమాధానం చెప్పింది — "నాకు తెలియనే తెలియదు. నా యౌవ్వనంలో దాసీగా పనిచేస్తూ అనేక చోట్ల తిరిగాను. అనేకమందిని సేవించాను. నిన్ను కన్నాను. కాని నీ తండ్రి ఎవరో నాకు తెలియదు. ఒక్కటి మాత్రం సత్యం. నా పేరు జాబాల. నీ పేరు సత్యకామ. గురువర్యులు ప్రశ్నిస్తే సత్యకామజాబాలుడ నని చెప్పు అన్నది ఆమె. కాబట్టి నేను సత్యకామ జాబాలుణ్ణి" అని సమాధానం చెప్పాడు.

తరువాత గౌతమమహర్షి ఇలా అన్నారు — "సత్యవాక్య పరిపాలనచేసే బ్రాహ్మణుడుకాక మరెవ్వరు యిలా ఉన్నదున్నట్లు చెప్పగలరు? నాయనా: సత్యకామా! సమిధలు సంపాదించుకొనిరా. నీకు ఉపదేశంచేస్తా. బ్రహ్మచర్య దీక్ష స్వీకరింతువుగాని. నీవు సత్యపథంనుండి తొలగిపోలేదు:"—

అనంతరం సమిధలు తీసికొని రాబడినాయి. సంప్రదాయసిద్ధంగా హోమం జరిగింది. సత్యకామునికి బ్రహ్మచర్యదీక్ష ఇవ్వబడింది. అతడు యథావిధిగా గౌతమ మహర్షికి శిష్యుడై ఆశ్రమవాసి అయ్యాడు.

తరువాత గౌతములు సత్యకాముని పిలిపించి నాలుగువందల చిక్కిపోయిన వట్టిపోయిన ఆవులను ఆబోతులను వప్పజెప్పి యిలా ఆజ్ఞాపించాడు— "సత్యకామా! వీటన్నిటిని తోలుకొనిపోయి జాగ్రత్తగా కాపాడుకో! ఈ పశువులమంద వెయ్యి వరకు పెరిగే పర్యంతం మళ్ళా తిరిగి రాకు." గురువుగారు చెప్పినపని ఎంతకష్టమైనదైనా చేసి సంతృప్తి పరచటం గురుసేవలో ఒకమార్గం. సత్యకాముడు గౌతమ మహర్షి ఆజ్ఞానుసారంగా గొల్లపిల్లవానివలె పశువులను అరణ్యానికి తోలుకొనిపోయాడు.

చాలాకాలం ఆ ఆవులను ఆ బోతులను మేపుకొంటూ కాపాడుకొంటూ ఆ ఘోరారణ్యంలో కొన్ని సంవత్సరాలు సత్యకాముడు గడిపాడు. అతని హృదయం సత్య సాక్షాత్కారం కోసం అన్వేషిస్తూనే ఉంది. అరణ్యంలో అతనికి ప్రత్యక్ష మయ్యే ప్రతి ప్రకృతి రామణీయకత అతనికి ఏదో పాఠాన్ని నేర్పుతూనే వుంది. ప్రేమార్ద్రములైన ఆవులు ఆబోతులు, గుసగుసలాడే చెట్ల ఆకుల గలగలలు, పాటలు పాడే పక్షులు, పరవళ్ళుత్రొక్కే సెలయేరులు, ప్రకాశాన్ని వెదజల్లే సూర్యచంద్రులు, దూరదూరంగా మిణుకు మిణుకు మంటూ పలకరించే నక్షత్రాలు అతనికి అనుక్షణం సందేశాలను అందజేయసాగాయి.

పశువులమంద సహస్ర సంఖ్యగా పెరిగింది. ఆ మందలోని ముసలి ఆబోతు సత్యకాముని సమీపించి యిలా అంది— "సత్యకామా! మా మంద అనుకొన్నప్రకారం వెయ్యివరకు పెరిగింది. మళ్ళీ మీ గురువర్యుల వద్దకు మమ్ములను తోలుకొనిపోయే సమయం ఆసన్నమైంది. సత్యకామా! నీకు బ్రహ్మతత్త్వంలోని ఒక పాదాన్ని గురించి ఉపదేశించాలని ఉంది. విను." సత్యకాముడు 'సరే' అని అన్నాడు. ఆ ఆబోతు యిలా ఉపదేశించింది—

"ఈ ప్రపంచంలోని నాలుగు దిక్కులు ఆ బ్రహ్మతత్త్వంలో ఒక భాగం. అదే ఒక

పాదం. ఆ తత్త్వాన్నిగురించి ఇంకా కొంత నీకు అగ్నిదేవుడు తర్వాత ఉపదేశిస్తాడు."

సత్యకాముడు గౌతమ మహర్షి ఆశ్రమానికి తిరిగి ప్రయాణం కట్టాడు. సాయం సమయం ఆసన్నమైంది. నిప్పు ముట్టించాడు. ఆ అగ్నిజ్వాలకు ఎదురుగా తూర్పుదిశగా కూర్చొన్నాడు. అప్పుడు ఆ జ్వాలనుండి ఇలా సందేశం వినిపించింది.

"సత్యకామా ! నీకు బ్రహ్మతత్త్వాన్ని గురించి మరొక పాదాన్ని గురించి వివరిస్తా. ఈ భూమ్యాకాశాలు, సర్వసముద్రాలు అన్నీ ఆ బ్రహ్మ పదార్థంలో అంతర్భాగాలే అని గ్రహించు. తర్వాత ఒక హంస నీకు మరొక పాదాన్ని గురించి బోధ చేస్తుంది."

సత్యకాముడు ప్రయాణం ముందుకు సాగించాడు. మరునాడు సాయంత్రంకూడ అగ్నిని సమకూర్చుకొని ప్రాగ్దిశగా కూర్చొని ప్రార్థనచేసికొనే సమయంలో ఒక హంస ఎగిరివచ్చి అతనివద్ద వ్రాలి ఇలా చెప్పింది:

"కుమారా ! నేను బ్రహ్మతత్త్వంలో మరొక పాదాన్ని నీకు వివరించటానికి వచ్చాను. నీ ప్రాంగణంలో వున్న జ్వలింప చేయబడిన అగ్నిహోత్రము బ్రహ్మమందు ఒక భాగం, అలాగే సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ ఆ తత్త్వమునందు అంతర్భాగములే. ఒక పక్షి మరొక పాదాన్ని గురించి వివరిస్తుంది. గ్రహించు."

మరునాడు సాయంకాలం మామూలుగా అగ్నిని జ్వలింపజేసి ప్రార్థన చేసే సమయంలో ఒక పక్షి వచ్చి తన సందేశాన్ని ఇలా అందజేసింది.

"బిడ్డా ! నీకు బ్రహ్మతత్త్వాన్ని గురించిన చివరపాదం వివరిస్తా. ప్రాణం బ్రహ్మం, దృష్టి బ్రహ్మం, శ్రవణం బ్రహ్మం, మనస్సు బ్రహ్మం ఇవన్నీ కలిసి బ్రహ్మములో అంతర్భాగములై బ్రహ్మతత్త్వపు ఒక పాదముగా రూపొందినవని తెలుసుకో."

చివరకు సత్యకాముడు గురుపాదులైన గౌతమమహర్షి ఆశ్రమానికి చేరుకొన్నాడు. గౌరవ పురస్సరంగా నమస్కరించి గురువర్యునివద్ద వినయంగా నిలబడ్డాడు. గౌతముడు సత్యకాముని ముఖమండలం చూడగానే ఆనంద పారవశ్యంలో మునిగి "నాయనా ! సత్యకామా ! నీ ముఖం బ్రహ్మజ్ఞానం పొందినవానివలే ప్రకాశమానంగా వెలిగిపోతున్నది. నీకు ఆ బ్రహ్మతత్త్వాన్ని గురించి ఎవరు ఉపదేశించారు బాబూ !"

సత్యకాముడు సమాధానం చెప్పాడు — "స్వామీ ! ముఖ్యంగా మానవేతరములైన జీవరాసులవల్ల నేను ఈ తత్త్వాన్ని గ్రహించాను. మీరుకూడా మీ బోధను అనుగ్రహించండి గురువర్యా ! గురువులేని విద్య ఫలించదని గురూపదేశం లేక నిశ్శ్రేయసం లభించదని పెద్దలు చెప్పగా వింటున్నాం."

గౌతముడు తన వద్దవున్న సర్వవిజ్ఞానాన్నీ సత్యకామునకు ఉపదేశించాడు.





"మీకు భార్య అంటే ఎక్కువప్రేమ' అని ఈ కార్డుమీద ఉంది. అంటే మీ కింకో పెళ్ళాం ఎవరో ఉందన్నమాట. అదెవత్తో చెప్పండి."



"యావండీ - ఈవేళ నేను రెండుజడలు వేసుకోనా, ఒకజడ వేసుకోనా ?"